# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Tuesday, 14th August, 1956**

---

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr Speaker (The Hon Sri R Lakshminarasimham Dora) in the Chair

## I QUESTIONS AND ANSWERS

### STARRED QUESTIONS

*Double lock duty for Sub-Registrars*

78

* 14 Q SRI N C SESHADRI —Will the Hon the Minister for Revenue be pleased to state

(a) whether Sub Registrars are required to attend to double lock duty when the Tahsildar is out of station and

(b) if so, whether they are paid any remuneration for attending to that work ?

THE HON SRI K CHANDRAMOULI —

(a) Yes.

(b) No

SRI N C SESHADRI —Now that the Government have decided to separate treasury branch, will the Hon. Minister consider the desirability of relieving the sub-registrars of the double-lock duty ?

THE HON. SRI K. CHANDRAMOULI — ఇప్పుడేమీ అంత అవసరం [illegible]. అవసరం వచ్చినప్పుడు ఆలోచింతవచ్చును.

*New Sugar Factories in the State*

79.

* [illegible]7 Q. SRI P. GOPALAKRISHNA REDDI — Will the Hon [illegible] for Planning and Industries be pleased to state the number of [illegible] factories functioning in the State and the places where they are lo[illegible]

THE HON SRI K. VENKATA RAO — Prior to September 1953, there were eight sug[illegible] in the area now comprising the [illegible]

Andhra State Since September 1953, the Government of India have granted licences to the following concerns for the establishment of new sugar factories

(1) Messrs, Challapalli Sugars Limited, at Challapalli in Krishna District

(2) Messrs K C P Limited, at Kaikular in Krishna District and Repalle in Guntur District

None of these new factories has started functioning

1947 కు ముందర మనరాష్ట్రంలో 8 పంచదార మిల్లులుండేవి 1953 సెప్టెంబరు మొదలుకొని ఇంతవరకు Govrenment of India వారు Challapalli Sugar Mills Ltd , K C P Ltd , Kaikalur వీరికి కొత్తగా లైసెన్సులనిచ్చారు కొత్తగా లైసెన్సులివ్వబడినట్టి పంచదారమిల్లులు ఇంకా పనిచేయడం మొదలు పెట్టలేదు

SRI PILLALAMARRI VENKATESWARLU — Construction ఏమన్నా సాగుతోందా ?

THE HON SRI K VENKATA RAO —అట్టివాటిలో Construction సాగుతోంది

SRI V VISWESWARA RAO — అధ్యక్షా ! చల్లపల్లికి కైకలూరికి లైసెన్సులు ఎప్పుడు ఇచ్చారు ? అది ఎప్పటినుంచి చెరుకును crush చెయ్యటం ప్రారంభిస్తుంది ?

THF HON SRI K VENKATA RAO — ఇవి 1953 September దరిమిలాను వచ్చాయి రెండింటికికూడాను తారీఖులు కావాలంటే చల్లపల్లి got a licence in 1954 October 1954 లో కైకలూరుకు ఇవ్వబడింది నాకు తెలిసినంతవరకు చల్లపల్లిలో Sugr mills is almost completed Kaikalur లో ఇది ఇంకా కొంచెం early stage లో ఉందనుకొంటాను

SRI P SURYANARAYANA — ఇప్పుడు కొత్తగా start చేయబోతున్న Sugr factories ఎంత కాలంలో start చేస్తారో చెప్పగలరా ?

THE HON SRI K VENKATA RAO — 5 ను గురించి వారు ప్రశ్న వేయలేదు కావాలంటే వారు వెయ్యవచ్చు

SRI C V SURYANARAYANARAJU — 51 వ సంవత్సరంలో ఏమైనా లైసెన్సులుఇచ్చారా? 57 వ సంవత్సరంలో ఏమైనా ఇమ్మని Recommend చేశారా ?

THE HON SRI K VENKATA RAO — ఆరింటికి సిఫార్సు చేశారు ఒకదానికి వచ్చింది మిగిలిన అయిదింటికి ఇంకా లైసెన్సులు రాలేదు ఆ 5 కూడా Co operative Factories

SRI N SREENIVASA RAO — Sugar Factories ను ఎక్కువ ఏర్పాటుచేసి Sugar ఉత్పత్తి ఎక్కువ అయినప్పటికిని Sugar complaints రీత్యా ఈరాష్ట్రంలో ఉంచకుండా ఇతరరాష్ట్రాలకు పంపించేందుకు ప్రయత్నంచేస్తారా?

THF HON SRI K VENKATA RAO —ఏమో? ఏఊరికి ఆఊరిలో Sugar Factory ని పెట్టరు దేశంమొత్తంమీద లెక్కవేస్తారు ఇది భారతదేశమని అస్తమానం జ్ఞాపకముంచుకోవాలి శ్రీనివాసరావు

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అయ్యా చుండూరు Sugar Factory కావాలని అడిగారు దానిసంగతి ఏమైనా ఆలోచించారాండీ ?

THE HON SRI K VENKATA RAO — చుండూరు Sugar Factory కి Government of India వారు licence refuse చేశారు వారు 8 వేల రూపాయల కంటే share capitial ను వసూలుచెయ్యలేదు

SRI PILLALAMARRI VENKATESWARLU — కైకలూరులో యిది యింకా ఎన్నిసంవత్సరాలలో పూర్తిఅవుతుందో? ఏమైనా idea ఇవ్వగలరా?

THE HON SRI K VENKATA RAO — వారు యిచ్చిన సమాచారంప్రకారం ఒక యేడాదిలో మొదలు పెడతారు

SRI A VENKATARAMARAJU — పాలకొల్లు Sugar Factory ని గవర్నమెంటువారు అంగీకరించారని అది Co operative Sugar Factory గా కట్టాలని అనుకొంటున్నారని తెలిసింది అది ఏ stage లో ఉందండి ?

THE HON SRI K VENKATA RAO — పాలకొల్లులో నేమో గవర్నమెంటువారు Co-operative Sugar Facrory ని సిఫారసుచేశారు మొన్న అక్టోబరు ఒకటవతేదీవాట్కి అర్ధమపతం 8 లక్షలు అయినా deposit చేయమని చేసినటువంటి ఆర్డరుకే పాలకొల్లు Sugar Factory తయారుగాలేదు అందుచేత త్వరలో నిర్ణయం చేయబోతున్నాం ఎవరికి అయితే లైసెన్సులు సిఫారస్సు

చేశామో వారుగనుక 8 లక్షల రూపాయలను త్వరలో Deposit చేయలేకపోతే ఆలైసెన్సులను రద్దుచేసి ఇంకొకచోట ఇచ్చేదానికి ఏర్పాటుచేస్తాం

SRI A BAPINEEDU — అధ్యక్షా మేము 8 లక్షలరూపాయలను ప్రోగుచేసినప్పటికి కూడాను ఏలూరు Sugar Factory ని ఏమి consider ation లో పెట్టలేదు ఇప్పుడుఅయినా ప్రభుత్వం దానినిగురించి ఆలోచిస్తుందా?

THE HON SRI K VENKATA RAO — కొవ్వూరు లో ఉన్న Sugar Factory proprietroy concern Co operative sugar factory కాదు ఇప్పుడు Government of India యొక్క policy ఏమిటంటే co operative sugar factory లను ప్రధానంగా encourage చేయాలని అవన్ని fail అయిపోతే ఏమన్నా proprietors' concern ను ఒప్పుకుంటారో ఏమో నాకుతెలియదు

SRI P NARASIMHAPPA RAO — ఇప్పుడు ఇవన్నీ తొందరగా పూర్తి కాకపోతే next month లో ఆలోచిస్తాం వాటిలైసెన్సులను cancel చేయిస్తామని మంత్రిగారు సెలవిచ్చారు ఇప్పుడు సుమారు 5 లక్షలవరకు అయింది మొన్న Madras meeting లో Co operative Registrar గారు ఈ Sugar Factories లో ఉన్న ప్రెసిడెంటులంతాకూడా గవర్నమెంటును request చేశారు దానికి కొంతవరకు సైము ఇమ్మని కొన్ని చాలా వెనుకబడిన ఏరియాలున్నాయి అక్కడ జ్యూట్ లో కొంతవరకు పంట కలిసిరావలిసిఉన్నది దానిమీద డబ్బు వసూలు కావలసిఉన్నదిగదా? వాటినిగురించికూడా సైమును ఏమైనాఇవ్వడానికి ఆలోచిస్తుందా ? లేదా ? మంత్రిగారు తెలవిస్తారా ?

THE HON SRI K VENKATA RAO — నన్ను వ్యక్తిగతంగా అడిగితే ఇదివరకు ఇచ్చిన సైము చాలా ఎక్కువ ఇక్కడపెద్ద కబుర్లు చెప్పేటటు వంటి పెద్దమనుష్యులంతాకూడా బయటచెప్పేవారు కూడా అసలుపనిచేయటం లేదు చోడవరంలో 8 లక్షలు 12 వేలు చెప్పినతారీఖులో వసూలుచేశారు చోడవరంకంటే ఆముదాలవలస వెనుక బడిందికాదు తమయొక్క ధర్మాన్ని నిర్వర్తించనటువంటి సభ్యులొచ్చి ప్రభుత్వాన్ని మొహమాటపెట్టడం న్యాయ మైన విషయంకాదు

SRI J CHANDRAMOULI — అధ్యక్షా, చుండూరులో Sugar factory నిర్మించుటకు కేంద్ర ప్రభుత్వంవారు Permission యివ్వలేదని మంత్రిగారు చెబుతు న్నారు అది అట్లా జరుగుటకు share capitaal లోపమా? ఇంకా ఇతర కారణా లేమైనా ఉన్నాయా?

THE HON SRI K VENKATA RAO — నాకు తెలిసినంత వరకు share capital లేకపోవడం మొదటికారణం సరైన line లో దరఖాస్తు చేయక పోవుట రెండవకారణం

SRI N P CHENGALRAYA NAIDU —అధ్యక్షా మొదటి 3 లక్షల రూ॥లు వసూలు చేసినట్లయితే licence ఇస్తామనీ తరువాత మిగిలిన 7 లక్షల సొమ్ము వసూలు చేయాలనీ అన్నారు ఇప్పుడు 8 లక్షలు చేయాలంటున్నారు ఒకమాటమీద నిలకడలేకుండా రోజుకొక విధంగా మాట్లాడి సొమ్ము వసూలుచేసే విషయంలో డబ్బుగలవారికే సహాయం చేయాలనా? లేక వెనుకబడిన ప్రాంతాల వారిని అణగద్రొక్కాలనే ఉద్దేశ్యంతో ఇట్లా చేస్తున్నారా ?

THE HON SRI K VENKATA RAO — అణగ ద్రొక్కించుకోడం చంగల్రాయ నాయ్డుగార్కి అలవాటు లేనిపనే ఆయనకు ఎప్పుడూ అణగద్రొక్కడమే అలవాటు ఐనప్పటికి చంగల్రాయ నాయ్డుగార్కి ఒకవిషయం మనవి చేస్తున్నాను

ఇది ఒక స్కీముక్రింద వచ్చింది దానిని బాగా చదువుకొని దరఖాస్తులు పెట్టాలి Government of India వారియొక్క స్కీములో ఇట్లాఉంది 'Co operative concern కొంతమొత్తాన్ని వసూలు చేసినట్లయితే అంతవరకు State Government వారు equal గా Share Capital యివ్వాలని ఇచ్చిన Share Capital కు 30 లక్షలు India finance corporation వారు అప్పు ఇవ్వాలనీ అసలునిర్ణయం ఈ నిర్ణయానికి అంగీకరించినచోట sugar factory వస్తుంది దీనికి వెనుకబడ్డ ప్రాంతం ముందుబడ్డప్రాంతం అనేదేమీ లేదు ప్రభుత్వంవారు ఇంకొక స్కీముక్రింద sugar factories పెట్టడంలేదు అందుచేత దీంట్లో వెనక్కు ముందుకు త్రోసేవ్యవహార మేమీలేదు

ఇప్పుడు చిత్తూరులోని sugar factory ని గురించి చంగల్రాయ నాయ్డుగారు బాధపడుతున్నారు

చిత్తూరుకు 30 మైళ్ల దూరంలోనున్న చంద్రగిరిలో ఈనాడు 30 లక్షలు వసూలుచేసి Sugar factory పెట్టడానికి ఒక Private concern సిద్ధంగానున్నారు అందుచేత చిత్తూరు వెనుకబడ్డ ప్రాంతమని చంగల్రాయ నాయ్డుగారువంక చూపిస్తున్నారు

చిత్తూరులో 8 లక్షలు ముందుగా వసూలుచేసినట్లయితే sugar factory ను as a registered concern కింద register చేస్తామని చెప్పాము అంతేగాని 8 లక్షలు వసూలు చేస్తే Sugar factory వస్తుందని మేము చెప్పలేదు దరఖాస్తులు పెట్టినవారు వస్తుందనుకోలేదు

Mr SPEAKER — It is a very long statement

THE HON SRI K VENKATA RAO — వీరు allegation పెట్టారు జ్ఞాపకం చేసుకోండి

8 లక్షలు వసూలు చేయకపోవడం మొదటి విషయం అయినప్పటికీకూడా Registrar గారికి special D O వ్రాసి ఈ Society ని కూడా register చేశాము తరువాత కేంద్రప్రభుత్వంవారు "State Government వారు ఇవ్వవలసిన share Capital లోని భాగం 8 లక్షలు ముందుగా deposit చేస్తేనేగాని loan యివ్వము అని వ్రాశారు ఈ సంగతి వారికి communicate చేశాము

ఇంకా రాయలసీమ వెనుకబడ్డ ప్రాంతమనే అపోహవుంది కనుక మిగిలిన సర్కారు జిల్లాలలోని factory లకు share capital 15 లక్షలు, రాయలసీమ ప్రాంతంలోని factorys కు share capital 1½ లక్షలు వసూలుచేయాలని నిర్ణయించాము అది వెనుకబడ్డ ప్రాంతాలవారిని అణగద్రొక్కడంక్రింద వస్తుందో, మంత్రిగారు వారి ఇష్టప్రకారం వ్యవహరించడముక్రిందకు వస్తుందో లేక ధరఖాస్తులుపెట్టినవారు స్థానికంగా ఇతర కారణాలవల్ల డబ్బు వసూలు చేయకపోవడంక్రిందకు వస్తుందో నాకు అర్థం కావడంలేదు

SRI N P CHENGALRAYA NAIDU — చిత్తూరులో Sugar factory కావాలని అడిగింది రైతులదగ్గరనుంచి డబ్బు వసూలుచేసేందుకు చంద్రగిరిలో అడిగింది మద్రాసులోని ధనవంతుల దగ్గరనుంచి డబ్బు తెచ్చి పెట్టేందుకు ఈ సంగతులు మంత్రిగారికి తెలుసునా ?

THE HON SRI K VENKATA RAO — చంద్రగిరిలో ధరఖాస్తు పెట్టినవారు M L A , చిత్తూరులో ప్రోత్సహించినవారు M L A , ఇద్దరి M L A ల విషయం పోల్చిచూస్తే చంద్రగిరిలో M L A కు చిత్తూరులోని M,L A గారికి వున్న ఆస్తిలో 4 వ వంతుకూడా లేదని నేను ఘంటాపధంగా చెప్పగలను

*Introduction of one year Secondary Grade Training Course*

76

* 73 Q SRI S VEMAYYA —Will the Hon. the Chief Minister be pleased to state

(a) whether the Government propose to introduce one year Secondary Grade Training Course this year ,

(b) if so, the places at which such training centres will be opened, and

(c) whether all the candidates will be paid stipend ?

THE HON Dr B GOPALA REDDI —

(a) Yes

(b) The new one year Secondary Grade Traing Course will be introduced from 1956 57 in 6 Government Secondary and Training Schools for Men at Chittoor, Masulipatam, Ongole, Anantapur, Srikakulam and Amalapur and in two Government Secondary and Training Schools for Women at Madanapalli and Visakhapatnam

(c) The answer is in the affirmative

SRI S VEMAYYA — మిగతా Secondary Grade Training Schools లో కూడా ఒక సంవత్సరం course ప్రవేశపెట్టుటకు ప్రభుత్వంవారు ప్రయత్నిస్తారా ? ప్రయత్నించినట్లయితే ఎప్పటినుంచి ప్రవేశపెడతారు ?

THE HON Dr B GOPALA REDDI — ఈ విషయాన్ని ఇంకా ఆలోచించలేదు ఈ సంవత్సరమే ఈ ఒక సంవత్సరం course ప్రారంభమైంది దీనికి మంచి మార్కులు వచ్చిన విద్యార్థులను మాత్రమే తీసుకొంటున్నారు Intermediate pass అయిన వారిని S S L C లో తెలుగులోనూ ఇంగ్లీషులోనూ 40% వచ్చి average గ 50% వచ్చినవారిని మాత్రమే తీసుకొంటున్నారు ఈ సంవత్సరం దీనికి candidates వస్తారో రారో అని భయంగావుంది కాని అన్ని Schools లోనూ strength బాగానేవుంది ఇటువంటి Schools ను ఇంకా ఎక్కువ చేయడానికి ప్రభుత్వంవారు ఆలోచిస్తారు

SRI T JIYYAR DASS — అధ్యక్షా Secondary grade training teachers కు Pre Primary and Special Schools మన ఆంధ్రరాష్ట్రంలో లేవు దానికి తగిన Secondary Teachers లేరు Kinder garten method మీద Pre-Primary Training Schools మన రాష్ట్రంలో ఏర్పాటుచేసే ప్రయత్నం చేస్తారా ? ఇప్పుడు మద్రాసులోని kinder garten method మీద secondary training schools మద్రాసులో ఉన్నాయి మన ఆంధ్రులు కొంతమంది అక్కడ చదువుతున్నారు వీరు ఆంధ్రులగుటవలన వీరు fees కట్టవలసి వస్తోంది ఈ విషయంలో ప్రభుత్వం ఏమైనా మార్పులు చేస్తుందా ?

THE HON Dr B. GOPALA REDDI — Secondary grade training schools విషయం మాట్లాడుతోంటే pre-primary training schools విషయం ఎందుకు ? వేరే ప్రశ్న వేయాలి

SRI K SUBBA RAO — ఈ నాడు ఆపద్ధర్మంగా ఒక సంవత్సరం మాత్రమే బోధన యిచ్చే పద్ధతిని ఒప్పుకున్నారు ఈ ఒక్క సంవత్సరం లోపల

బాలుర మనస్తత్వశాస్త్రాన్ని గ్రహించి చక్కని బోధనాపద్ధతిని నేర్చుకొని ప్రవర్తించ గలరని ప్రభుత్వం యొక్క అభిప్రాయమా ?

THE HON Dr B GOPALA REDDI —వాటికి ఏలాంటి శంకలూ లేవు దాదాపు 11 మాసాలు పనిచేస్తుంది మరియూ గారు SSLC నుంచి ఎక్కువ మార్కులు వచ్చినవారూ Itermediate pass అయినవారు వారంతా సరైన candidates అని తొందరగా training అయి మంచి ఉపాధ్యాయులు కాగలరని ప్రభుత్వం ఆశిస్తున్నది ఎమైనప్పటికిన్ని expermental గా చూస్తే వారే మంచి ఉపాధ్యాయులు కాగలరు

SRI M NAGI REDDI —అధ్యక్షా ! ఒక సంవత్సరం secondary grade training చదివేవారికి stypends యిస్తున్నామని మంత్రిగారు చెబుతున్నారు 2 సం॥ లు training అయ్యేవారికి stypend యివ్వరని వారిజనులైతే యిస్తామని G O issue చేసినట్లు చెబుతున్నారు 2 సం॥ లు చదివేవాళ్లు కూడా బీదవాళ్ళుంటారు 2 సం॥ లలో ఖర్చుకూడ ఎక్కువగా వుంటుంది వారు యితర చదువులు చదువుటకు తాహతులేకనే దీనికి వస్తున్నారు కాబట్టి వారికి కూడా stypends యివ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON Dr B GOPALA REDDI —అట్టివారికి stypends యివ్వడం మానివేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుంది (నవ్వులు)

వారంతా తెలివైనవారు S S L C లో మంచి మార్కులు వచ్చినవారు ఒక సంవత్సరంలో training అయి ఉపాధ్యాయులుగా అవ్వాలనివారి ఉద్దేశ్యం

ఈ మధ్యవరకు S S L C లో 20 25 మార్కులు వచ్చినప్పటికి కూడా secondary grade training schools లో చేర్చుకునేవారు ఇప్పుడు కనీసం 35 మార్కులు రావాలని G O issue అయింది Intermediate pass అయిన వారు తెలివైనమంచి విద్యార్థులకు stypends యివ్వడం న్యాయం తీరికగా 2 సం॥ లు చదువుకొనేవారికి stypends యివ్వనవసరం లేదనుకుంటాను కాని వారికి మానేసే విషయంలో ప్రభుత్వం తీవ్రంగా ఆలోచిస్తుంది (నవ్వులు)

SRI S RANGANATHA MUDALIAR —Will the Hon Minister be pleased to state why no Tamil section was opend in the Training School Chittoor in respect of the new one year Secondary Training Course ?

Tamil Section has been opened for the two year course, but not for the one-year course

THE HON Dr B GOPALA REDDI —This is meant for students who have passed Intermediate Examination generally and for people who have obtained very high marks in the S S L C Examination We do not know whether there will be sufficient number of students for the S S L C one year course that has to be investigated

SRI S RANGANATHA MUDALIAR —No applications were called for, there were a number of applicants enough students for one class

THE HON Dr B GOPALA REDDI —Tamil section you mean, we will consider about it

SRI VAVILALA GOPALAKRISHNAYYA — One year course లోకన్న 2 సంవత్సరాల course లోనే చాల నిపుణులుగా ఉండి Probation time లోనే చాల top లో వస్తున్నపుడు వాళ్లకు తక్కిన 6 నెలలు దీనిలో సౌకర్యం కలిగేటటువంటి ఏర్పాటు చేస్తారా ? Government వారు చెప్పినట్లు free primary education ఏర్పాటు చేస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — ఇప్పుడు Primary schools నే సక్రమంగా నడిపించుకోలేక పోయినప్పుడు free basic లు free primary ల గురించి ఆలోచించడానికే వీలులేదు

SRI PILLALAMARRI VENKATESWARLU — మంత్రిగారు సమాధానం చెప్తూ వాళ్లకు ఇచ్చేటటువంటి stypends ను ఇవ్వకుండా ఆపుచేయడానికి ఆలోచిస్తామని చెప్పారు కనీసం సంవత్సరం మధ్యలో అయినా దీనిని ఆపుచేయకుండా చేస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — మీకు ఆ assurance ఇస్తాం అది ఈసంవత్సరానికి సంబంధించినది కాదు 1957 జూలై కి సంబంధించినది

SRI N SREENIVASA RAO — వీరినిగురించి ఆలోచిస్తామనిచెప్పారు వీరు అన్నవారిలో స్త్రీలు హరిజనులు ఉన్నారా? లేకపోతే వీరిద్దరిని మినహాయించి ఆలోచిస్తారా ?

THE HON Dr B GOPALA REDDI — అది మేము చెప్పలేకుండా ఉన్నాము Director of Public instruction ని అడుగుతున్నాము మామూలుగా two years course లో స్త్రీలకు, హరిజనులకు అందరికి stypend యిస్తున్నారు One year course లో కూడా ఈసంవత్సరము అందరికీ యిస్తున్నారు లేకుండా చేసినపుడు స్త్రీలకు హరిజనులకు ఏమౌతుందనే ప్రశ్న అది తరువాతచూస్తాము

*Electricity for lift irrigation to Damuluru and Kotikalapudi villages in Krishna district*

80

* 169 Q SRI V VISWESWARA RAO — Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether it is a fact that the villagers of Damuluru and Koti kalapudi in Vijayavada in Vijayavada taluk Krishna district, requested for electricity for lift irrigation and

(b) if so the action taken thereon ?

THE HON SRI G LATCHANNA —

(a) and (b) It is presumed that the Member refers to the request for extension of electricity supply to the pumping loads of Enugulavagu The scheme therefor and the scheme for extension of supply to Kotikala pudi and Damalur have been finalised The sponsors of the pumping installations have been advised to obtain the permission of the concerned authorities for pumping water from the vagu and their reply is awaited by the Chief Engineer (Electricity)

(a) అవునండి

(b) దరఖాస్తులు చేసినటువంటివారికి P W D (Irrigation Department) వారిదగ్గరనుంచి pumping scheme కు permission తెచ్చుకోవలయుందని తెలియ జేయడమైనది వారి జవాబు ఇంకా రాలేదు

SRI V VISWESWARA RAO —రెవెన్యూ డిపార్టుమెంటు వారు అక్కడ pump set పెట్టుకోడానికి permission ఇచ్చారు వెంటనే దీనినిగురించి చర్యతీసుకొంటారా ?

THE HON SRI G LATCHANNA — Permission ఇచ్చారని విశ్వేశ్వరరావుగారికి తెలుసునేమోగాని ప్రభుత్వానికి తెలియదు

*Mahajar from the handloom weavers of Ghantasala for registration of co operative society*

81

* 236 Q SRI P SATYANARAYANA Will the Hon the Minister for Co operation and Commercial Taxes be pleased to state

(a) whether the Government have received a Mahajar, dated 12th April 1956 with 144 signatures from the Handloom Weavers of Ghanta sala village in Divi taluk of Krishna district requesting registration of a Handloom Weavers Co operative Society and

(b) if so, the reasons for not registering the society so far ?

THE HON SRI D SANJIVAYYA —

(a) Yes, Sir

(b) There is already a weavers co operative society at Ghantasala village and the organisation of another society in the same village is not desirable

SRI V VISWESWARA RAO — అధ్యక్షా ఇదివరకే Society ఉన్నదని చెపుతున్నారు చాల ఎక్కువమంది అంటే సుమారు 144 మందికి పైగా సంతకాలు పెట్టి వేరే Society కావాలని కోరుతున్నారు వీరినెవరిని కూడా ఇదివరకున్న Society లో చేర్చుకోవడం కూడా జరగడంలేదు 100 మందిపైన ఉన్నారుకాబట్టి G O ప్రకారము వెంటనే Society ఏర్పాటు చేయడానికి ప్రభుత్వము పూనుకొంటుందా?

THE HON SRI D SANJIVAYYA — క్రొత్తవాళ్లను చేర్చుకోవడానికి వారు సంసిద్ధంగానే ఉన్నారు

SRI B SANKARAIAH — ఒక Society ఉన్నప్పుడు రెండో Society పెట్టడంలేదా? ఇకమీదట కొన్నిచోట్లపెట్టి కొన్నిచోట్ల పెట్టకుండాఉండే విధానాన్ని మానివేయడానికి ప్రయత్నం చేస్తారా?

THE HON SRI D SANJIVAYYA — కొన్నిచోట్ల పెట్టినాము రెండుచోట్ల అవి బాగానే పనిచేస్తున్నాయి ఘంటసాలలోకూడా మొదట రెండు Society లు ఉండేవి రెండు Society లు కూడా rivalry వల్ల liquidate అయిపోయి మరల క్రొత్త Society ని ఏర్పాటు చేసినాము ఇక రెండో Society ని పెట్టమని అడిగితే గతచరిత్ర జ్ఞాపకానికి వస్తున్నది

SRI N SRINIVASA RAO —అధ్యక్షా చాల హెచ్చుమంది Harijan weavers ఉన్నటువంటి area లు ఎక్కువగా ఉన్నవనే కారణంచేత registration జరగడంలేదు ఆవిషయం మంత్రిగారి దృష్టిలోకికూడా వచ్చింది Co operative Department లో ఉండేటటువంటి ఉద్యోగులలో సహకారానికి బదులు నిరాకరణ ఎక్కువగా ఉండినది దీనినిగురించి దర్యాప్తు చేస్తారా ?

THE HON SRI D SANJIVAYYA — Harijan weavers కు కూడా అక్కడక్కడ కొన్ని Society లు ఏర్పాటు చేశాము ఇంకా కొన్నిచోట్ల ప్రత్యేకంగా Society కావాలంటే ఏర్పాటుచేస్తాము ఉద్యోగస్తులు నిరాదరణ చూపుతున్నారనే విషయాన్ని మేము అంగీకరించము

SRI S VEMAYYA — ఉన్న Society లలో చేర్చుకొనేదానికి ఇప్పుడు సంసిద్ధంగా ఉన్నారని అన్నారు అంటే వాళ్లు సంసిద్ధంగాలేరు వాళ్ళను ఇబ్బంది పెట్టాలని అర్థం అవుతున్నది అందువల్ల area of the operation divide చేసి వీళ్లకు కూడా ప్రత్యేకంగా register చేసినట్లయితే చేర్చుకోపోవడం అనేది ఉద్భవించదు కరుక దీనినిగురించి ఆలోచిస్తారా ?

THE HON SRI D SANJIVAYYA — అప్పటికి రెండు society లు ఉన్నాయి రెండు కూడా rivalry వల్ల liquidate అయిపోయినందున మరల ఒక క్రొత్త society ని పెట్టినారు ఈ 144 మందిని చేర్చుకోవడానికి వాళ్ళ office bearers సంసిద్ధంగా ఉన్నారని చెప్పాను

*Starting of a Panchayat Co operative Bank*

82

* 134 Q SRI S VEMAYYA —Will the Hon the Minister for Local Administration and Prohibition be pleased to state

(a) whether the Government are in receipt of the report of the Iuspector General of Local Administration regarding the starting of a Panchayat Co operative Bank to finance the panchayats , and

(b) if so, the action taken thereon ?

THE HON SRI A B NAGESWARA RAO —

(a) The answer is in the negative

(b) Does not arise

SRI S VEMAYYA — ఇటువంటి ఆలోచన ఆ ప్రభుత్వము ఎదుట లోగడలేదా ? ఇకమీదట ఉండదా ?

THE HON SRI A B NAGESWARA RAO — ఇది ప్రభుత్వము ఎదుట లేదు Inspector General of Local Administration ఆలోచిస్తున్నారు

SRI N C SESHADRI — అసలు ఈ Panchayat Co operative Banks అనేవి మన State లో ఎక్కడైనా ఉన్నాయా ?

THE HON SRI A B NAGESWARA RAO — ఎక్కడా లేవు ఇప్పుడు ప్రారంభించాలనే అభిప్రాయం ఆయనకు ఉన్నది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — వారికి ఆ అభిప్రాయం ఉన్నది గవర్నమెంటు అభిప్రాయం ఏమిటి ?

14th August 1956]

THE HON SRI A B NAGESWARA RAO —ఈ report పంపిం చిన తరువాత విమర్శన చేస్తాము

SRI G NARASIMHA MURTHY — Inspector General of Local Administration వారి అభిప్రాయాన్ని మంత్రిగారు తెలిపినారు ప్రభుత్వ అభిప్రాయానికి Inspector General వారి అభిప్రాయానికి సంబంధం ఉంటుందా?

THE HON SRI A B NAGESWARA RAO — రెంటికి సంబంధం ఉంటుంది వారి రిపోర్టు పంపించినతరువాత ప్రభుత్వము ఆలోచించి సంప్రదింపులు జరుపుతుంది

*Assingnment of Forest Banjar lands from Kamepalli Reserve Forest, etc, of Sattenapalli taluk to poor Harijans, etc*

83

* 96 Q SRI VAVILALA GOPALAKRISHNAYYA —Will the Hon the Minister for Agriculture be pleased to state

(a) whether the Government have received any applications from the poor Harijans and Christians from Kamepalli Reserve Forest, Peda nemalipuri and Beeravallipaya of Sattenapalli taluk for ass'gnment of Forest Banjar lands, and

(b) if so, the action taken thereon?

THE HON SRI K OBULA REDDI —

(a) Yes, Sir A representation from the Hon ble Member himself on behalt of the Forest Banjar cultivators of Sattenapalle taluk was received in July '55

(b) The Government expressed their inability to comply with the request for assignment of the Forest Banjar lands asked for, as they are required for departmental plantation under the Five Year Plan

గౌరవనీయులైన సభ్యులే 1955 వ సంవత్సరంనుంచి విజ్ఞప్తులు పంపి స్తున్నారు ఇవి ఇవ్వడానికి వీలులేదని ప్రభుత్వము స్పష్టపరచింది దీనికి కారణం ప్రభుత్వ యాజమాన్యంక్రింద నే Forest Department వారు forest లను పెంచా లనే ఉద్దేశ్యము

SRI VAVILALA GOPALAKRISHNAYYA — వీనిలో కొన్ని కుమరి System మీద ౦ పంవత్సరాలవరకు కౌలుకిచ్చారు వాటిని ఆ 5 సంవత్స రాలు పూర్తిచేసుకొనేవరకైనా ఇస్తారా? తక్కినవన్నీ reconsider చేస్తారా?

THE HON SRI K OBULA REDDI — Kumri cultivation అనే ఎరకు ఉంటుంది కాని కౌలు తీసుకొన్నవారు కుమ్రీని ఇక్కడ అమలు జరపడం లేదు అందువల్ల కుమ్రీ అమలు జరపకపోవడమే కాకుండా ప్రభుత్వము వారే కుమ్రీ కొరకు Supply చేసిన వారునుకూడా వారు విధ్వంసము చేశారు

SRI M NAGI REDDI — అధ్యక్షా ఈ బంజరు భూములను చాల సంవత్సరములనుంచి చేసుకొంటున్నారు వీటివల్ల చాల నష్టపడ్డారు అయినప్పటికి కూడా ప్రభుత్వం ఇంకా ఎదో Plantation చేయాలని అంటున్నారు కాని Forest బంజర్లకు సంబంధించినంతవరకు ప్రక్కన ఉన్నటువంటి రాజకీయ బాధితులకు ఇవ్వడానికి ఆక్షేపణలేదు plantation అవసరంలేదు అని అంటున్నారు అక్కడ చెట్లు చేమ ఏములేదు కాబట్టి దయచేసి ఎన్నో సంవత్సరాలుగా చేసుకొనేవారికి వాటిని ఇవ్వడానికి ప్రభుత్వము పునరాలోచిస్తుందా ?

THE HON SRI K OBULA REDDI — ఇట్లాంటి నేరారోపణకు ఏమీ ఆధారం లేదు

SRI N SRINIVASA RAO — అధ్యక్షా Forest ప్రాంతాలనేటటు వంటివి కేవలం Map లో green ink లో మాత్రం వేసిఉన్నది కాని 30 సం॥ రాల నుంచి అందులో forest వేయడం జరగలేదు వ్యవసాయం చేయడానికి వీలు లేకుండా waste గా పడిఉన్నాయి ఇదివరకే నేను ప్రభుత్వానికి ఆ రికార్డులు దస్తావేజులు మ్యాపులు Supply చేశాను మళ్లీ Supply చేయడానికికూడా సిద్ధంగా ఉన్నాను కాబట్టి దీని విషయంలో వేస్తే అరణ్యం చేయడంగాని లేక వ్యవసాయానికి ఇచ్చేందుకుగాను ప్రయత్నం చేస్తారా ?

THE HON SRI K OBULA REDDI — అలాంటి లోట్లు ఏవైనా ఉన్నట్లయితే ప్రజలనుంచిగాని బాధ్యత తెలిసిన నాయకులనుంచిగాని సరియైన సహకారం లేకపోబట్టే జరుగుతున్నవి

*Secondary Grade Teachers of Rayalaseema*

84

* 101 Q SRI P HANUMANTHA REDDI —Will the Hon the Chief Minister be pleased to state

(a) whether the Government propose to allow the secondary grade teachers of Rayalaseema who have graduated at the Madras University and undergone three months training in B T course, to appear privately for the B Ed Examination of the Andhra University, and

(b) if not why?

14th August 1956 ]

THE HON Dr B GOPALA REDDI —

(a) The Andhra University has decided to extend the concession asked for

(b) Does not arise

*Additional pay for the village Officers*

86

*91 Q SRI VAVILALA GOPALAKRISHNAYYA —
SRI M NAGI REDDI —Will the Hon the Minister for Revenue be pleased to state

(a) whether any Village Officers in the State requested Government for additional pay for the additional work like (i) enumeration of land holdings, (ii) collection of land revenue surcharge, etc , performed by them and

(b) if so, what amount Government are pleased to pay them ?

THE HON SRI K CHANDRAMOULI —

(a) The answer is in the affirmative

(b) An honorarium of Rs 3/ per Karnam has been sanctioned for attending to each of the additional items of work relating to the Land Census and the Andhra Land Revenue (Surcharge) Act, 1956

SRI M NAGI REDDI — కరణంగారికి మాత్రం sur charge లెక్కలు తయారుచేయడానికి మూడు రూపాయలు అదనంగా ఇస్తామన్నారు కాని వసూలు చేయవలసిన బాధ్యత మునసబుగారిమీద ఉంటుంది అట్లాగే వసూలుచేయడానికి ఈ మునసబులతోటి వెట్టి మోతాదులుగూడా వెళ్లాలి వీళ్లంతా ఆ collections లో పాల్గొనాలి కాబట్టి వీళ్ళకు ఏమైనా ఇవ్వడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON SRI K CHANDRAMOULI — లెక్కలు తయారు చేయడమనేది కష్టమైన విషయము వసూలుచేసే విషయమంటే ఇదొక్కటే ప్రత్యేకంగా వసూలుచేయడానికి వెళ్ళరు దీనితోపాటు ఇంకా ఇతర వసూళ్లుకూడా ఉంటాయి వాటితోపాటు ఇదికూడా జరుగుతూఉంటుంది లెక్కలు ప్రత్యేకంగా తయారు చేయువలసియుంటుంది కాబట్టి కరణానికి ప్రత్యేకంగా ఇవ్వబడుతుంది

SRI K SUBBA RAO — ఈమూడు రూపాయలు అనేటటువంటిది ఇన్నిగంటలు ఈపని ఉంటుందని దానికి వినియోగించే కాలమునుబట్టి ఇచ్చారా లేకపోతే ఊరికే చూచాయిగా మూడురూపాయలుయిస్తే సరిపోతుంది అనే ఉద్దేశంతో ఇస్తున్నారా ?

[14th August 1956

THE HON SRI K CHANDRAMOULI — గంటలు నిమిషాలు ప్రకారం కాదండి ఏదో ఈపనికి మూడురూపాయలుయిస్తే ఒక మోస్తరుగా ఉంటుందని ఇస్తున్నాము

SRI VAVILALA GOPALAKRISHNAYYA —ఇప్పుడు ఈ accounts తయారుచేయడానికి ప్రత్యేకంగా ఈమొత్తము ఇస్తున్నారని అన్నారు వాళ్ళకు ఇంకా additional work చాలా వస్తున్నది మొట్టమొదట ఏఉద్యోగాలకు వాళ్లను నియమించారో ఆఉద్యోగాలకే కాకుండా నేడు Departments చాలా పెరిగి నందువల్ల వారికి ఎక్కువపని ఇస్తున్నారు కనుక ప్రత్యేకంగా ఈ accounts కొరకు మూడురూపాయలు honorarium అనేది కాకుండా మొత్తము వాళ్ళకు అదనంగాఉన్న పనినిబట్టి వాళ్ళజీతాలలో ఏదైనా కొంత హెచ్చుగా ఇస్తారా ?

THE HON SRI K CHANDRAMOULI —ఆ ఆలోచనఏమిలేదండి

SRI S NARAYANAPPA — N G O లకు ఇస్తున్నటువంటి విద్య వైద్యసౌకర్యాలు గ్రామ కరణాలకు మునసబులకుకూడ అన్వయించేటట్లు ప్రభుత్వము ఏదైనా ఉత్తరువులు పంపించారా ? లేకపోతే ఆలోచనచేస్తారా ?

THE HON SRI K CHANDRAMOULI— అది ఈప్రశ్నకు ఏమి సంబంధంలేదు అయినా ఉత్తరువులు పంపించామని చెప్పుతున్నాను

SRI P NARASIMHAPPA RAO — అధ్యక్షా ఇవి taken over villages కు మాత్రం ఇస్తున్నారని మంత్రిగారు సెలవిచ్చారు కాని మిగతా రైత్వారీ villages ఉన్నాయి వాటికికూడా surcharge లెక్కలు తయారు చేస్తున్నారు వాళ్ళసంగతి ఏమి ఆలోచిస్తున్నారు ?

(No answer)

*Underground drainage scheme at Vijayawada*

87

*223 Q SRI M NAGI REDDI —Will the Hon the Minister for Planning and Industries be pleased to state

(a) the estimated cost of the underground drainage scheme started at Vijayavada and

(b) in how many years the scheme will be completed?

THE HON SRI K VENKATA RAO —

(a) The Scheme is estimated to cost Rs 73 lakhs to instal and Rs 86,000/- to maintain annually

(b) The Scheme is proposed to be completed in eight years

(ఎ) విజయవాడలోని భూగర్భ కశ్మల జలప్రవాహంకోసం 73 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది సాలుకు రక్షణకోసం 86 000 రూపాయలు ఖర్చు అవుతుంది

(బి) ఈ scheme ఎనిమిది సంవత్సరాలలో పూర్తిఅవుతుంది

*Additional seat to the panchayat of Kapileswarapuram in Gannavaram taluk*

88

*246 Q SRI V VISWFSWARA RAO —Will the Hon the Minister for Local Administration and Prohibition be pleaced to state

(a) whether the Government received any memorandum from the village of Kapileswarapuram in Gannavaram taluk of Krishna district stating that the additional seat was not allotted to the panchayat in accordance to the proceedings of the Inspector General of Local Administration and

(b) If so, the action taken thereon by the Government?

THE HON SRI A B NAGESWARA RAO —

(a) The answer is in the affirmative

(b) The Government have examined the question and decided not to interfere with the allotment of additional seat made by the District Panchayat Officer, Krishna in accordance with the instructions given in G O Ms No 334 L A dated 2 3 1956 prior to the receipt of instructions of the Inspector General of Local Administration in the matter

SRI V VISWESWARA RAO — అధ్యక్షా ఈ పంచాయితీబోర్డు ప్రెసిడెంటు seat allot చేసేటప్పుడు Local Administration Inspector గారు ఇచ్చినటువంటి సూచనలను District Panchayat Officer గారు తిరస్కరించడం జరిగింది దానిని పూర్తిగా violate చేసినారు అందువల్ల మంత్రిగారి దృష్టికి తీసుకురావడం జరిగింది కాని ఆ G O No 334లో కలుగజేసుకోకూడదని వారు చెప్పుతున్నారు ఆ D P O కు Inspector of Local Boards ఇచ్చినటువంటి instructions ఎందుకుగాను ఉల్లంఘించారు అనేదానికి సమాధానం చెప్పలేదు

THE HON SRI A B NAGESWARA RAO — Inspector of Local Boards 27వ తారీఖున ఇచ్చిన Circular ఆయనకు 31వ తారీఖున అందింది ఆదివరకు 2-3-56 తారీఖున ఇచ్చిన G O 334 ప్రకారం 28వ

తారీఖున ఆయన notify చేయడం జరిగింది దీనిని తిరిగి మార్చుకోడానికి ఆయనకు హక్కులేదు కనుక ఆయన మార్చుకోలేదు

SRI M NAGI REDDI – Inspector of Local Boards యొక్క order రాగానే D P O గారు ఇచ్చారు ఎట్లా ఇచ్చినప్పటికీ వారు న్యాయం పరిశీలించకుండా ఎక్కువవోట్లు ఉన్నదానికి additional seat allot చేయకుండా తక్కువ వోట్లు వచ్చినదానికి ఎందుకు చేయవలసి వచ్చింది ?

THE HON SRI A B NAGESWARA RAO — G O No 334 ప్రకారం ఆయన నాలుగుఊళ్లలో అటువంటి seat allot చేశాడు - మైలవరం గుర్లవల్లేరు ఇంకా రెండిటిలో ఈ నాలుగు ఊళ్లలోకూడా ఒకే policy ని అవలంబించారు ఆ పాలసీ చెబుతాను

| | | | | |
|---|---|---|---|---|
| ఒకటవ | వార్డుకు | 840 | వోటు | ఉన్నవి |
| రెండవ | | 535 | | |
| మూడవ | | 736 | | |
| నాల్గవ | | 732 | | |
| అయిదవ | | 263 | | |

వీటికి number of seats ను బట్టి ప్రతి seat కు ఒకటి add చేసి divide చే ఏ ward కు co effitient ఎక్కువగావస్తే ఆ ward కు ఇచ్చారు అది first ward కు వచ్చింది

SRI V VISWESWARA RAO — అధ్యక్షా, ఈ additional seats allot చేసేటప్పుడు ముందుగానే కర్నూలులో పంచాయితీ ఆఫీసర్లందరూ కూడా meeting జరిపి ఆ మీటింగులో మంత్రిగారు Local Boards Inspector గారు కొన్నిసూచనలు ఇచ్చారు ఆసూచనలు అనుసరించే ఈ G O కూడా వచ్చిందని అనుకొన్నాను ఆ సూచనలకు వ్యతిరేకంగా ఈ allotment ఎందుకు జరుగవలసి వచ్చిందో మంత్రిగారు సెలవిస్తారా ?

THE HON SRI A B NAGESWARA RAO — సూచనలకు వ్యతిరేకంగా జరగలేదు గవర్నమెంటువారు ఇచ్చిన order ప్రకారంగానే జరిగిందని మనవిచేసుకొంటున్నాను

SRI B V SIVAYYA — ఈ పంచాయితీలకు additional seats allot చేయడంలో సుమారు 10 15 పంచాయితీలలో తక్కువ వోటర్లు ఉన్న వార్డులకే allot చేయడం జరిగింది గుంటూరుజిల్లాలో ఆవిధంగా ఆఫీసర్లు ఒప్పుకొన్నారు

కాని appeals పెట్టిన తరువాత అది clerical mistake అని చెప్పారు ఈవార్డులలో వేటికి ఎక్కువ వోటర్లు అని తేల్చడంలో పదివందలు వోటర్లు ఉన్నదానికి 11 వందలు 9 వందలున్నదానికి 19 వందలని వేసి ఆవిధంగా additional seat ఇచ్చారు అదేమిటి అని explanation అడిగేటప్పటికి అది clerical mistake అని ఒకసారి notification అయిపోయిన తరువాత దానిని మార్చడానికి వీలులేదని అంటున్నారు కాని ఆ G O లో appeal powers కూడా లేవు కనుక అలాంటి తప్పులు జరిగినచోట వాటి revision కు ఏమైన provision కల్పిస్తారా అని మంత్రి గారిని అడుగుతున్నాను

THE HON SRI A B NAGESWARA RAO —ఇటువంటి తప్పులు జరిగిన వాటిమీద 246 writs వేశారు. ఆందులో 220 230 writs dismiss చేయడంకూడా అయిపోయింది ఒక వేళ వారేదైన పొరబాటుచేసినారని specific instances ప్రభుత్వదృష్టికి తీసుకొనివస్తే తప్పకుండా విచారిస్తాము

*Stipend for Sheduled and Backward Class students undergoing Secondary Grade Teachers Training*

89

181 Q SRI P GUNNAYYA —Will the Hon the Chief Minister be pleased to state

(a) the amount of stipend the Government propose to sanction from this year onwards for each student belonging to Scheduled and Backward Classes for undergoing Teachers Training in the Secondary Grade, and

(b) the qualification that a candidate should possess, if he is to undergo this training for one year only?

THE HON Dr B GOPALA REDDI —

(a) Candidates belonging to Scheduled Castes and Scheduled Tribes and Backward Classes admitted to the Secondary Grade Training course will continue to be paid stipends at the usual rate of Rs 18/ p m

(b) Candidates who have passed or completed Intermediate and also those who have passed the S S L C Examination securing 50% of marks in the aggregate and at least 40 in English as well as in Telugu will be eligible for admission to the new oneyear Secondary Grade Training Course.

SRI P GUNNAYYA —పూజ్యులు మంత్రిగారు బడ్జటులో కూడా తెలుగులో మాట్లాడారు అలాంటప్పుడు ఇలాంటి ప్రశ్నకు తెలుగులో ఎందుకు

సమాధానమివ్వలేదో తెలియదు కాబట్టి దానిని తెలుగులో చెప్పి ఆ training students యొక్క stipends హెచ్చించడానికి ప్రయత్నిస్తారా ?

( No answer )

SRI M NAGI REDDI —మంత్రిగారు చెప్పినటువంటి marks, School Final లో వచ్చికూడా కొంతమందికి one year training కు seat దొరకక రెండేళ్ళు training చదవడం కూడ జరుగుతోంది పోని కనీసం అట్లా మార్కులు వచ్చినవాళ్ళకు ఈ రెండు సంవత్సరాలు stipends ఇవ్వడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

THE HON Dr B GOPALA REDDI —Applications లో మంచి candidates ను one year s course కు చేర్చుకొన్నారు వాళ్లందరికి ఇస్తారు కొందమావాళ్లకు లేదు

*Starting of a cigarette factory in the State*

* 324 Q SRI M NAGI REDDI —Will the Hon the Minister for Planning and Industries be pleased to state whether it is a fact that the Central Government agreed to give financial aid for starting a cigarette factory in the State ?

THE HON SRI K VENKATA RAO —

No Sir "

SRI VAVILALA GOPALAKRISHNAYYA —కేంద్రప్రభుత్వాన్ని అడిగి మనకు వచ్చేటటువంటి Exicse లో నుంచి factory పెట్టేటట్టు ఏర్పాటు చేస్తారా ?

THE HON SRI K VENKATA RAO — ఇది State sector లోకి రాదు అందుచేత factory పెట్టరు Co operative Sugar Factory పెట్టడానికి కొన్ని private ప్రయత్నాలు చేస్తున్నాము మనసోదరుడు ఓబులరెడ్డిగారు దాని విషయమై ఢిల్లీలో ఉన్న పెద్దలతోటి మాట్లాడుతున్నారు కృషిమాత్రము జరుగుతున్నది తరువాత ఎం హరిశ్చంద్ర ప్రసాద్ గారికి ఒక factory ఉన్నది వారుకూడ దీనిని గురించి ఆలోచిస్తున్నారు

SRI PILLALAMARRI VENKATESWARLU — ఈ factory పెట్టడానికి ఎంత కావలసివస్తుందో తెలియజేస్తారా ?

THE HON SRI K VENKATA RAO —ఒక 20 లక్షలు ఉంటే మొదలుపెట్టవచ్చును కాని running capital ఒక కోటి రూపాయలు ఉంటే బాగానడుసుంది

*Closing of Board High School in Piduguralla*

141

*283 Q SRI M NAGI REDDI —Will the Hon the Chief Minister be pleased to state

(a) whether the Government issued a notice to the effect that the District Board High School in Piduguralla village of Palnad Taluk of Guntur District will be closed from the year 1956 57,

(b) if so, the reasons therefor,

(c) the names of the others High Schools, if any, in Palnad taluk n respect of which the Government have issued notices for closure from 1956 57, and

(d) the reasons therefor?

THE HON Dr B GOPALA REDDI —

(a) The Special Officer, District Board, Guntur issued a notice to the donors that the school would be closed during 1956 57

(b) The donors have not so far completely fulfilled the promises made by them at the time of opening the school in 1947-48

(c) The special Officer, District Board, Guntur, issued notices to the donors that the Board High Schools at Karempudi and Durg and the Board Middle School at Morjampadu, would be closed during 1956 57

(d) The donors have not either completely fulfilled the promises originally made by them at the time of opening the schools or provided the necessary requirements for continuance of the schools

SRI M NAGI REDDI — ఎడుగురాళ్ళ స్కూలుకు సంబంధించినంత వరకు original donor 40 వేల రూపాయల రొక్కమున్నూ 10 ఎకరాల భూమిన్నీ యిచ్చేటట్లుగా నిర్ణయము జరిగింది కాని ఆ స్కూలుకు భవనము కట్టించిన తరువాత ఆ donor చనిపోవడము జరిగింది భవనము కట్టించడము డబ్బు యివ్వడము అంతా కూడ ఆయనయొక్క responsibility మీదనే జరిగింది ఇప్పుడు ఆ స్కూలుకు కావలసిన వసతి ఉన్నది వసతిలేదనే కారణముతో స్కూలు మూసివేయవలసిన అవసరములేదు కాబట్టి స్కూలుకు తగిన వసతి ఉన్నప్పుడు, ఆ స్కూలును open చేసే విషయము ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. Dr B GOPALA REDDI — పిడుగురాళ్ళ విషయములో నేను చదివిన జవాబు చూడండి

"The following promises are yet to be fulfilled

1 A terraced pucca building of five rooms of standard dimen sions at Rs 4,000/ each Total Rs 20 000

2 Two acres of playgrounds of Rs 4,000, Total Rs 8,000 '

ఇంకా 28 వేల రూపాయలు యిస్తే ఆ స్కూలు open చేసే విషయము ప్రభుత్వము తప్పకుండా ఆలోచిస్తుంది

SRI T JIYYAR DASS —వాగ్దానాలు చేయడం తరువాత విరమించుకోవడం అందరికీ సహజభావమే గదా! విద్య విషయములో అందులో ఎడుగురాళ్ళ స్కూలు విషయములో స్కూలు మూయవేయకుండా ప్రభుత్వమే సహాయపడి ఆ స్కూలును ముందుకు తీసుకునిరావటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా? ఈ విధముగా మూసివేసినవి మన రాష్ట్రములో ఎన్నిస్కూల్సు ఉన్నవో చెబుతారా?

THE HON Dr B GOPALA REDDI — ఈ మాదిరిగా మూసివేసిన స్కూల్సు నాకు తెలిసినంతవరకు బహుశ నాలుగు ఉంటాయనుకుంటాను రెండు గుంటూరు జిల్లాలోనూ రెండు కృష్ణాజిల్లాలోనూ ఉన్నవి 1947-48 వ సంవత్సరములో దాతలు చేసిన వాగ్దానములు చెల్లించలేనివారికి ప్రభుత్వము పదేపదే విజ్ఞప్తులు చేసినప్పటికీ గూడ ఆ విషయములో వారు ఏలాంటి శ్రద్ధ తీసుకొనలేదు అందువల్ల అవి close చేయవలసివచ్చింది

SRI M NAGI REDDI — ఎడుగురాళ్ళ హైస్కూలుకు పదెనిమిది వేల రూపాయలు అని చెప్పి వాగ్దానముచేసినమాట వాస్తవమే కాని donor చచ్చిపోయినందువల్ల అనుకున్నదానికంటె ఎక్కువ భాగము యిచ్చారు వారు చనిపోయిన తరువాత ఆయనకు ఉన్నది దత్తుకుమారుడు ఉన్నాడు పైగా ఆయన మైనరు అందువల్ల ఆయన ఆస్తిమీదకు పోవటానికి వీలులేదు అందువల్ల యీ విషయము పునరాలోచించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను ఇదేవిధముగా కారెంపూడి దుర్గి స్కూల్సుకు గూడ Local Development Schemes క్రింద ఆ స్కూల్సుకు కొన్ని rooms కట్టించాము ఇంకను కట్టించాల్సినవి ఉన్నవి వాటికి ప్రయత్నాలు జరుగుతున్నవి కాబట్టి ఆ స్కూళ్ళ విషయములో ఒకటి, రెండు సంవత్సరములైనను time extend చేస్తూ, ఆ స్కూళ్ళు మూసివేయకుండా ప్రభుత్వం ఉత్తర్వులు యిస్తుందా?

THE HON Dr B GOPALA REDDI — Time extend చేయడానికి ఏమీ ఆక్షేపణ ఉండదు కాని ఎవరైనా ఒక్కరిని అక్కడ స్థానికంగా ఉన్న M L A లు గాని యితర కమిటీలు గాని, యితర విద్యాభిమానులు గాని, donor చేసిన వాగ్దానాలన్నీ నిర్వహిస్తామని ముందుకువస్తే తప్పకుండా time

extend చేయటానికి ఆలోచిస్తుంది అక్కడ ఉన్నవారు ఎవరైనా సరే చివరకు విద్యాభిమానులైనవారు వచ్చి చెప్పిననూ సరే పరవాలేదు వాగ్దానము చెల్లిస్తా మని చెప్పవచ్చును

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా మూర్జం పాడు స్కూలు విషయములో దాతలుచేసిన వాగ్దానములు క్రిందటి సంవత్సరమే పూర్తిగా చెల్లించివేశారని తెలుస్తున్నది అలాంటి సందర్భములో యీ సంవత్సరము ఆ స్కూలును ఆపటానికి కారణమేమి ? క్రిందటి సంవత్సరము దానిని ఉంచాలని నిర్ణయించారు కాని ఆ కారణమువల్లమాత్రము దానిని ఆపవేయ లేదు ఈ సంవత్సరము మూసివేయటానికి కారణము చెబుతారా?

THE HON Dr B GOPALA REDDI — ఆ విషయము చూస్తానండి

The further request made by the Special officer remains unful filled However the Special officer has allowed the school to be continued this year, i e 1956 57

*Petition from the Harijans of Bilakalagudur requesting grant of house sites*

143

* 314 Q SRI PILLALAMARRI VENKATESWARLU —Will tho Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether the Hon Minister received a petition dated 31st January, 1956 from the Harijans of Bilakalagudur, Nandyal Taluk requesting grant of house sites , and

(b) if so, the action taken thereon ?

THE HON SRI G LATCHANNA —

(a) The answer is in the affirmative

(b) The Collector of Kurnool has conducted a detailed enquiry and reported that only 10 Harijans (Mala families) are in need of house sites The rest of them have purchased sites in s No 388/2 B and 360 and built pucca houses The Harijans (Malas) have got an extent of nearly Ac 1 50 cents of land in S No 258 adjoining their cheri which is useful for house sites As there is no difficulty for them to provide themselves with house sites, the Collector was directed to refund the deposit amount of Rs 400/ to the Harijans

(ఎ) అవునండి

(బి) సర్వే 388 360 నెంబర్లుగల భూములు యిళ్ల స్థలాలకుగాను కావాలని హరిజనులు దరఖాస్తు చేయడం దానిమీద తహశ్శీల్దారుద్వారా enquiry చేసిన సందర్భములో 360 వ నెంబరు తాలూకు భూమి సగము అక్కడ ఉన్న రెండు హరిజన పేటలలో ఒక పేటవారు సగం కొనుక్కోవడం రెండవ సగము మరొక పేటవారు కొనుక్కోవడం జరిగింది 388 నెంబరుగల భూమి విషయములో హరిజనులకు అవసరం అనేది final గా తీర్మానం అయినందువల్ల హరిజనులు యొక్క కోరికప్రకారము వాళ్లు చేసిన deposits ను refund చేయమని కోరినందువల్ల వారికి refund చేయడం జరిగింది

SRI N K LINGAM —చిలకలగూడూరు హరిజనులకు యిళ్ళస్థలాలు కొరకు ప్రభుత్వంవారు ఒకసారి స్థలము acquire చేసినట్లుగా తెలిసిన తరువాత యింకను హరిజనపేటనుంచివచ్చి వారు స్వంతముగా డబ్బు ఖర్చుచేసి కొనుక్కోవటానికి కారణము ఏమి? ఇక వారికి ఇళ్లు ఇవ్వకూడదనే పరిస్థితులలో కొన్నారనేది ప్రభుత్వము యొక్క దృష్టికి వచ్చిందా ?

THE HON SRI G LATCHANNA — అలాంటి రిపోర్టు ఏమీ ప్రభుత్వానికి రాలేదు తహశ్శీల్దారు విచారణలో వారు కోరినస్థలములో సగము ఒకపేటవారున్నూ మిగిలిన సగము మరొకపేటవారున్నూ కొనుక్కోవడము జరిగింది తిరిగి మేము స్థలాలు కొనుక్కున్నాము కాబట్టి మేముకట్టిన deposits మాకు వాపసు యివ్వమని కోరినందువల్ల కలెక్టరు రిపోర్టుపైన ప్రభుత్వం refund orders వారికి జారీ చేసింది

SRI P GUNNAYYA — పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు అయిదు మాసాల క్రిందట దరఖాస్తుయిస్తే వారికి ఆ దరఖాస్తుపైన స్థలము యిచ్చినట్లుగా చెబుతున్నారు నేను అయిదు సంవత్సరాలక్రిందట దరఖాస్తు యిచ్చిననూ నాకు ఇంకా ఇవ్వలేదు అలాంటి సందర్భములో నన్నుకూడ opposition లోకి వెళ్ళమని ప్రభుత్వం యొక్క ఉద్దేశమా ?

(No answer)

*Enquiry into Gullapalli Co operative Credit Society*

144

*192 Q SRI VAVILALA GOPALAKRISHNAYYA —Will the Hon the Minister for Co operation and commercial Taxes be pleased to state

(a) whether it is a fact that the affairs of the Gullapalli Co operative Credit Society of Sattenapalli Taluq were enquired into under Section 35 of Co-operative Societies Act, and

(b) if so what was the result and at what stage the affairs that Society stand?

THE HON SRI D SANJIVAYYA —

(a) and (b) Apparently the member is referring to Gundlapalli Co operative Credit Society ' in Sattenapalli Taluq No enquiry into the affairs of the Society was held But an intensive examination of loans outstanding was conducted on 9 12 1955 and it showed that an amount of Rs 8,357 8 0 was due from members There has been no improvement in the financial position of the society even after the appointment of an employee of the Central Bank as a paid manager

SRI VAVILALA GOPALAKRISHNAYYA — ఇక ముందు యీ సొసైటీ విషయములో చేసిన విచారణలో సొసైటీ ప్రెసిడెంటు సొసైటీ డబ్బు తనుస్వంతంగా ఉపయోగించుకున్నట్లు తెలుస్తున్నది అందువల్ల ఆప్రెసిడెంటు Elections కు నిలవటానికి అవకాశము లేనటువంటి position ఉన్నది ఆ విషయములో ప్రభుత్వం ఏదైనా చర్యతీసుకోటానికి నిర్ణయించుకున్నదా ?

THE HON SRI D SANJIVAYYA —ఆయన ఇంతవరకు 2 788 రూ కట్టివేశారు యింకా అయిదు వేల రూపాయల పైచిల్లర కట్టవలసి యున్నది ఏమైనప్పటికినీ ఆ సొసైటీ improve అయ్యేపరిస్థితి ఏమి కనబడడము లేదు అసలు దానియొక్క registration ను cancel చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తున్నది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా 145వ ప్రశ్నను రేపటికి వాయిదా వేయించాలని అంటున్నాను

Mr SPEAKER —Question No 145 is postponed

*Loans for the purchase of Chemical manures*

52

* 185 Q SRI P GUNNAYYA —Will the Hon the Minister for Agriculture be pleased to state the amount allotted to each district for giving loans to ryots for the purchase of chemical manures for the total amount of Rs 125 00 lakhs sanctioned in the State Budget for 1956 57?

[14th August 1956

The information is furnished below

| Serial number | Name of the district | Amount allocated (in rupees) |
|---|---|---|
| 1 | Srikakulam | 7,00 000 |
| 2 | Visakhapatnam | 7,00 000 |
| 3 | East Godawari | 18 00 000 |
| 4 | West Godawari | 18 00 000 |
| 5 | Krishna | 24 00 000 |
| 6 | Guntur | 15 00 000 |
| 7 | Nellore | 13,00 000 |
| 8 | Cuddapah | 8 00 000 |
| 9 | Chittoor | 5 00 000 |
| 10 | Kurnool | 5 00 000 |
| 11 | Anantapur | 5 00 000 |
| | Total | 1,25,00,000 |

| | | |
|---|---|---|
| శ్రీకాకుళం | — | 7 లక్షలు విలువగల వస్తువులు |
| విశాఖ పట్టణము | — | 7 ,, |
| తూర్పు గోదావరి | — | 18 |
| పశ్చిమ గోదావరి | — | 18 ,, |
| కృష్ణా | — | 24 |
| గుంటూరు | — | 15 ,, |
| నెల్లూరు | — | 13 |
| చిత్తూరు | — | 5 ,, |
| కడప | — | 8 ,, ,, |
| అనంతపురం | — | 5 ,, ,, |
| కర్నూలు | — | 5 ,, ,, |
| వెరసి | | 1 కోటి 25 లక్షలు |

SRI V VISWESWARA RAO — ఈ allotment ను districtwar గా మంత్రిగారు వివరాలు చెప్పారు అయితే యిప్పటికి యిందులో ఎంతభాగము ఖర్చు అయిందండి ?

THE HON SRI K OBULA REDDI — ఇప్పుడు నావద్ద ఆ వివరాలు లేవు వేరే ప్రశ్న వేస్తే చెబుతాను

[14th August 1956

SRI C SUBBARAYUDU — ఈ కెమికల్ మెన్యూర్సులో ఎమోనియం సల్ఫేటు వగైరాలు మెట్టప్రాంతాలలో పడకపోయినప్పటికినీ దరఖాస్తుదారులకు అయిదువందల వరకూ అప్పులు యిచ్చినందువల్ల యీ మెన్యూర్సు తీసుకొనిపోయి black market కు సహాయపడుతున్నారు కాబట్టి యీ ఎరువులు ఉపయోగపడని ప్రాంతాలవారికి ఆ అప్పులు యివ్వకుండ ఉండటానికి ప్రభుత్వం ఏర్పాటు చేస్తుందా ?

THE HON SRI K OBULA REDDI — ఈ సంవత్సరము బ్లాకు మార్కెటు అనేది ఉండదు ఎందుకంటే ఎరువులు రైతులకందరికి పుష్కలంగా తెప్పించి సప్లయి చేస్తున్నాము

SRI S VEMAYYA — ఈ allotment జిల్లాలవారీగా సప్లయి చేస్తున్నప్పుడు ఏ basis ను దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం allotment చేస్తున్నది ?

SRI N K LINGAM — Manures కొనుక్కునేందుకు రైతులకు అప్పులు ప్రభుత్వం ఇస్తున్నది అయితే ఎన్ని ఎకరాలు పొలముఉంటే యీఅప్పులు లభించగలవో మంత్రిగారు చెబుతారా ?

THE HON SRI K OBULA REDDI — ఒక్కొక్క ఎకరానికి 35 రూపాయల చొప్పున అప్పులు యిస్తారు

SRI G NARASIMHA MURTHI — మంత్రిగారు సమాధానము చెప్పడములో యీ సంవత్సరము Black market కు scope లేదని సెలవిచ్చారు Black Marketting అంటే తక్కువకుకొనుక్కొని ఎక్కువకు చాటుగా అమ్మడము లేదు డబ్బు అవసరము వచ్చినప్పుడు యీ ఎరువులు పొలములలో వేస్తామనిచెప్పి, దరఖాస్తుచేసి వీటియొక్క ధరనుతగ్గించి private dealers కు అమ్ముకుంటున్నారు ఈవిధంగా చేయకుండా అరికట్టడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON SRI K OBULA REDDI — అటువంటి కేసులు యింత వరకు నాదృష్టికి రాలేదండి

SRI V VISWESWARA RAO — Chemical Manures Loans యిచ్చేటప్పుడు Ammonium Sulphate ఎక్కువభాగం యిస్తున్నారు అట్లాకాకుండా Potassium కూడా ఎక్కువభాగము యిచ్చేటట్లు చేస్తారా?

THE HON SRI K. OBULA REDDI — ఆ విషయము ఆలోచించవచ్చునండి

*Visits to factories by certifying Surgeons*

5

*44 Q SRI S VEMAYYA —Will the Hon the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) the number of visits made to the factories by the Certifying Surgeons in the State for the year ending 31st March, 1956, and

(b) whether the visits are adequate or not?

THE HON SRI G LATCHANNA —

(a) Six visits

(b) Not adequate

(a) 6 Visits

(b) ఇంకా ఎక్కువ visits చెయ్యవలసినదని లేబరు కమీషనరుగారు డైరక్టరు ఆఫ్ మెడికలు సర్వీసెసును కోరడము అయినది గవర్నమెంటు చర్య తీసుకుంటున్నారు

SRI S VEMAYYA — ఈ డాక్టరు ఫ్యాక్టరీలు సరిగా దర్శించడంలేదని విజిట్సు చాలా తక్కువగా ఉన్నవని అడ్మినిస్ట్రేషను రిపోర్టులో వరుసగా రెండు సంవత్సరాలు చెప్పబడింది డాక్టర్లుపోయి ఫ్యాక్టరీలు చూచేటట్లు ఆర్డరు ఇస్యూ చేస్తారెమో తెలుసుకోనవచ్చునా ?

THE HON SRI G LATCHANNA — వీలైనంత త్వరగా చేస్తాంఅని మనవిచేస్తున్నాను

*Grazing fees for cattle in forests*

56

* 220 Q SRI M NAGI REDDI —Will the Hon the Minister for Agriculture be pleased to state

(a) whether the Government propose to abolish the system of collecting grazing fees of cattle in forests, and

(b) if so, when the propsoal will come into force?

THE HON SRI K OBULA REDDI —

(a) & (b) No, Sir

చీఫు మినిస్టరుగారు మొన్న ఆయవ్యయ పట్టిక మీద ఇచ్చిన సమాధానము విన్నతరువాత ఇలాంటి ప్రశ్నకు అవకాశము లేదు

SRI PILLALAMARRI VENKATESWARLU — అధ్యక్షా, సమాధానము మాకు బోధ పడడములేదు రెండవది మొదటిదానికన్న ఇంకా

confusing గా ఉన్నది Financial Position బాగా లేదుకాబట్టి' అని అన్నారు ఈ ప్రశ్నకు తావేలేదని ఇప్పుడు అంటున్నారు మంత్రిగారు

Mr SPEAKER — What he says is that the answer is already given by the Chief Minister

SRI M NAGI REDDI — ముఖ్యమంత్రిగారు సమాధానము చెప్పేరు కొత్తగా agricultural మంత్రిగారు వచ్చేరు దీనిని గూర్చి పత్రికలలో ప్రకటనలు వస్తున్నాయి అందుచేత ఈప్రశ్న వేసినాను గతసంవత్సరము అసెంబ్లీ సభ్యులతోటి ఫారెస్టుల కాన్సర్వేటరుతోటి ఫారెస్టు మంత్రిగా ఉన్న ముఖ్యమంత్రిగారు సమావేశము జరిపేరు గ్రేజింగుఫీజు unit కు 0–4–0 గొర్రెకు 0–4–0 ఆవుకు 0–8–0 అని రాజీ ప్రతిపాదనగా అన్నారు. మళ్లీ సమావేశము పిలవకుండానే ఇప్పుడు పెంచేరు మళ్ళీ గతసంవత్సరములాగ చేస్తారా?

THE HON Dr B GOPALA REDDI — నాగిరెడ్డిగారు కొన్ని విషయాలు సరిగా జ్ఞాపకం పెట్టుకోలేకపోయారు అనుకుంటాను రెండింతలు చెయ్యడానికి అప్పటికే G O pass అయినది మీరందరు చెప్పినతరువాత ఈ సంవత్సరానికి 50% హెచ్చింపు చెయ్యాము వచ్చే సంవత్సరమునుంచి G O అమలు పరుస్తారని చెప్పడము అయినది ఆ మాదిరిగానే హెచ్చించడం జరిగింది సగం తగ్గించి ఈ సంవత్సరం హెచ్చింపు పూర్తిగా అమలులోకి వచ్చేటట్లు చేసినాము అందుకు ముందే G O ప్యాసు అయినది

*Provision of canteens, etc , to workers by factory owners*

12.

* 47 Q SRI S VEMAYYA —Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state

(a) whether all factory owners who employed more than 250 workers, are providing canteens to the workers, in pursuance of rule 65 (1) of Madras Factories Rules, 1950,

(b) whether the factory owners are also providing rest sheds with reference to rule 72 of the said rules,

(c) the number of factories in which rest sheds and creches were provided in the State for the year ending 31st March, 1956 in pursuance of rule 72 of Madras Factories Rules, 1950, and

(d) if the answers to clauses (a) and (b) are in the negative what steps the Government propose to take on such factory owners?

THE HON SRI G LATCHANNA —

(a) No, Sir

(b) No, Sir

(c) (i) Rest sheds 95

(ii) Creches 116

(d) Penal action is being taken against defaulters

79 ఫ్యాక్టరీలకు 63 ఫ్యాక్టరీలలో కాంటీనులు ఏర్పాటు చెయ్యడమైనది 122 ఫ్యాక్టరీలకు 98 ఫ్యాక్టరీలలో రెస్టు షెడ్లు 211 ఫ్యాక్టరీలకు 116 ఫ్యాక్టరీలలో క్రెచెసు ఏర్పాటు చెయ్యడమైనది ఇంకా ఏర్పాటు చెయ్యని వారిమీద చర్యకుగాను నోటీసు జారీ చెయ్యడం అయినది

SRI S VEMAYYA — ఈ రక్షణము ఏర్పాటు చెయ్యనివారిమీద చర్య తీసుకొంటాము అన్నారు ఎంతమందిమీద చర్య తీసుకున్నారు ఇంత దీర్ఘకాలం చర్య తీసుకోపోడానికి కారణం ఏమిటి ?

THE HON SRI G LATCHANNA — ఏదో ప్రాసిక్యూషను చెయ్యడము అగుతుందని నోటీసు ఇవ్వడం అయినది ప్రాసిక్యూషను కోర్టులో ఫైలు అయినతరువాత చట్టప్రకారం వారికి మూడు మాసాల ఖైదుగాని 500 జుల్మానా, లేక రెండుగాని కోర్టువారు విధించవచ్చును

SRI P VENKATASUBBAYYA —ఈ కాంటీన్సు Cooparative Societies Act క్రింద రిజిష్టరు అయినవా ?

THE HON SRI G LATCHANNA — ఇందులో 250 employees ఉన్న ఫ్యాక్టరీకి 1 కాంటీను ఉండాలి 150 మంది ఉన్నదానికి ఒక రెస్టుషెడ్డు 50 మంది ఆడవారు పనిచేస్తున్న ఫ్యాక్టరీలో క్రెషెస్ ఉండవలెను

SRI P VENKATASUBBAYYA — నా ప్రశ్నకు జవాబు లేదు కాంటీన్సు కో ఆపరేటివు ఆక్టు క్రింద ఉన్నవా అని ప్రశ్న

THE HON SRI G LATCHANNA — ఇది ఫ్యాక్టరీలకు సంబంధించిన ప్రశ్న co operativeగా గాని, ప్రైవేటుగా గాని ఫ్యాక్టరీ నడిపితే అందులో కాంటీన్సు వగైరాలు ఉండాలి ప్రత్యేక ప్రశ్న వేస్తే చెప్పగలను

SRI C SUBBARAYUDU — ప్రభుత్వం నడుపుతున్న గవర్నమెంటు ప్రెస్సు ఫ్యాక్టరీఆక్టు క్రింద వస్తుంది అయినా అక్కడ కాంటీనుగాని, రెస్టు హోము గాని లేదు చివరకు మంచినీళ్ళు, లెట్రినుకు పోయి తెచ్చుకోవలసిన దౌర్భాగ్యం పట్టింది ప్రభుత్వంనడిపేవి ఆదర్శముగాఉండడానికి ఏమైనా ఏర్పాటు చేసారా ?

14th August 1956 ]

THE HON SRI G LATCHANNA — ప్రభుత్వ అజ్మాయిషీ క్రింద ఉన్న గౌరవసభ్యులు ఆ ఇబ్బందులు ఏవో తెలియచేస్తే మేము చర్య తీసుకొంటాము

SRI M NAGI REDDI — ఈ కాంటీనులు ఫ్యాక్టరీవారి మానేజిమెంటులో కాకుండా నామ్కేవాస్తే ఎవరినో ఒకరిని కొన్ని పకోడీలు గారెలు చేసిపెట్టమనడం పెట్టినట్లు ప్రభుత్వానికి చూపడం జరుగుతూఉంది కాబట్టి ఫ్యాక్టరీ వారే ఓపెను చేసేటట్లు చౌకగా ఇచ్చేటట్లు చూడవలెను రెస్టుషెడ్ల విషయములో ప్రభుత్వంనుండి తప్పించుకోడానికి చాలాచోట్ల తాటాకుతో గుడిశెలు వేస్తూ ఉన్నారు కొన్నిచోట్ల వెయ్యడమేలేదు కాబట్టి ప్రభుత్వంవారు ఒక ప్లానుఇచ్చి దానిప్రకారం ఇంత జనాభాకు ఇంత కట్టవలెనని ప్రభుత్వం ఆదేశిస్తుందా ?

THE HON SRI G LATCHANNA — కాంటీన్లుకు రెస్టు హౌసుకు standards prescribe అయి ఉన్నవి ఆ ప్రకారంగా కాకుండా ఎక్కడైనా నిర్మాణం ఘానాచోట ఉన్నదని గౌరవ సభ్యులు తెలిపితే ప్రభుత్వం చర్య తీసుకొంటుంది

SRI C SUBBARAYUDU — ప్రభుత్వం నడిపేదానిలో ఎక్కడా provide చెయ్యలేదని తెలియజేస్తే చర్య తీసుకుంటాము అన్నారు గవర్నమెంటు ప్రెస్సులో 200 మంది ఉన్నారు అక్కడ ఇంతవరకు rest shed గాని మంచినీరు తాగేదానికి అవకాశముగాని లేదు అని ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON SRI G LATCHANNA —ఇంతవరకు గౌరవ సభ్యులు గాని అక్కడఉన్న employees గాని ఎవరూకూడా ప్రభుత్వానికి ఫిర్యాదుగాని representation గాని చెయ్యలేదు

( No answer )

SRI T JIYYAR DASS —గవర్నమెంటు ప్రెస్సులో సామానుకు మనకు కావలసినట్టి స్థలము లేక బాధపడుతున్నారని ప్రభుత్వానికి తెలుసునా ? కాంటీనుకు ప్రత్యేకముగా స్థలం ఇప్పించగలదా ప్రభుత్వము

THE HON SRI G LATCHANNA —ఇది ప్రత్యేక ప్రశ్న అవుతుందండి

SRI S VEMAYYA — ఇప్పుడు మాత్రం కొంతమందిమీద చర్య తీసుకొంటాము ప్రాసిక్యూషను చేస్తారని అన్నారు లోగడ ఎంతమందిమీద చర్య తీసుకున్నారో తెలుసుకొన వచ్చునా ?

THE HON SRI G LATCHANNA — నేనే ప్రశ్న వేస్తే తెలుప గలను

*Construction of the Boyanna Tank*

135

* 137Q SRI P HANUMANTHA REDDI —Will the Hon the Minister for Agriculture be pleased to state the stage at which the matter relating to the construction of the Boyyanna tank in Kataru konda forest of Dhone Taluk stands ?

THE HON SRI K OBULA REDDI — అలాంటి విజ్ఞప్తి అటవీ శాఖ వారివద్ద లేదు

[ Note —An asterisk* at the commencement of a speech indicates revision by the Member ]

## II GOVERNMENT BILLS

*(1) The Madras Devadasis (Prevention of Dedication) Andhra Amendment Bill, 1956,*

THE HON SRI K CHANDRAMOULI —Sir I beg leave to introduce the Madras Devadasis (Prevention of Dedication) Andhra Amendment Bill 1956, and move that the Bill be taken into considera tion at once

ఇదివరకు 1947 వ సంవత్సరపు చట్టంలో 3 వ సెక్షను ప్రకారము దేవాలయాలలో ఇటువంటి మేళాలు ఏవి జరుగకూడదనేది ఏర్పాటు జరిగివున్నదండి ఇపుడు తీసుకొచ్చిన సవరణ యీ భోగముమేళాలు అటువంటి బహిరంగ వీధులలో ఊరేగింపులలో మాత్రము జరుగకూడదని ఈసవరణలో వున్నభావను ఇదివరకే యీ సంఘానికి చెందినవారు ఆ సంబంధమైనటువంటి వారు అందరు కూడా చాల కాలమునుంచి దానిని గురించి Representation చేస్తూవున్నారు ఇది చాలచిన్న సవరణ దీనిని గురించి నేను ఎక్కువగా చెప్పనక్కరలేదు ఈ సవరణను ఆమోదించవలసిందని మనవి చేస్తున్నాను

Mr SPEAKER —Motion moved

"That the Madras Devadasis (Prevention of Dedication) Andhra Amendment Bill 1956, be taken into consideration at once "

SRI VAVILALA GOPALAKRISHNAYYA — ఇది ఎప్పుడో చేయవలసింది ఇప్పటికైనా ప్రభుత్వము తీసికొని వచ్చినందులకు అభినందిస్తున్నాను రెండవది దీనిలో చాలా మందికిఅనుమానాలుకూడావున్నాయి వాటిని గురించి

చాలా clear గా చెప్పడముకూడా అవసరముంది ఎందుకంటే ఈ కళావంతుల సంఘువారు యిచ్చిన memorandum లో ఇంకొక విషయంకూడా చేర్చమని కోరారు ఏమిటంటే బజారులో వచ్చేటపుడు యీ నటన అంతాకూడా ఆపివేసే పద్ధతిని వారుకోరారు Amendment యీరకంగా వుండడమువల్లనే చాల ఉపయోగకరంగావుంది భరతనాట్యము అభివృద్ధి కావాలని మనము కృషిచేస్తున్నాము Public అంటే ఒకటివుంది Public అని వ్రాయకుండా వుంటేకూడా అది Public కాకుండా పోదు ఎప్పుడైతే 10 మంది ప్రవేశించడానికి అవకాశ ముంటుందో అదంతాకూడా Public place ఔతుంది Public place ఔతుందనే ఉద్దేశ్యంతో నిషేధించినట్లయితే చాలప్రమాదమువస్తుంది అందువల్ల భరతనాట్యము చేసేవాండ్లకు ఎట్టి అభ్యంతరములేకుండాచేస్తే మంచిదనే ఉద్దేశముతోటి ఈవిధంగా తీసుకురావడము correct గా వుందనుకుంటాను నన్ను చాలమంది కలిసారు కనుక నేను ఈ సభమూలకముగనే జవాబు చెప్పాలనుకుంటున్నాను వారు నన్ను amendment కూడా పెట్టమని అడిగారు ఏమని అంటే అసలు ఈనాట్యముకూడా అన్వయించకుండా నిషేధించాలిచెప్పి దానివల్ల మనము ఒకకళకు అభ్యంతరము పెట్టినవాండ్లమౌతాము కళను నాశనము చేసినవాండ్లమౌతాము కుంభహారతి తీసుకపోయేటపుడు ఊరేగింపుజరుపడము నిషేధించాలిగాని కళావంతుల కులములో జన్మించినంతమాత్రాన అసలు నటనావృత్తితోనే జీవించేవాండ్లనుకూడా నిషేధించే పద్ధతివుండడము న్యాయముకాదు అందువల్ల ఈబిల్లుచాలబాగుంటుంది అని ఇంత వరకు confine కావడము చాల correct అనిచెప్పి నేను దీనిని బలపరుస్తున్నాను

SRIMATHI C AMMANNARAJA – అధ్యక్షా గోపాలక్రిష్ణయ్యగారు చెప్పినట్లు యీ సవరణ ఎపుడో రావలసివుంది విశ్వనాథంగారి Time లో కూడా తీసుకురావాలనుకున్నారు కాని ఇంతవరకు కూడా తేబడలేదు అసలు ప్రథమములో యీబిల్లు పెట్టినపుడుకూడా ఉద్దేశ్యము ఊరేగింపు వుండకూడదని బిల్లులో సరిగా పెట్టకపోవడమువల్ల ఈ advantage తీసుకొని ఇప్పటివరకూ వారు చేస్తూవచ్చారు అసలు ఈకాలములో కొంతమంది మా కులమువారికి నాట్యము లేకుండా చేస్తేనే బాగుంటుందని చెప్పారు కాని ఒక కులమువారిని నిషేధించినట్లయితే మిగిలినవాండ్లు చేస్తారు అన్నికులాలవారు కూడా అది చాల మంచికళ అని నేర్చుకొని performances యిస్తున్నారు కాబట్టి ఒక్క కులమువారిని నిషేధించడము భావ్యముకాదనే ఉద్దేశముతో పెట్టలేదు ఇపుడు కనీసం ఊరేగింపుల నైనా నిషేధించడము చాల అవసరము గుంపులుగా అందరువచ్చి చూడడము హేళనగా మాట్లాడడము సరసాలు ఆడడం ఇదంతాకూడా చాల అగౌరవమైన విషయం అందువల్ల దీనిని తప్పకుండా నిషేధించవలసి యున్నది అది ఒకకులము

Srimathi Ammannaraja [14th August 1956

వారిని నిషేధించితే బాగుంటుందనే ఉద్దేశ్యంతో వుంచారు ఏదో చిన్నపిల్లలకు పెండ్లికాని పిల్లలకు అది పెట్టినట్లయితే పరవాలేదు మాకు వేరే వృత్తిలేదు ఇది తీసివేసినట్లయితే మేము ఎలా జీవిస్తాముఅని అడుగుతున్నారు ఇదివృత్తికి గౌరవముకాదని వారిలోనే చాలమంది చెప్పబట్టి యీచట్టము పెట్టడమైనది కాని గవర్నమెంటు Tappers కు మిగిలినవారికి వారి కులవృత్తి తీసివేసినపుడు వారికి సదుపాయాలు చేసినట్లే వీరికికూడా ఏచేతిపనులో అలాంటివి ప్రత్యేకంగా కల్పించినట్లయితే వారివృత్తిని మానుకొని గౌరవ పద్ధతులలో జీవించడానికి వీలుగా వుంటుంది మనమేవో నీతులుచెప్పి చేయడానికి వీలులేదనిచెప్పి వారిని నిరాధారులనుగా చేయడము మంచిదికాదు అందుచేత ప్రభుత్వమువారు యీ విషయాన్ని గమనించి వారికేదైనా ఒక జీవనోపాధి కల్పించితే బాగుంటుంది వారు ఎన్నాళ్లనుంచోకూడా వివాహములేకుండా అగౌరవమైన వృత్తిలో వుండేదానికి అలవాటు పడినారు అటువంటి నల్లమచ్చ మన హిందూమతంలో వుందంటే చాల విచారకరమైన విషయం దానిని కొంతవరకు పోగొట్టడానికి ప్రయత్నం జరిగింది కాని దానిని పూర్తిగా పోగొట్టాలంటే ప్రభుత్వంవారు ఇంతకంటే గట్టిప్రయత్నం చేసి వారికులానికి ఏదో జీవనోపాధి కల్పించినట్లయితే వారు చాలా గౌరవమైన జీవనము చేసుకోడానికి వీలుఔతుంది ఆవిధంగా చేస్తారని నమ్ముతూ దానికి ఎవరుకూడా ఆక్షేపించకుండా వెంటనే pass చేయించాలని కోరుతూ సెలవు తీసుకుంటున్నాను

SRI M RAJESWARA RAO — ఇపుడు యీబిల్లు ప్రకారం కొన్ని ప్రత్యేకించినటువంటి కులాలకుచెందిన స్త్రీలు dance చేయకూడదనేటటువంటి నిషేధము కన్పిస్తుంది ఈ కులాలకు చెందిన స్త్రీలను నాట్యం కొఱకుద్దేశింపబడిన dedication ను prevent చేయడానికి ఎవరికి ఎట్టి అభ్యంతరము కన్పించదు కాని వారు ఫలాని కులానికి చెందారన్న కారణంచేతనే వారి వృత్తిని prevent చేయడమనేది రాజ్యాంగంలోని article 15 కు వ్యతిరేకంగా వుంటుందేమోనని ఆలోచించవలసిన అవసరము వుంటుందని అనుకుంటాను ఎందుకంటే article 15 ప్రకారం ఏవిషయంలోను ఎలాటి కులమత భేదాలు పాటించకూడదు ఒక వ్యక్తికి మరొక వ్యక్తికి కుల ప్రాతిపదికపై వృత్తితో discrimination చూపించడము Constitution వ్యతిరేకంగా కనిపిస్తుంది

Article 15 (1) of the Constitution of India says

'The State shall not discriminate against any citizen on grounds only of religion, race, caste, sex, place of birth or any of them "

The Bill is therefore intended for a particular community

THE HON SRI K CHANDRAMOULI —ఐతే వారి ఉద్దేశమేమిటంటే వారు ప్రత్యేకంగా చేస్తున్నారు కాబట్టి వారిని దృష్టిలో పెట్టుకున్నారని అది దృష్టిలో పెట్టుకొని వారు represent చేశారు కాని ఇది ఒక ప్రత్యేకమైన community కి సంబంధించినదికాదు

SRI M RAJESWARA RAO — ఈ బిల్లుయొక్క objects and reasons లో కూడా పలానా communities dance చేయకూడదని representations వచ్చినాయని clear గా వ్రాసివుంది Prevention of dedication అని అసలు బిల్లు పేరు తర్వాత objects and reasons లో కూడా అదే కనిపిస్తుంది కాబట్టి నాట్యాలు, బిల్లులో పేర్కొనబడినకులాలకు సంబంధించినంతవరకూ prevent చేయడానికి ఉద్దేశించినట్లు కన్పిస్తుంది

దీనిని అందరికీ వర్తింపజేస్తే నాకేమి అభ్యంతరము లేదు అందరికీ వర్తించాలంటే అసలు బిల్లుపేరే మారవలసి వస్తుందేమోననికూడా చూడాలి Statement of objects and reasons లో మీరు particular communities కే యీ బిల్లు ఉద్దేశింపబడినట్లు చెప్పుతున్నారు దీనిమీద తర్వాత నేను amendment move చేసినప్పుడు మాట్లాడుతాను ఇందులో ఇంకాకొన్ని మనము ఆలోచించవలసినవి వున్నాయి ఇపుడు dancing అనేది కేవలము ఏవో కొన్ని ప్రత్యేకమైన కులాలకు చెందినవారేకాక ఇతర కులాలవారు పెద్దపెద్ద I C S Officers పిల్లలుకూడా dances చేసిన సందర్భాలు మనకు తెలుసు లేకపోతే వాండ్లు బజార్లలో చేయుటలేదు మరొకచోట చేస్తున్నారు ఇపుడు సినిమాలలోకూడా public streets లో dance చేసినట్లుగా మనకు చూపిస్తున్నారు ప్రజలంతా చూస్తూనే వున్నారు ఐతే అదృష్టవశాత్తు వారు బిల్లులో నుదహరింపబడిన కులాలకు చెందినవారు కారు అందుచేత యీ Act వాండ్లకు apply కావడంలేదు నిజంగా స్త్రీల గౌరవాన్ని కాపాడాలనే ఉద్దేశము కనుక మనకు వున్నట్లయితే వీరందరికికూడా యీబిల్లును వర్తింపచేసేటట్లు చూడడము అవసరమేమోనని నేను భావిస్తున్నాను తర్వాత రెండవది, అసలు యీబిల్లు article 15 ప్రకారం గాని మరియే యితర ఆర్టికల్ ప్రకారంగాని repugnant to the provisions of the Constitutional Provisions' కు repugnant అవుతుందేమోనని నాసందేహం కోర్టులకు ఇంతవరకూ యీవిషయం వెళ్ళినట్లు ఎక్కడను కన్పించదు వెళ్ళితే ఏలావుంటుందో జాగ్రత్తగా ఆలోచించవలసిన విషయం నాకు అర్థమయినంత వరకు ఇది Constitution కు repugnant అవుతుందనే అనుకుంటున్నాను ఈ విషయాన్ని జాగ్రత్తగా ఆలోచించమని మంత్రిగారిం నేను మనవిచేస్తున్నాను

Mr SPEAKER —Article 15 next reads

No citizen shall on grounds only of religion, race, caste, sex, place of birth or any of them be subject to any disability, liability, restriction of condition with regard to—

(a) access to shops public restaurants, hotels and places of public entertainment, etc, or

Therefore I don't think this article applies to this Bill There is also another provision, Article 15 (3) which says that 'nothing in this article shall prevent the State from making any special provision for women and children

SRI R B RAMAKRISHNA RAJU — The Act prohibits dancing by a woman, with or without *kumbhaharathy* in the precincts of any temple or other religious institution or in any procession of a Hindu deity, idol or object of worship installed in any such temple or institu tion or at any festival or ceremony The Act does not prohibit dancing by women in any marriage or other procession taken out in public streets

గవర్నమెంటువారు తెచ్చిన amendment లో Dancing by women with or without *kumbharathi* in the presence of any temple or other religious institution or any procession of అని ఉంది Woman అని ఉంది కాబట్టి ఫలానా community అని ఇందులో లేదు objects and reasons లో చెప్పేటప్పుటుమాత్రం ఫలానావారి దగ్గరనుంచి మాకు representation వచ్చింది కాబట్టి చేస్తున్నామని చెప్పనారేగాని ఇది ఫలానా community కే apply అవుతుంది ఇతరులకు apply గాదని amendment లో లేదు

SRI M RAJESWARA RAO — As it is, can the Bill cover other classes also? Because the Preamble of the Bill also reads as the Madras Devadasis (Prevention of Dedcation) Act,

SRI R B RAMAKRISHNA RAJU — Dedication of dancing is prevented and dancing by all women is prevented

Mr SPEAKER - Not by all women

The question is

"That the Madras Devadasis (Prevention of Dedication) Andhra Amendment Bill, 1956, be taken into consideration at once '

The motion was carried and the Bill was taken into consideration

14th August 1956]

*Clause 2*

Mr SPEAKER — The motion is

That clause 2 do stand part of the Bill

SRI M RAJESWARA RAO — Sir, I move

'Add the following proviso to sub-clause (1) of clause 2 of the Bill —

' Provided that this sub section shall not apply to any dancing by a woman or women, as the case may be at any marriage ceremony celebrated in any street or part of a street for the use of which permission of the appropriate authority is obtained '

This amendment is intended to cover certian contingencies which are not contemplated in the Bill

As it is' గా ఒక public street లో public కు access ఉన్నటువంటి ప్రాంతాలలో ఇది నిషేధింపబడిందితప్ప premises లో వారి ఇంటిదగ్గరఉన్న premises లో నేర్పుకోడానికి ఏమీ అభ్యంతరంలేదు అది clear గ ఉంది కొన్ని కొన్ని పెద్ద మునిసిపాలిటీలలో కొంతమందికి వాకిళ్లులేవు వారు పెండ్లి చేసుకోవాలంటే రోడ్డుమీద పందిళ్లు వేసుకోవలసి ఉంటుంది అక్కడ వేసుకోవడం న్యా నిషేధింపబడుతుంది

Mr SPEAKER —The Act will apply to dancing in any marriage or other procession Therefore I don't think the amendment of Sri M Rajeswara Rao is necessary

SRI K SUBBA RAO — అధ్యక్షా ఈమధ్య దేవదాస వ్యవహారంపైన ఈదండయాత్ర ఎందుకు వచ్చిందో నాకు తెలియదు ముఖ్యంగా పెద్దపెద్ద పెండ్లిడ్లు కట్టకడపటికి మనముఖ్యమంత్రిగారి పెండ్లిలోకూడ ఒకమంచి నాట్యకత్తెను తెచ్చి నాట్యం ఆడించారు మనదేశంలో దేవాదాసని గుడిచేటియని అంటారు అది ఇప్పుడు గడిసెట్టి అయింది గుడిచేటిపోయి గుడిసెట్టి అయింది కాని దేవదాస పూర్వలెక్కలనుబట్టిమాస్తే క్షేత్రయ్యపదాలు, తెలుగుదేశంలో పేరెన్నికగన్నవి మంచి ప్రసిద్ధిచెందినవి క్షేత్రయ్య నిజంగా భక్తుడగుటకు దేవదాసే కారణం అయింది ఆమెను ఎల్లప్పుడు రాత్రింబగళ్ళు చూచీ ఆమెను రమ్మనిచెప్ప పిలిచినపుడు ఆమెచెప్పింది 'నీవు ఈభగవంతునిపైన వేణుగోపాలుని పైన పద్యాలు పాటలు వ్రాసి చక్కగా నీవు నన్ను మొదట మెప్పించినట్లయితే తర్వాత నేను మెప్పస్తాను ' అని చెప్పినట్లుగా చరిత్రలోకూడఉన్నది కాని ఇపుడు procession అనేది ఉంది ఏదో amendment వచ్చింది ఇప్పుడు ఒకపెద్ద ఇంట్లో

Sri K Subba Rao] [14th August 1956

పెండ్లిజరుగుతుంది 4 corners లోను pandal వేసి 4 చోట్ల పెట్టుకుంటె ఒక చోట చిన్న pandal వేస్తే వచ్చిచూచేవాండ్లకు తగిన అవకాశంఉండదు ఎంతపెద్ద ఇల్లు అయినప్పటికీ చాలదు మనం రోజూ చూస్తున్నాం నిన్నటి దినం సినిమానటు లయిన రేలంగిని జమునను వాండ్లందరిని చూచుటకు వచ్చినపుడు ఇద్దరుపిల్లలు ఈ వూరిలోనే చచ్చిపోయినారు కనుక దేవదాసీలు ఎక్కడైనా street అనటటు వంటి స్థలంలో కొంతమంది నాట్యం చేయవలసివస్తుంది మేమంతా అక్కడ ఇంటిదగ్గరకు వచ్చుటకు పీలులేదు నాలుగుచోట్ల నాలుగు pandals వేసి చేసుకో వలసినటువంటి అవకాశంవుంది ఎప్పుడు ఇంటిదగ్గర చూచిపోయేవారుఉంటారు అందరు వచ్చిపోయ్యేదానికి పీలులేదు కనుక ఈ amendment ఇప్పుడు ఒప్పు కొన్నది సరిగనేఉంది ఇదిఒకవృత్తి ఇపుడుదేశంలో ఈభోగంవృత్తిఅనేటటువంటిది ఈనాట్యం అనేటటువంటిది పడుపువృత్తిగా చేస్తున్నారనేటటువంటి బాధ ఈ కాలంలోలేదు అదిఏదో కళావంతులుగ ఉండెటటువంటివారు ఏమోఅడిగినారని ఈప్రశ్నఉదయించడం తర్వాత దీనిని చేయడం బాగాలేదు దానిని అయినా streets లో అక్కడక్కడ pandal వేసి అక్కడక్కడ తగిన సౌకర్యాలు ఏర్పాటు చేసి నాట్యం ఆడించేటట్లు ఉండేటట్లయితే చూచి ఆనందించేవారికి తగిన అవకాశం ఉంటేకూడ బాగాఉంటుంది ఆ అవకాశం ఏర్పాటు చేయవలసిందని కోరు తున్నాను

SRIMATHI C AMMANNA RAJA — In any marriage or other procession might also be interpreted as 'in any marriage So, there is this ambiguity

Mr SPEAKER — Yes, it can be amended as 'in any marriage procession or other procession

THE HON SRI K CHANDRAMOULI — I accept the amendment, Sir

SRI M RAJESWARA RAO —Sir, I beg leave of the House to withdraw my amendment

The amendment was by leave of the House, withdrawn

Clause 2, was put and carried

The preamble was put and carried

Clause 1 was put and carried

THE HON SRI K CHANDRAMOULI —Sir, I move

That the Bill be passed into law

14th August 1956 ]

Mr SPEAKER — The question is
'That the Bill be passed into law
The motion was carried and the Bill was passed into law

*2 The Andhra Special Marriages Validation Bill, 1956*

THE HON Dr B GOPALA REDDI — Mr Speaker Sir I beg leave to introduce the Andhra Special Marriages Validation Bill 1956, and move that the Bill be taken into consideration at once

1955 జనవరిలో అంతకుముందు ఉన్న Act ను Government of India వారు repeal చేశారు కాని ఒకమాసంలో అక్కడఉన్న Registrar గారు నాలుగు పెండ్లిండ్లు పాత Act క్రింద register చేశారు కొత్త Act అప్పటికే అమలులోకి వచ్చింది పెండ్లిండ్లు సక్రమంగానే జరిగాయి సరిగానే register అయినాయి కాని పాత Act అంటే అమలులో లేనటువంటి Act క్రింద పెండ్లిండ్లు జరిగినాయి కాబట్టి వాటిని ఈనాడు validate చేయవలసి వచ్చింది అవి అన్నీ కూడ గుంటూరులోనే జరిగినవి దాంట్లో ఒక I A S Officer G V S Mani అనేవారి పెండ్లిఅయినది అవి అన్నీకూడా సక్రమంగానే జరిగిన పెండ్లిండ్లేఅని చెప్పడానికి ఈ validation బిల్లు తీసుకొనిరావడం జరిగినది

Mr SPEAKER — The question is

'That the Andhra Special Marriages Validation Bill, 1956, be taken into consideration at once

The motion was carried and the Bill was taken into consideration

Clause 2 was put and carrid

The Schedule was put and carried

Clause 1 with the Preamble was put and carried

THE HON Dr B GOPALA REDDI —Sir, I move
"That the Bill be passed into law '

Mr SPEAKER — The question is
"That the Bill be passed into law "
The motion was carried and the Bill was passed into law

*3 The Andhra Silkworm Seed (Control) Bill, 1956*

THE HON SRI K VENKATA RAO — Mr Speaker, Sir, I beg leave to introduce the Andhra Silkworm Seed (Control) Bill, 1956, and move that the Bill be taken into consideration at once

Sri K Venkata Rao] [14th August 1956

ఈ "Silk worm అంటే పట్టుపురుగులు పెంచడానికి సంబంధించినటువంటి బిల్లుఇది మన ఆంధ్రరాష్ట్రంలో మైసూరు పీఠభూమికి ప్రక్కన ఉన్నటువంటి భూములు Agency area లు మాత్రం ఇటువంటి పట్టు పరిశ్రమకు పనికివస్తాయి మనరాష్ట్రంలో దీనిని మూడు రకాలుగా ప్రవేశపెట్టుతూ ఉన్నాము మొట్టమొదట ఒక demonstration party ని పంపించి ఈ గ్రామస్థులకు పట్టుపురుగులను పెంచడం వాటినుంచి Mulberry plant ను పెంచుకోవడం వగైరాలు నేర్పిస్తూఉన్నారు రెండవభాగంలో గవర్నమెంటువారు ఒక Farm establish చేసి అక్కడ cuttings seedlings ను పెంచేటటువంటియత్నంచేస్తున్నారు మూడవది వారు తయారుచేసిన cacoons ను గవర్నమెంటువారే కొంటున్నారు తర్వాత reeling units అంటే పట్టుకాయలలోనుంచి దారం తీసేటటువంటి సంస్థలనుకూడ పెట్టుతూఉన్నారు మనరాష్ట్రంలో 5 silk farms ఉన్నాయి హిందూపురం పలమనేరు చింతలపూడి (West Godavari Dt ) Araku Valley, చింతలపల్లి తర్వాత 7 ప్రచారక కేంద్రాలు ఉన్నాయి 2nd Five Year Plan లో 10½ లక్షలరూపాయలతోటి ఈ seri culture ను అభివృద్ధిచేస్తామనే నిర్ణయంఉన్నది ఇందులో 5 లక్షలు seri culture అభివృద్ధికోసం 60 వేలరూపాయలు seri culture అభివృద్ధికోసం 5 లక్షలు Tussar silk అభివృద్ధికోసం వినియోగింపబడుతున్నది ఇపుడు అమలులో ఉన్నటువంటి 1956-57 సంవత్సరంలో agency లు కానటువంటి ప్రాంతాలకు 6 scheme లు ఈమధ్యనే ఇండియా గవర్నమెంటు వారు sanction చేశారు

హిందూపురంలో గ్రైన్‌జి ' పెట్టడంకోసం ఒకటి తర్వాత మన demand ప్రస్తుతం ఒకలక్ష seedlings ఉన్నాయి ఇప్పుడు దానిని 10 లక్షలకు పెంచేటటువంటి యత్నం జరుగుతూంది Basic seed farm ను ఒక్కదానిని హిందూపురంలో పెట్టడానికి హిందూపురం పలమనేరులలో రీలింగు సెంటర్సు పెట్టడంకోసం పలమనేరులోఉన్న Farm నకు నూతులు వగైరాలు త్రవ్వించడానికి 10 ఎకరాల plot లో మల్బరీ పెంచడానికి కర్నూలుజిల్లా ప్యాపలిలో 3,500 ఎకరాలలో ఆముదపుచెట్లు పెంచేప్రదేశంగనుక అక్కడ సెరికల్చరు అంటే ఆముదపుఆకులమీద బ్రతికేటటువంటి ఎల్కువరమ్సు పెంపకంకోసం sanction అయ్యాయి ఇదిగాక ఏజన్సీలో చింతపల్లిలో అయిదు ఎకరముల Farm ఉన్నది కాని దానికి మంచినీటి వసతి లేకపోవడంవల్ల కొత్త farm 5 ఎకరాలు కొన్నదానికిన్ని అక్కడఉన్న cocoonut ను మార్కెటు prices కు తగ్గించకుండా కొనడానికిన్ని ఏర్పాటులు అయినాయి అక్కడఉన్న కొండజాతులకు సరిఅయినటువంటి ఖరీదు ఇవ్వక పెంచరు గనుక అరకువాలీలో 10 ఎకరాల ప్రదేశంలో ఈ hillmen

14th August 1956 [ Sri K Venkata Rao

కోసము రీలింగు యూనిట్సు పెట్టడానికి తూర్పుగోదావరి ఏజన్సీలో వెంకటాపురంలో మద్ది ఆకులమీద బ్రతికేటటువంటి టస్సారుసిల్కు 15 ఎకరాల Farm ను ఒకటి పెట్టడానికి ప్రయత్నం జరుగుతూన్నది ఇందులో Plain Schemes కు 2 15 700 రూపాయలు ఖర్చు అవుతవి ఈ సంవత్సరంలో ఇందులో సగం Government of India వారు గ్రాంటు ఇస్తారు Agency విషయం అంతా grant ఇవ్వాలని Government of India వారికి వ్రాశాము 1850 సంవత్సరంలో Central Silk Board వారు దేశమంతా ఒకేరకంగా పట్టు పురుగులను పెంచేటటువంటి పద్ధతిని ప్రవేశ పెట్టవలయునని నిర్ణయించి అప్పుడున్న సంయుక్త రాష్ట్రానికి పంపిస్తే వారొక బిల్లును ప్రవేశపెట్టారు కానీ అప్పటి పరిస్థితులలో silk worms కు కనుక ఎప్పుడైనా అంటువ్యాధులు తగిలితే అప్పుడే ప్రభుత్వానికి హక్కు కలుగజేశారు కానీ తర్వాతజరిగిన వ్యవహారాలవల్ల వాటియొక్క పెంపకాన్ని గురించి licence పుచ్చుకొన్నవాళ్లే పెంచడం పురుగులకు జబ్బులు రాకుండా చేయడం అందువల్ల మంచి సిల్కును తయారుచేస్తే మంచిదనే నిర్ణయంతోటి ఈ Act ను సభ ముందర పెట్టటం జరిగింది ఈ బిల్లుకు ప్రెసిడెంటు వారి sanction పుచ్చుకొని తమ ముందు పెట్టుతున్నాం ఇప్పుడు ఈ బిల్లు యొక్క ఆదర్శాలేమిటంటే Silk worms రీలింగు అంటే ఈ పురుగులను పెంచడం లైసెన్సు పుచ్చుకొన్నవాళ్లే చేయాలని Licence పుచ్చుకోని ఏ మనిషికూడా దీనిని నిలవపెట్టడంగానీ ఒక మూలనుంచి మరొకమూలకు పంపించడంగానీ అమ్మకం గానీ, ఈ silk worm లను పెంచడంగానీ చెయ్యకూడదని ఈ Act యొక్క ఉద్దేశ్యం ఇందులో 3 వ సెక్షన్ Licence నిర్ణయిస్తుంది Regulation of reeling (పెంచడాన్ని గురించి) 5 Application of licence- (6) Powers of Inspection (7) Penalties ఈ పెనాలిటీలను వేయడానికి డైరెక్టరే sanction ఇవ్వాలి ప్రతివారూ కేసువేయడానికి వీల్లేదు ఈ Penaltyని 1 class Magistrate, try చేయాలి తరువాత ఎవరైనా కంపెనీలో offence చేస్తే ఎవరి మీద కేసుపెట్టాలనే నిర్ణయం Government Servants కు protection, తర్వాత గవర్నమెంటువారు అవసరమయిన నిబంధనలను చేయడానికి హక్కు మన రాష్ట్రంలో Silk పరిశ్రమ ప్రథమకందాయంలో ఉందని చెప్పవలసి ఉన్నది ఇంకాచాలా యత్నంచేస్తేనేగాని ఇది అభివృద్ధి చెందదు దానికి అనుగుణంగా, దానియొక్క అభివృద్ధిని సూచిస్తున్న బిల్లు ఇది కాబట్టి ఈ బిల్లును శాసనంక్రింద చేయవలసిందని సభవారిముందు ప్రవేశపెట్టుతున్నాను

Mr SPEEAKER —The question is

"That the Andhra Silkworm Seed (Control) Bill, 1956 be taken into consideration at once

The motion was carried and the Bill was taken into consideration

Clause 2 to 13 were put and carried

Clause 1 with the Preamble was put and carried

THE HON SRI K VENKATA RAO —Sir, I move

"That the Bill be passed into law"

Mr SPEAKER —Motion moved

"That the Bill be passed into law"

SRI K SUBBA RAO — అధ్యక్షా పట్టుపరిశ్రమనుగురించి ప్రోత్సాహమును చేయడానికి ప్రభుత్వంవారు పూనుకొని చక్కని బిల్లును తెచ్చినందులకు అభినందిస్తున్నాను హిందూపురంలో ఇప్పుడు ఆంధ్రప్రాంతానికి అంతటికీకూడా ముఖ్యమైన కేంద్రం ఒకటి ఏర్పాటు అయింది కానీ అదికూడా చక్కని పరిస్థితిలో లేదు వానిని గమనించే ఆంధ్రదేశంలో పట్టును ప్రోత్సహించేవాళ్ళు ఎక్కువ ఉన్నారుకానీ పట్టుకుకావలసిన ముడిపదార్థం దొరికే అవకాశాలను గురించి దానిని ప్రోత్సాహంచేసి తగినటువంటి పట్టుదలతో పనిచేసేవారులేరు దీనికి ఒక సూచనచేస్తున్నాను అనుభవాన్నిబట్టి పట్టుపురుగులను పెంచే ఆకుకు రేష్యం ఆకు అంటారు ఆ ఆకును పెంచుట చాల సులభం చాలమంది రైతులు ముందుకు వస్తున్నారు కాని ఆ పెంచినటువంటి ఆకు (రేష్యం) పురుగులను పెంచేవారు కొంతమంది ఏర్పడితే గానీ ఖర్చుకాదు ఈ ఆకును కొనుక్కునేవారు లేరు కాబట్టి మళ్లా పెంచకుండా విడిచిపెట్టుతున్నారు హిందూపురమే ముఖ్యమయిన కేంద్రం ఆక్కడ ఈపట్టుపురుగులను పెంచేపద్ధతిలో తరిఫీదుచేసేదానికి తగినటువంటి ఒక శిక్షణాలయాన్ని పెట్టి ఆంధ్రదేశమంతాకూడా అనేకమందిని ఈ పట్టుపురుగులను పెంచేదాంట్లో తరిఫీదునుఇచ్చి కృషిచేయవలసి ఉంది

ఇప్పుడు భారత ప్రభుత్వంవారు ఆంధ్ర ప్రభుత్వంవారు కలిసి చేసేకృషి ఫలవంతమై చక్కగా ఆంధ్రదేశంలో అవకాశమున్నచోట చేయవల్లసిఉంది ఇంక *Seri culture* అని వారు చెప్పినారు అది ఆముదాల ఆకును తిని మంచిరకమైన బలవత్తరమయిన పట్టు ఉత్పత్తి చేసేటటువంటి ఒక పరిశ్రమ అస్సాందేశం అంతా నేను చూచివచ్చినాను అనేకమంది బీదకుటుంబాలకు ఈపట్టు పరిశ్రమ ఉపకారిగా ఉంది మంచి శీతోష్ణస్థితులకు మంచి పేరునుగన్నట్టి ప్యాపలీలో Seri culture centre పెట్టడం ముదావహం అక్కడచుట్టుపట్ల అప్పుడే వేలకొలది

ఎకరాలలో ఆముదం చెట్లను పెంచుతూ ఉండడం అందరికీ తెలుసును అట్టిపరిశ్రమను అభివృద్ధిచేసేదానికి పూనుకొని వ్యవహారించినందులకు సంతోషం వీనిని కరుణాకటాక్ష వీక్షణముతో చూచి దీని అభివృద్ధికి ప్రభుత్వంవారు చక్కగా పరిపాలనచేస్తారని ఆశిస్తున్నాను మనం ఇంతవరకు కష్టపడి పనిచేసినటువంటి కొళ్ళేగాలు పరిశ్రమ మనచేతినుండి దూరమైపోయింది అట్లనే అనేకచోట్ల ఆంధ్ర ప్రభుత్వం వారిచే తరఫీదు పొందినవాళ్లు ఉన్నప్పటికిన్ని వారు ఈ భాగాల క్రింద వెళ్ళిపోయినారు గనుక దీనిని శ్రద్ధతో పనిచయించడానికి ఒక చట్టంతెచ్చి రోగాల నివారణకు తగినటువంటి క్లాజునుకూడా ఇందులో పెట్టినదానిని గవర్నమెంటువారు స్వాధీనంలో పెట్టుకొని దీనిని పెంపొందింప చేసేటటువంటిది చాల అభినందించ తగినదని చెప్పుతూ ఈబిల్లు ఈదినం ఒక్కచట్టంగా మారే టటువంటి వైభవసమయంలో పట్టుపరిశ్రమ పురోభివృద్ధిచెందుతుందని ఆశిస్తున్నాను

SRI S VEMAYYA — అధ్యక్షా ! ప్రభుత్వంవారు పట్టుపరిశ్రమను ప్రారంభించినందుకు చాలాసంతోషిస్తున్నాము లోగడ అరకువేలీలో ప్రారంభించిన ఈపట్టుపరిశ్రమ తక్కువస్థాయిలో జరుగుతున్నది నేను వెళ్లిచూచాను ఈ పరిశ్రమలో పనిచేసే ఉద్యోగస్థులు గృహవసతులులేక చాలా బాధపడుతున్నారు పట్టుపురుగులను వుంచుటకు ఎరైన sheds లేవు అక్కడ పట్టుపరిశ్రమను అనేక విధముల అభివృద్ధిలోకి తీసుకురావడానికి వీలుందని అక్కడ ఉద్యోస్థులు చెప్పారు కాని అక్కడ ఉద్యోగులుమాత్రం చాల హీనస్థితిలోఉన్నారు ఐనప్పటికీ పరిశ్రమను అభివృద్ధిపరచుటకు వారు పాటుపడుతున్నారు ఆవిషయం ప్రభుత్వంవారు గ్రహించి వెంటనే వారికి గృహవసతి సౌకర్యములు కల్గించాలని మనవిచేస్తున్నాను

పరిశ్రమకు కావలసిన పురుగులను ఇతరదేశములనుంచి తీసుకువస్తున్నట్లు తెలుస్తున్నది విమానాలలోవచ్చే పురుగులలో ఇక్కడకు వచ్చేలోపల కొన్ని పురుగులు చనిపోతున్నాయని తెలుస్తోంది అందుచేత దూరదేశములనుండి పురుగులను తెప్పించుపద్ధతి మాని మనకు వీలైన ప్రదేశములనుండి తెప్పించుకొనే పద్ధతి అవలంభిస్తే బాగుంటుందని మనవి చేయుచున్నాను

THE HON SRI K VENKATA RAO —దూరదేశాలనుండి తీసుకురావడంలేదు మనమే తయారు చేస్తున్నాము

SRI S VEMAYYA —విమానములలో దూరప్రదేశములనుండి పురుగులను తెచ్చేపద్ధతి మాని మనమే తయారుచేసుకొంటున్నామని మంత్రిగారు చెబుతున్నారు ఈపద్ధతి సక్రమంగా కొనసాగినట్లయితే మనం చాలా సంతోషించాలి

Sri S Vemayya ] [ 14th August 1956

పరిశ్రమలో పనిచేస్తున్న ఉద్యోగస్థులకు గృహ సౌకర్యములు కల్గించి ఆ పట్టు పురుగులను పెంచడానికి sheds వేయించాలని మనవిచేస్తూ విరమిస్తున్నాను

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా, ఈ పట్టు పరిశ్రమను అన్ని చోట్లా విస్తరింపచేయుటకు అవకాశమున్నదా ? లేదా అనే విషయం మంత్రిగారు చెప్పవలసినదిగా కోరుతున్నాను సాధారణంగా పట్టు పరిశ్రమకు చల్లని ప్రదేశం అనువైనదని చెబుతారు చల్లటి ప్రదేశాలు కాదు దానికి సరైన వాతావరణం వుంటే సరిపోతుందని కొందరు అంటున్నారు తమలపాకుల తోటలు పెంచుటకు సరిపోయే వాతావరణం దానికికూడా పనికివస్తుందని ఇతర ఆకులుకూడా ఉపయోగించవచ్చుననీ చెబుతారు అటువంటివికూడా పరిశీలించి చేసినట్లయితే ఆంధ్రదేశంలో ఈ పరిశ్రమను యింకా విస్తరింపచేయుటకు వీలవుతుంది పట్టుపురుగులకువచ్చే వ్యాధులను అరికట్టడానికి ప్రయత్నిస్తున్నారు ఇందుకు మా సంతోషాన్ని వెలిబుచ్చుతున్నాము ఈ పరిశ్రమను అభివృద్ధిచేయాలని మా కోరిక

THE HON. SRI K VENKATA RAO — ఈ బిల్లుపైన ముగ్గురు సభ్యులు మాట్లాడినారు వారు మాట్లాడిన విషయాలు చాలావరకు బిల్లులో వున్నాయి ఇదివరకు ఆంధ్రరాష్ట్రంలో సిల్కు పరిశ్రమ లేదు హిందుపూరు ప్రాంతంలోని వారు కొందరు మైసూరు నుంచి private గా తీసుకొచ్చి అమ్ముకొంటున్నారు వాటికి సరియైన సొమ్ము రావడంలేదు అయినప్పటికీ ఈ పరిశ్రమను మన రాష్ట్రంలో అభివృద్ధిలోకి తీసుకురావాలనే ఉద్దేశ్యంతో ఈ స్కీమును ప్రవేశపెట్టాము

పట్టు పురుగు గ్రుడ్లు చాలా చిన్నవిగా వుంటాయి పరిశ్రమంతా ఆ గ్రుడ్ల మీద ఆధారపడి వుంటుంది ఇంతవరకు చైనానుంచి, మైసూరునుంచి తీసుకువచ్చేవారు గ్రుడ్లదగ్గరనుంచి draw silk నేత నేసేవరకూ మనం తయారుచేసుకోవాలనే ఉద్దేశ్యంతోటి ఈ స్కీమును అమలు పరుస్తున్నాము అన్నిచోట్లకూడా పట్టు పురుగులను పెంచవచ్చని గోపాలకృష్ణయ్యగారు అన్నారు కాని చల్లటి ప్రదేశం కావాలని technical people అభిప్రాయం పశ్చిమగోదావరి జిల్లాలోని చింతలపూడిలో ఒక farm వుంది అది fail అయిపోయింది. ఒక కాలంలోవచ్చే అధిక ఎండలవలన పాడైపోతోంది. దానికి ప్రత్యేకమైన rain fall వుండాలి అందుచేత చింతలపూడిలోని farm మూసివేయవలసిన పరస్థితి యేర్పడుతోంది

వారు చెప్పిన airy silk పరిశ్రమకూడ చాల మంచిదే దానిని అన్నిచోట్ల అమలుజరుపడానికి వీలుంటుందేమో పరిశీలించాలి దానిని గురించి మొదట experiment గుత్తి రోడ్డులో ఉన్న ప్యాపలి గ్రామంలో చేయబోతున్నాము అక్కడ 3 500 ఎకరాల coster oil seed farm వుంది ఆ ప్రాంతంలో ఆకు దొరుకుతుంది ఆ ఆకులమీద కొంచెం బలమైన airy silk తయారుచేయుటకు వీలుంటుంది మజ్జాకుమీద పెరిగేదానిని టస్సారీ సిల్కు అంటారు అది వెంకటాపురందగ్గర ఉత్పత్తిచేయడానికి ప్రయత్నం చేస్తున్నారు దీనిని ఎక్కువ అభివృద్ధిలోకి తీసుకువచ్చి దేశంలో ఎక్కువగా పట్టు ఉపయోగించేటట్లు చేయాలని ప్రభుత్వంవారి ఉద్దేశ్యం ఈ బిల్లుకు సభ్యులంతా ఆమోదం తెలిపినందుకు కృతజ్ఞత వెల్లడిస్తున్నాను ఈ అసెంబ్లీ వచ్చిన తరువాత నేను ప్రవేశపెట్టిన మొదటి బిల్లు యిదే పట్టు మెత్తని వ్యవహారం ఇంత మెత్తగా రేపు ఎల్లుండి ప్రవేశపెట్టబోయే బిల్లులనుకూడా pass చేయవలసిందిగా కోరుతున్నాను

Mr SPEAKER —The question is

' That the Bill be passed into law "

The motion was carried and the Bill was passed into law

## 4 *The Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill, 1956*

THE HON SRI K CHANDRAMOULI — Mr Speaker, Sir, I beg leave to introduce the Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill, 1956 and move that the Bill be taken into consideration at once

తిరుపతి తిరుమలై దేవస్థానానికి సభ్యులను nominate చేసినప్పుడు వారి term 3 సం॥ లని నిర్ణయించామనుకోండి కొంతకాలమైనతరువాత ఒకసభ్యుడు ఏకారణంచేతనైనా రాజీనామాచేసినా లేక ఆకస్మాత్తుగా మరణించుటవల్ల ఒక స్థానం ఖాళీయేర్పడినా, లేక ఏకారణంచేతనైనా ప్రభుత్వం ఒకరిని ఆపదవినుండి తొలగించుటవలన ఖాళీయేర్పడినా ఆఖాళీలో నియమించినసభ్యుని పదవీకాలం అప్పటినుంచి మూడుసంవత్సరములుకాకుండా మొదట నిర్ణయించిన term లోని భాగంమాత్రమే వుండేటట్లుగా ఈ బిల్లులోవుంది ఇదిచాలా చిన్న amendment కాబట్టి సభ్యులంతా ఆమోదించాలని కోరుతున్నాను

SRI M NAGI REDDI — మిగిలిన దేవాదాయ, ధర్మాదాయ సంస్థలలోని trustees కు అందరకు 3 సం॥ల కాలపరిమితి ఎట్లావుంది ?

[ 14th August 1956

THE HON SRI K CHANDRAMOULI — Trustees విషయంలో amendment ఏమీలేదు ఒకవేళ ఖాళీయేర్పడినప్పుడు Commissioner గారుగాని, Assistant Commissioner గారుగాని area committee గాని nominate చేస్తారు

Mr SPEAKER — Motion moved

That the Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill, 1956, be taken into consideration at once

SRI B SANKARAIAH — అధ్యక్షా ఈ amendment చాలా చిన్నది తిరుపతిదేవస్థానంయొక్క trustees ను ఉద్దేశించి తీసుకువచ్చారు తిరుపతిదేవస్థానానికి ఈ అసెంబ్లీతరఫున కొంతమందిని trustees గా appoint చేస్తారు అసెంబ్లీలో ఈసవరణ తీసుకువచ్చినప్పుడు ప్రతిపక్షానికిగూడా ఒకస్థానమిస్తామని చెప్పారు ఒకస్థానం ఇచ్చారు అట్లా nominate చేయాలనే convention వచ్చినప్పుడు దీనిని అమలుపరుస్తామని అప్పుడు అసెంబ్లీలో Endowments Minister గా నున్నవారు వాగ్దానంచేశారు కాని ఆప్రకారం చేయలేదు లక్ష్మీనృసింహరాజును మా పార్టీ తరపున నియమించారు కాని ఇప్పుడు నియమించినవారిలో ప్రతిపక్షంనుంచి ఎవరినీ తీసుకోలేదు దేవుడిలో నమ్మకంఉండాలని కొంతమంది సూచించారు Trustees ను నియమించేటప్పుడు ఆపార్టీకి దేముడంటె నమ్మకం వుందాలేదా అనే విషయం అనవసరం ఒకపార్టీకి దేముడంటే నమ్మకం వుందనీ మరొక పార్టీకి నమ్మకం లేదనీ అనడం ఈ రోజుల్లో చాలా హాస్యాస్పదంగావుంది

THE HON SRI K VENKATA RAO —మీకు దేముడంటే నమ్మకం వుందా ? లేదా ? చెప్పండి

SRI B SHANKARAIAH — దేముడుమీద నమ్మకం ఉందా ? లేదా అనేది రాజకీయాలకు సంబంధించిన విషయంకాదు

దేముడుమీద నమ్మకంవున్నట్లయితే కమ్యూనిష్టుపార్టీలో చేర్చుకోరాదనీ, నమ్మకంవుంటేనే కాంగ్రెసుపార్టీలో చేర్చుకోవాలనే rule లేదు రాజకీయమైన విషయాలలో దేముడుమీద నమ్మకంవుందా ? లేదా ? అనేదిపాటించరు దేవస్థానమునకుండే ఆస్థిని సక్రమంగా వినియోగించడానికి administration సరిగ్గా జరగడానికి ఈ trustees ను నియమించడం జరుగుతోంది ఇతరపార్టీలవారికన్నా కమ్యూనిష్టుపార్టీవారు డబ్బును దుర్వినియోగం చేస్తున్నారనికాని పరిపాలనా వ్యవహారం సరిగ్గా జరగనీయడంలేదనికాని చెప్పినప్పుడు ఆలోచించాలికాని ఈవిధంగా దేముడుమీద నమ్మకంవుందా ? లేదా ? అనేవిషయం తీసుకోకూడదు

14th August 1956] [Sri B Shankaraiah

ఈవిధంగా area committees ను నియమించేవిషయంలోగాని దేవస్థాన trustees ను నియమించేవిషయంలోగాని ప్రతిపక్షంతరఫున కొంతమంది వాదించబట్టే అక్కడ వున్నటువంటి Commissioner గాని Assistant Commissioners గాని area committees కొన్ని proposals పంపించినప్పుడు రాజకీయకక్షతో ఇతరపార్టీలకు అవకాశం ఇవ్వకుండా వీరితో అనుయాయులుగా వుంటారేమోననే పక్షపాతంతో చేయడం జరుగుతోంది క్రిందటి సంవత్సరం area committees 11 జిల్లాలలోనూ ఏర్పాటు చేశారు

ఈ area committees లో దాదాపు 2 సీట్లు ఉంటాయి వాటిలో ఒక్కరినైనా ప్రతిపక్షంనుంచి నియమించారా ? శాసనసభతరఫున 4 సీట్లువుంటే proportional representation ప్రకారం ఓటింగుపెట్టి నియమించినప్పుడైనా ప్రతిపక్షానికి కొన్ని సీట్లు వచ్చేవి Proportional representation లేకుండా ప్రభుత్వమే వారినందరినీ నియమించేబాధ్యత తీసుకొని ఈవిధంగా కొన్ని రాజకీయపక్షాలను eliminate చేసే పక్షపాతంతో నియమిస్తోంది Endowments Act ను గురించి చిన్న సవరణలు వచ్చినప్పుడు వాటిని పూర్తిగా సవరించి వాటిఆస్తులన్నీ సక్రమంగా వినియోగం చేయడానికి సుదీర్ఘమైన చర్చలు జరిగాయి Act ను త్వరలోనే తీసుకువస్తామని సంవత్సరాల తరబడిగా అసెంబ్లీలో చెబుతున్నారు ప్రభుత్వం తరఫున statements యిచ్చారు ఎప్పటికప్పుడు చిన్న సవరణలుమాత్రం చేస్తున్నారు అనేక దేవస్థానాలలో చాలాసొమ్ము దుర్వినియోగ మౌతోంది మాజిల్లాలో ఇట్లాంటి సంఘటనలు అనేకం జరుగుతున్నాయి ఈసంగతి మంత్రులకు తెలుసు ఈవిధంగా ద్రవ్యం దుర్వినియోగం కావడానికి కారణాలేమిటో తెలుసుకొని సద్వినియోగం చేయడానికి ఎటువంటి చర్యలు తీసుకోవాలో ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచించి తగిన చర్యలు వెంటనే తీసుకోవాలని కోరుతున్నాను అదేవిధంగా దేవస్థానం భూముల విషయంలో వారికి ఇచ్చినటువంటి భూములను lease కు తీసుకొనే విషయంలో కూడా ఎక్కువమంది ప్రజానీకానికి ఉపయోగపడేటట్లుగా చేయాలని ప్రభుత్వము Act లో సవరించక పోయినప్పటికి 5 వేల రూపాయల ఆదాయానికి పైబడిన Society లకు ఇవ్వాలని ఇదివరకే G O లను పంపింది కాని అది సరిగా అమలు జరుగుతోందా లేదా ? ఒకే దేవాలయానికి 5 వేలని పెట్టాల్సిన అవసరం ఏమి ఉన్నది ఇంకా ఎందుకు తగ్గించి పెట్టకూడదు అని విచారణ చెయవలసిన అవసరం ఉన్నది ఈవిధంగా అనేకజిల్లాల్లో nominal పాట పాడామనిచెప్పి ట్రస్టీలు సంవత్సరాల తరబడి కౌలు చెల్లించినా చెల్లించకపోయినా ఏదోఒక భూస్వామికి కౌలుకి ఇస్తున్నారు అటువంటివాటిని Society లకు ఇచ్చినపుడు ముందుగా cash deposit కట్టాలి అదిచెయ్యాలి, ఇదిచెయ్యాలి అని అనేకములైన conditions పెడు

తున్నారు దానినే భూస్వాములకు ఇచ్చినపుడు nominal గా 50 రూపాయలు deposit కడితే దానిమీద వేలకొలది ఆదాయాన్నంతా వాళ్ళు చెల్లించక పోయి నప్పటికి కూడా సంవత్సరాల తరబడి వాళ్ళనే ఉంచుతున్నారు వాటిమీద action తీసుకుని వాళ్లను భూములనుంచి తొలగించి ఆ మొత్తాలను వసూలు చేసేదానికి కనీసము ప్రయత్నముకూడా జరగడంలేదు అందువల్ల యీ విషయాలన్నింటిని దృష్టిలో పెట్టుకొని ఆంధ్రరాష్ట్రంలోని మొత్తం దేవాలయాల డబ్బంతా సరిగ్గా వినియోగపడేటట్లు departments చేత సక్రమంగా పనిచేయించాలి అన్ని రాజకీయ పక్షాలకుకూడా ఈడబ్బును సద్వినియోగం చేయాలనేటటువంటి విషయంలో బేధాభిప్రాయం ఉండదనే అనుకొంటాను అటువంటప్పుడు అన్నిపక్షాలయొక్క సహకారం తీసుకొని ట్రస్టీలను నియమించడం area committee లను నియమించడం ముఖ్యంగా మన రాష్ట్రంలోకల్లా పెద్ద ఆదాయం కలిగినటువంటి తిరుపతి దేవస్థానానికి ట్రస్టీలను నియమించడం మొదలైన విషయ లన్నింటిని మనస్సులో పెట్టుకొని చేయాలని కోరుకున్నాను ఈ విషయాలలో మంత్రిగారు ఇప్పుడు ఎంతవరకు పపనులు చేయగలరో చెప్పాలని కోరుతున్నాను

SRI V KURMAYYA —అధ్యక్షా నేను మంత్రిగారు తెచ్చినటువంటి సవరణను మనస్ఫూర్తిగా బలపరుస్తున్నాను మన రాష్ట్రంలో ముఖ్యంగా అన్ని జిల్లాలలోకూడా Area Committee లు ఏర్పడ్డాయి మన ప్రభుత్వము వచ్చిన తరువాత దేవాలయాలకు సంబంధించిన సవరణ చట్టం తెచ్చినప్పటినుంచికూడా Area Committee లను ఏర్పాటు చేయాలన్నారు మొట్టమొదటగా 1937-38 లో అనుకుంటాను రాజగోపాలాచారిగారి నాయకత్వంలో ఉన్నప్పుడు మొట్టమొదట హరిజనులు మధుర దేవాలయంలో హరిజన సేవాసంఘం అధ్యక్షతక్రింద, శ్రీ శ్రీ వైద్యనాథ్ అయ్యరుగారి అధ్యక్షతక్రింద దేవాలయప్రవేశం చేశారు అప్పటి చట్టంలో హరిజనులుగనుక దేవాలయ ప్రవేశం చేసినట్లయితే వారు శిక్షార్హులుగా ఉండేవారు అంటే Act ప్రకారం హరిజనులకు శిక్ష విధింపబడాలి దీనికి ఉదాహరణగా శ్రీ శ్రీ N దేవేంద్రుడుగారు ఒకప్పుడు M L C, గా తిరుపతి దేవాలయ ప్రవేశం చేశారు అప్పుడు ఆయనకు శిక్ష వేయించాలనే ఉద్దేశ్యంతో ట్రస్టీలంతా ఆయనమీద case పెట్టారు అది High-court దాకా వెళ్ళింది శ్రీ శ్రీ నాగేశ్వరావు పంతులుగారు మొదలైన నాయకులంతా కలిపి ఒక హరిజన్ M L C దేవాలయ ప్రవేశంచేస్తే శిక్ష విధించినట్లయితే హిందూమతానికి హిందూదేశానికి అగౌరవం అనేభావంతో వారు High Court లో indirect గా interfere అయి శిక్షలేకుండా చేశారు అట్లాగే రాజగోపాలాచారిగారి time లో మధురలో ప్రథమ దేవాలయ ప్రవేశము జరిగినపుడు చట్టప్రకారం హరిజనులందరిని శిక్షించాలని చెప్పినపుడు

రాజాజీగారు ఆ రాత్రికిరాత్రే Act of Indemnity ని pass చేసి వాళ్ళకు శిక్ష లేకుండా చేశారు హరిజనులకు కూడా దేవాలయాలలో ట్రస్టీలుగా ఇవ్వాలి హరిజనులకు కొంతమందికి మంత్రాలు చెప్పించి సంస్కృతము చెప్పించి తయారు చేసి పూజార్లుగా వేశారు దాని ప్రకారము ఇప్పుడు హరిజనులను వెళ్ళకూడదనే నిబంధన ఎక్కడాకూడా లేదు అయితే ఒక member ఉన్నారు అప్పటినుంచి కూడా మునుస్వామి ఎళ్లైగారు దొరైకన్ను అప్పలస్వామి మొదలైనవారు ఉన్నారు అని నిన్న మన ముఖ్యమంత్రిగారు కూడా చెప్పారు శాసనరీత్యా ఏమి అవసరంలేదు శాసన సంబంధమైనటువంటి Statutory rights ఉండకూడదని చెప్పేవాళ్ళలో నేను ఒకడిని అసలు ఈ చట్టం పాసై దాదాపు 5 సంవత్సరాలు అయినది Healthy convention ను create చేస్తామని అంటున్నారు అయితే ఎంతమంది హరిజనులను ట్రస్టీలుగా వేశారు ఎంతమందిని Area Committee లో వేశారు? ఆ జిల్లాలోను ఈ జిల్లాలోను ఒకరినో ఇద్దరినో వేశామని మంత్రిగారు చెపుతున్నారు గత 2 సంవత్సరాలు నేను Area Committee లో member గా ఉన్నప్పుడు హరిజనులను ట్రస్టీలుగా వేయడానికి నేను చాల ప్రయత్నంచేశాను కాని మేము వేయలేకపోయాము Member లే oppose చేస్తూ ఉండేవాళ్లు కాని కాశీశ్వరరావు పంతులుగారు ఉదారంగా మా నందిగామలో ట్రస్టీగా ఒక హరిజనునిమాత్రం వేశారు మనఆంధ్రరాష్ట్రం అంతా చూసినట్లైతే ఒకట్రస్టీకూడా ఉండిఉండడు అయితే Healthy convention create చేసి అస్పృశ్యతా నివారణ చేయాలంటే దేవాలయాలు చాల ముఖ్యము పవిత్రమైనటువంటి క్రైస్తవ mechineries కోట్లకొలది డబ్బు ఖర్చుపెట్టి హరిజనులను conversion చేసుకుందామని ఎన్నోసంవత్సరాలనుంచి ప్రయత్నంచేసినాకూడా హరిజనులు ఆమోహంలో పడకుండా హిందుమతంలోఉండి రాముణ్ణి కృష్ణుణ్ణి తిరుపతి వెంకటేశ్వర్లుని మొదలైన హిందూదేవుళ్లనే పూజిస్తున్నారు కోట్లకొలది డబ్బువస్తున్న హిందూ మతాన్ని హిందూదేశాన్ని వదలిపెట్టకుండా ఈదేవునిమీదే వారికి నమ్మకంవున్నది కాబట్టి ఈచట్టం తేవడం చాల అవసరమని ముఖ్యమంత్రిగారికి, ప్రభుత్వానికి తెలియజేస్తున్నాను Healthy convention create చేసే విషయంలో ప్రతి area committee లోను హరిజనులు ఉండాలి ప్రతిదేవాలయంలోను తెగ్గుకు నుంచి 5గురు ట్రస్టీలు ఉంటారు అందులో ఒక హరిజన్ ట్రస్టీని విధిగా వేయాలి కాంగ్రెసు అస్పృశ్యతా నివారణకు కంకణం కట్టుకొని చట్టాలు చేసినది ఈదేవాలయ ప్రవేశ చట్టమును నిజంగా అమలుపరచాలంటే ట్రస్టీలుగా హరిజనులను వేసేటటువంటి ఏర్పాటుచేయాలి Constitution లో చట్టబద్ధంగా మాకు హక్కు అవసరంలేదు హరిజనోద్ధరణకుగాను, దేవునియందు భక్తిని హరిజనులలో

Sri V Kurmayya ] [ 14th August 1956

కలుగజేయడానికిగాను హరిజనులను తప్పకుండా ట్రస్టీలుగా వేయడంమంచిది Healthy convention create చేయాలని చెపుతూ మంత్రిగారుతెచ్చిన సవరణను బలపరుస్తూ హరిజనుల తరుపున ఈ విషయాలుచెప్పి సెలవు తీసుకొంటున్నాను

SRI S VEMAYYA —అధ్యక్షా మంత్రిగారు తెచ్చినటువంటి బిల్లును గురించి మనవిచేస్తాను తిరుపతి దేవస్థానం ట్రస్టీలవిషయంలో లోగడ ఉన్నటువంటి విధానాన్ననుసరించి ప్రతిపక్షానికికూడా దేవస్థానం బోర్డులో ఒక seat ఇచ్చినట్లైతే మన ఆశయాలన్నింటిని ఆచరణకు తేవడానికి అవకాశం వస్తుంది తిరుపతి దేవస్థానానికి సంబంధించినటువంటి చట్టాన్ని వేరుగా కాకుండా రాష్ట్రంలో ఉన్నటువంటి endowment లన్నింటికి కలిపి ఒకటే సమగ్రమైనటువంటి చట్టాన్ని అమలుపరచాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను అనేకచోట్ల endowment ల యొక్క property అంతాకూడ దుర్వినియోగం అయిపోతున్నది వారు accounts అన్నీ సరిగా check చేయడం లేదు అందువల్ల సమగ్రమైనటువంటి చట్టాన్ని రాష్ట్రవ్యాప్తంగా తీసుకొచ్చి అమలు జరిపినట్లయితే ఇవన్నీ సరిగా జరగడానికి వీలు అవుతుందని మనవిచేస్తున్నాను ఇప్పుడు endowment శాఖకు సంబంధించినటువంటి staff చాల తక్కువగా ఉన్నది దానిమీద అజమాయిషీ కూడా సరిగా జరగడం లేదు కనీసం ఒక ట్రస్టీని తీసివేయాలంటే సంవత్సరాల పర్యంతము పడుతోంది కనుక వెంటనే తగిన చర్య తీసుకొని సరైనటువంటి విధానంలో దేవస్థానాలన్నీ నడపడానికి గాను ఒక చట్టాన్ని ప్రభుత్వం ఆలోచించాలి Area Committee లలో సభ్యులను appoint చేసేటప్పుడుకూడా ఏ జిల్లాలో కనీసం ఒక హరిజనుని కూడా వేయలేదు ట్రస్టీలను వంశపారంపర్యంగా ఉంచకూడదని కూడా నేను చెపుతున్నాను తగినటువంటి అజమాయిషీచేసే శక్తి సామర్థ్యాలతో నడిపేటటువంటి వారికెవరికైనా trustee ship ఇవ్వాలని కోరుతున్నాను అస్పృశ్యతా నివారణే ప్రభుత్వము యొక్క విధానం కాబట్టి ట్రస్టీలలోకూడా ఎక్కువగా హరిజనులను వేసేదానికి ప్రయత్నించాలి హరిజనులు ట్రస్టీలుగా ఉన్నట్లుగానాకు తెలిసినంత వరకు ఎక్కడాలేరు అస్పృశ్యత నివారణే ప్రభుత్వము యొక్క విధానము కాబట్టి ట్రస్టీలుగాను పూజార్లుగాను బోర్డులో మెంబర్లుగాను హరిజనులను వెయ్యాలని నేను మనవిచేస్తున్నాను

తిరుపతిదేవస్థానము బోర్డులోఉన్నటువంటి వారి nomination సందర్భములో దీనిలో ఒకహరిజనసభ్యుడుకూడా వుండాలని మేము పోయినసారి Act లో ఒక సవరణకూడాపెట్టాము అది ఎట్లాగో ప్రభుత్వము ఒప్పుకొన్నందుకు సంతోషిస్తున్నాము అయితే ప్రత్యేకంగా schedule caste లో M L A హోదాలో

ఒకరిని తీసుకొన్నారు M L A హోదాగా కాకుండా ఇతరత్రా హరిజనులను దీనిలో వేయాలని నేను మనవిచేస్తున్నాను అంతేకాకుండా అక్కడ జరుగుతున్నటువంటి విద్యావిధానంలోగాని, తిరుపతిలో ఉన్నటువంటి institutions లో గాని అనేక ఉద్యోగాలు create అవుతున్నాయి కాని అనేకచోట్ల హరిజనులకు ఉద్యోగాలు ఇవ్వడంలేదు అనేది దర్యాప్తుచేస్తే స్పష్టంగా కన్పడుతుంది ప్రభుత్వానికి పంపించవలసిందని అనేక దరఖాస్తులు నాకుఅందాయి తిరుపతిదేవస్థానం administration లో ఉన్నటువంటి అన్నిటిలోకూడా హరిజనులకు ప్రాతినిధ్యం చాలా తక్కువగా ఉన్నది దీన్నిగురించి ప్రభుత్వము వెంటనే చర్యతీసుకొని వారికి సరియైనటువంటి representation ఉండడానికి పూనుకోవలెనని మనవిచేస్తూ సెలవుతీసుకొంటున్నాను

SRI VAVILALA GOPALAKRISHNAYYA — అధ్యక్షా అసలు ఆంధ్రదేశంలో ఉన్నటువంటి ఈ దేవాదాయ ధర్మాదాయాలనుగురించి మరల పునర్విమర్శచేసి నూతన శాసనము తీసుకురావలెనని ఇదివరకు ఒక committee సిఫార్సుచేసింది దాని సిఫార్సులు ఏమిచేశారో తెలియదు ఇప్పుడు మనకు సంబంధించినంతవరకు తిరుపతి దేవాలయమునుగురించి మాట్లాడుకున్నాము

THE HON SRI K CHANDRAMOULI — Amendment కు సంబంధించి మాట్లాడండి

SRI VAVILALA GOPALAKRISHNAYYA — ఒక institution సందర్భమువచ్చినప్పుడు ఆసందర్భమునుగురించి మాట్లాడుతూ amendment ను emphasise చేయడం జరుగుతుంది అచ్చము amendment కు కావలసినటువంటి అవసరం amendment వచ్చినప్పుడు తప్పితే general discussion లో అక్కర లేదు అనేది Parliamentary సాంప్రదాయము అందువల్ల దీనివిషయములోకూడ మాట్లాడవచ్చునని అనుకొంటాను అక్కడ పరిపాలన విధానంలో చాలా అవకతవకలు జరుగుతున్నాయని ఎప్పుడూ పత్రికలలో వస్తున్నాయి దాని విషయమై మంత్రిగారు చాలామార్లు అక్కడికివెళ్లి అక్కడ ఏమిజరుగుతున్నదో చూస్తున్నారు కాని వీరు పరిష్కరింపగలిగారో లేదో మాకు తెలియదు మొత్తానికి ఏదోజరుగుతున్నది అనేది గట్టిగా అందరికి తెలుసును అక్కడ ఏవో గల్లంతులు జరుగుతున్నాయని accounts సరిగా లేవని misappropriation ఉన్నదని mal administration ఉన్నదని, వీటినిగురించి సంప్రదించి వీటిని సరిదిద్దడానికి తాము వెళ్లుతున్నారని ఒక statement ఇచ్చినటువంటి నిదర్శనాలు ఉన్నాయి అందువల్ల ఏదో జరుగుతున్నది అనేటటువంటి పరిస్థితులలో, మాకు తెలియజేయకుండా ఉంచలేదు మంత్రిగారు వారికి మేము కృతజ్ఞత చెప్పవలసియున్నది ఈవిధంగా పరిస్థితు

Sri Vavilala Gopalakrishnayya] [14th August 1956

లున్నవి వాటిని పరిష్కరించడానికి ప్రయత్నంచేస్తున్నానని చెప్పుతున్నారు వారి ప్రయత్నానికి నాలుఖినందనలు కాని వారిప్రయత్నంలో వారెందుకు జయప్రదం కాలేకపోతున్నారో మాకు తెలియడంలేదు ఆ చిక్కులు కమీషనర్‌లో ఉన్నవో, Executive Officer లో ఉన్న రో లేకపోతె చేసే తీర్మానాలను అనులుజరపడంలో ఉన్నవో తెలియడంలేదు వారు ఎప్పుడుపడితేఅప్పుడు tall talks కావలసినంత వాగ్దానాలు మాత్రం చేస్తూఉంటారు తిరుపతిదేవస్థానంవారు డబ్బుఇస్తామని చెప్పి నటువంటి institution లేదు కాని ఎక్కడా ఇబ్బందికరండా లేదేమోననికూడ అను మానం ఉన్నది Medical College కి కావలసినంత మేము డబ్బుఇస్తామని తీర్మానం చేశారు University కి గాను మేము డబ్బు ఇస్తామని తీర్మానంచేశారు అతర్వాత Engineering College పెట్టినట్లయితే మేము డబ్బు ఇస్తామని చెప్పారు యూనివర్సిటీ విషయంలో బహుశా ఇచ్చిఉండినా ఎంత ఇస్తామని వాగ్దానం చేశారో అంత ఇవ్వలేదు

THE HON SRI K CHANDRAMOULI —విషయాలు తెలియ కుండా మాట్లాడితే ఏమి ప్రయోజనంలేదు వాగ్దానాలు చేసినదానికంటె ఎక్కువే ఇచ్చారు

SRI VAVILALA GOPALAKRISHNAYYA —దయచేసి వారు ఎంత వాగ్దానం చేశారు ఎంత ఇచ్చారు చెప్పతే దాని విషయం నేను చెప్పుతాను

Mr SPEAKER —How is it relevant here Let us confine ourselves to the Bill

SRI VAVILALA GOPALAKRISHNAYYA —ఈ amendment administration కు సంబంధించింది దాన్నిగురించి ఒక కమిటీ వేస్తున్నాము ఆ కమిటీవారు ఏ కార్యక్రమమును నిర్వహించాలో వాళ్ళకు మనం చెప్పవలసిన అవసరమున్నది అందువల్ల ఈ విషయము మనవిచేస్తున్నాను వారు ఆ విధంగా చేయడం చాలామార్లు జరిగింది ఇప్పుడు Medical College కి డబ్బు ఇస్తామని చెప్పారు వాళ్ళు ఇదివరకు ఏదైనా డబ్బు ఇచ్చిఉంటే సంతోషమే ఇంకా ఎక్కువ ఇవ్వాలని కోరుతున్నాము కాని ఎప్పటికప్పుడు మెరమెచ్చులుగా డబ్బు ఇవ్వ కుండా పోతున్నారు అనేబాధ చాలామందికి ఉన్నది దానిని పరిష్కారము చేయ వలసిన అవసరం ఉన్నది ఈ తిరుపతి దేవస్థానం administration సరిగా లేదని గూడూరులో ఒక మిత్రుడు ఉపవాసంకూడా ప్రారంభించాడు అది బహుశా మంత్రిగారు పత్రికలలో చదివేఉంటారు అందరికి తెలిసిఉంటుంది

SRI K SUBBA RAO —ఉపవాసాలకు విలువలేదు

14th August 1956 ]

SRI VAVILALA GOPALAKRISHNAYYA —ఎందుకంటే దానిని మనము పట్టించుకోవడం లేదు Because we are so thick skinned ఉపవాసాలలో విలువ లేకపోలేదు దానిలో ఉన్న ప్రధానకారణం మీరు చెప్పారు ఆగమని చెప్పారు అందువల్ల చేయలేదు తర్వాత చేస్తున్నారు గనుక మీకు కోపము వచ్చింది కాని అసలు administration లో లోపమున్నదనేది మీరుకూడా ఒప్పుకొంటున్నారు ఆ administration కోసం legislature నుంచి ఇతరచోట్ల నుంచి కమిటీకి members ను వేయాలనిఅన్నారు కాని సాధారణంగా committees వచ్చినప్పుడు election ఉంటుంది కాని ఇక్కడ ఏమి అవుతున్నదంటే members ను మాత్రము ఎన్నుకొంటారు Legislature నుంచి ఇతరులనుంచి ప్రెసిడెంటును మాత్రము గవర్నమెంటు nominate చేస్తున్నది అంతకుముందు ఉన్నటువంటి సాంప్రదాయము ప్రకారం ఎప్పుడు ఎన్నికలే ఉండేవి. ఇప్పుడు ఎందువల్లనో ఈ amendment తీసుకొని వస్తున్నారు ఇది casual amendment గనుక వచ్చినటువంటి technical difficulties, సరిచేయడానికి ఎవరికీ అభ్యంతరం లేదు తప్పకుండా ఒప్పుకొంటాము

THE HON SRI K CHANDRAMOULI —గోపాలకృష్ణయ్యగారు విషయాలు తెలుసుకోకుండా మాట్లాడుతున్నారు తిరుపతి దేవస్థానం కమిటీ members కు ఎప్పుడు election జరుగలేదు మొదటినుంచి ఇప్పటివరకు గవర్నమెంటు nominate చేస్తున్నది

SRI VAVILALA GOPALAKRISHNAYYA — తిరుపతి దేవస్థానం కమిటీ members కు nomination లేనేలేదు Elected bodies నుంచికూడా వస్తున్నారు, దానికి ఒప్పుకుంటున్నారు కాని President ను nominate చేస్తున్నారు

THE HON SRI K CHANDRAMOULI ప్రెసిడెంటు సభ్యులచే ఎన్నుకోబడుతాడు

SRI VAVILALA GOPALAKRISHNAYYA —రెండవది ఆ administration report ఎక్కడా దొరకదు ఇప్పటివరకు ఆ రిపోర్టు రాలేదు మాకు వచ్చింది Hindu Religious Endowments కు సంబంధించి రాష్ట్రం మొత్తానికి రిపోర్టువచ్చింది అదికాకుండా ఈ రిపోర్టు వేరే ఉన్నది మేము కమిటీలో ఉండగా అడిగాము తరువాత పంపిస్తున్నామన్నారు కమిటీ అయిపోయిన తరువాత పంపించవలసిన అవసరం లేకపోయింది కనుక ఆ administration

reports ఏ సంవత్సరానికి ఆ సంవత్సరము సరిగా వచ్చి సభ్యులందరికి అందేటట్లు ఏర్పాటు చేయవలెనని కోరుతున్నాను

SRI A VENKATARAMA RAJU — అధ్యక్షా మంత్రిగారు తీసుకు వచ్చినటువంటి సవరణ అవసరమైనది అందులో ఎవరికి ఏమి అభ్యంతరంలేదు అయితే ఇక్కడ ఒక trustee ఉన్నటువంటి చిన్న దేవస్థానాలు చాలాఉన్నాయి ఒక trustee ఉన్నటువంటి ఈ దేవస్థానాలలో ఆ స్థానం ఖాళీఅయినప్పుడు, ఆ స్థానానికి వచ్చేఅతడు ఆ ఖాళీకాలము మాత్రము ఉండాలి తప్పితే, అతడు మరల మూడు సంవత్సరాలు ఉండవలసిన అవసరమున్నదనేది సరికాదు ఈఒక్క trustee ని తిరిగి appoint చేసినప్పుడు దానికి ఎలాంటి అభ్యంతరం ఉండనక్కర లేదేమో అనుకొంటాను కనుక ఒక్క trustee ఉండేటటువంటి వాటిని మినహాయించి ఈ సవరణ పెట్టితే బాగుంటుందని అనుకొంటున్నాను అయితే ఇక్కడ మంత్రిగారు గమనించవలసినది ఒకటి ఉన్నది రాష్ట్రములో ఏ దేవస్థానములో కూడ ఒక trustee ఉండకూడదని ముగ్గురుకంటె తక్కువలేకుండా trustees ఉండినప్పుడే దేవస్థానాలను సక్రమంగా నడపడానికి వీలుంటుందనేది వారు గమనించవలసి యున్నది ఈ విషయము ఇదివరకు వారి దృష్టికి తీసుకువచ్చినప్పుడు ఎక్కువమంది ఉండడంవల్ల తగాదాలు ఏర్పడి దేవస్థానాల కార్యకలాపాలకు ఆటంకాలు ఏర్పడుతున్నాయని కనుక ఈ trustee ని ఒకరు ఉండేవిగా క్రమంగా మార్చవలెనని అనుకొంటున్నారని చెప్పారు అటువంటి తగాదాలు ఆటంకాలు ఏమైనాఉంటే, వాటిని పరిశీలించి చక్కదిద్దుటకు ప్రయత్నించవలెనుగాని ఒకరే ఉండే పరిస్థితులు ఏర్పడితే ఎవరుకూడా check up చేయిలేనటువంటి పరిస్థితులలో ఆ కార్యకలాపాలు జరిగిపోతాయి కనుక ముగ్గురికి తక్కువకాకుండా ఉండే పద్ధతిలో వాటిని ఏర్పాటు చేయవలసిందని కోరుతూ ముగ్గురుగాని అంతకంటే అధికంగాగాని ఉన్న trusts లో ఒక హరిజనుడుకూడ ఉండడం చాలా అవసరమని మనవిచేస్తున్నాను ఎందుకంటె untouchablity సమస్యను పరిష్కరించడానికి ముఖ్యంగా కూర్మయ్యగారు తీసుకువచ్చినటువంటి సమస్యను పరిష్కరించడానికి, రెండవది దేవాలయాల భూములు సాగుచేస్తున్నటువంటి గ్రామాలలో హరిజన రైతులుకూడ చాలాచోట్ల ఎక్కువగా ఉన్నటువంటి పరిస్థితులు ఉన్నాయి కాబట్టి వారియెడల అన్యాయంగా లేక పక్షపాతంగా ప్రవర్తించకుండా ఉండేందుకుగాను ఈ Trust Boards లో ఒక హరిజనుడుకూడ ఉంటే హరిజన కౌలుదార్లకు రక్షణ ఉంటుందని మనవిచేస్తున్నాను పాటలుపెట్టుకొని, సేద్యం చేసుకోవడంలోగాని కౌలుకుతీసుకొని సేద్యం చేసుకోవడంలోగాని వారికి కొంత

రక్షణ సౌకర్యములు ఉండగలవు కనుక ఈ రెంటినికూడ దృష్టిలో పెట్టుకొని ఈ Endowment Act లో ఒటువంటి సవరణ మరొక సందర్భములోనైనా అవసరమైనప్పుడు తీసుకువచ్చి అమలు జరిపిస్తారని నేను కోరుతున్నాను

THE HON SRI K CHANDRAMOULI అధ్యక్షా ఈ సవరణకు సంబంధించినంతవరకు సభ్యులలో కొంతమంది 'అసలు యీ సవరణను ఎందుకు తీసుకుని రావలసవచ్చింది అని అడిగారు కమిటీ సభ్యులలో ఖాళీలు అయిన స్థానాలకు మరల వేసేవారిని మూడు సంవత్సరాలకు అని నియమించేటట్లయితే ఇందులో uniformity లేకుండా పోవడం తరువాత అందులో అధ్యక్షుని ఎన్నుకోవలసి వచ్చినప్పుడు కొంతమంది సభ్యులచేతనే ఎన్నిక కావడము లేకపోతే ఎన్నుకోవలసిన అధ్యక్షస్థానము ఎప్పుడైనా ఖాళీ అయితే 11 మందిచేత ఎన్నిక జరగకుండా ఏ అయిదు ఆరుమంది చేతనో ఎన్నిక కావడం జరగడమువల్ల యిలాంటి ఎన్నిక సరియైనది కాదనే ఉద్దేశ్యంతో ప్రభుత్వం యీ సవరణతీసుకొని వచ్చింది అంతేకాని ఈ సవరణలో పెద్దగా గమనించవలసిన దేమిలేదు ఇది చాలా చిన్న సవరణ

ఇదిగాక దేవాలయములలో రాజకీయ పార్టీలను దృష్టిలో పెట్టుకొని ఒకే పార్టీకి సంబంధించిన వారినే యిందులో వేస్తున్నారు అని విమర్శించారు కాని ఆవిధముగా ఎక్కడా జరగలేదు ఒక్క కాంగ్రెసుపార్టీ అనికాని కమ్యూనిస్టుపార్టీ అనిగాని వీరిని వేయాలి వీరిని వేయకూడదు అనేది దృష్టిలోపెట్టుకుని చేసింది ఏమీలేదు అందులో సభ్యులు అనుమానించనవసరము లేదు అయితే శంకరయ్యగారికి నాకూ ప్రస్తుతము యిక్కడ వచ్చిన తగాదా ఏమిటంటే నాకు భగవంతుని మీద నమ్మకము, భక్తి లేకపోయినప్పటికినీ, నాకు విగ్రహాలమీద విశ్వాసము లేకపోయినప్పటికినీ వాటిని విరగగొట్టాలనే ఉద్దేశ్యము నాకు ఉన్నప్పటికిని ధనమునకు సంబంధించిన వ్యవహారము కాబట్టి, వాటియొక్క లెక్కలపద్దులు అయినా చూడడానికి నేను ఉంటానని అన్నారు నేనుమాత్రము అలాంటి contention ను ఒప్పుకోను అది ప్రభుత్వోద్దేశ్యము ఎంతమాత్రముకాదు దేవాలయ సంస్థల యొక్క ఉద్దేశ్యముకూడా కాదు దేవాలయములలో విశ్వాసము ఎవరికి ఉంటే, వారిని వేయడము మంచిదే అంతేకాని భగవంతునిలో విశ్వాసములేనివారు డబ్బు కొరకు వచ్చామనిఅంటే అది కేవలము ధనముతోనే సంబంధించిన విషయంకాదు ఇందులో యింకను అనేకవిషయములు ఉన్నవి కాని నేనుమాత్రము ఒక్కవిషయము చెబుతున్నాను కేవలము కమ్యూనిస్టుపార్టీవారిని ఇందులో వేయకూడదు కాంగ్రెసుపార్టీవారినే వేయాలి, అనేటటువంటి దృక్పథముతో ఎప్పుడూకూడ

14th August 1956 ] [ Sri K Chandramouli

నేనుమంత్రిగా వచ్చినతరువాత జరగలేదు ఈవిషయము మాత్రమునేను గట్టిగా చెప్పగలను

ఇకపోతేమరొక విషయముఉన్నది శంకరయ్యగారికి నిజముగా దేవాలయములమీద విశ్వాసముఉంటే నాకేమీ అభ్యంతరములేదు వారికి నిజముగా దేవాలయముల పరిపాలన చక్కగా జరగాలంటే అక్కడఉన్నఅర్చకులు నైవేద్యాలు చక్కగా చూస్తామనిఅంటే వారు చూడవచ్చు అందరికి పెట్టవచ్చు తనుగూడ తినవచ్చు అందులో మా అభ్యంతరము ఏమీలేదు కాని అటువంటివారు లేకపోతే దేవాలయములను బాగుచేయడముకష్టము

SRI A SATYANARAYANA MURTHI —దేవునియందు నమ్మకము లేనివారు manage చేయగలరని నమ్మకము మంత్రిగారికిఉన్నదా ?

THE HON SRI K CHANDRAMOULI —దేవాలయముల మీద నమ్మకము ఉన్నవారు తప్పుచేస్తే వారిమీద చర్యలుతీసుకోవచ్చు అసలు నమ్మకం లేనటువంటివారిని వేయడము అంటే అసలు మనమే తప్పుచేస్తున్నామనే నా ఉద్దేశ్యము అందువల్ల ఈ విషయములో ప్రభుత్వానికి పక్షపాతముగాని ద్వేషము గాని ఎవ్వరిమీదగాని ఏ పార్టీవారిమీదగాని లేదని, అలాంటి ఉద్దేశముతో ఈ వ్యవహారము జరపడములేదని మాత్రము నేను మనవిచేస్తున్నాను

మరొకవిషయము దేవాలయముల పరిపాలనవిషయములో ఎక్కడెక్కడో ఏవేవో లోపాలుఉన్నవని అంటున్నారు ఉన్నవి లేకపోలేదు లేవని మాత్రము నేను చెప్పను కాని ఉన్నలోపాలను దృష్టిలోపెట్టుకుని వాటిని క్రమేణా సవరించుకొనిరావాలి వాటిని సరిదిద్దుకొనిరావటానికి అక్కడకు వెళ్లే భక్తులకు సరియైన దర్శనము యితరసౌకర్యాలు చేయాలని అన్నివిధాలా వారికి వసతులు, సదుపాయములు చేయాలని ప్రభుత్వము ప్రయత్నిస్తున్నది కాని ఒక్కసారిగా యీ లోపాలు పోవాలంటే పరిపాలన నడవదు అందువల్ల ఏవైనా లోపాలుఉంటే, అవి అన్నీ సర్దుకోవచ్చును మన గోపాలకృష్ణయ్యగారు ఒకరు అక్కడ fast చేస్తున్నారని అన్నారు అసలు ఆయన ఎందుకు fast చేస్తున్నారో కారణములు తెలుసుకోటానికి అక్కడికి వెళ్లిఅయినాగాని, information తెప్పించుకునిగాని ఉండలేదు అట్లాకాకుండా యిక్కడ సభలో ఆయన fast చేస్తున్నారని యింకా ఏవేవో సంగతులు చెబుతున్నారు ఆయన fast చేయటానికి ఏ ఏ పరిస్థితులున్నవి ? ఎక్కడనుంచో ఎవరోచెప్పినమాటలనుబట్టి అంటున్నారుకాని ఆయన అక్కడికి పోయి చూచినపాపానపోయినట్లులేదు నిజానికి ఆయన అక్కడ fast చేయటానికి కారణములు న్యాయమైనవేనా వారుకోరేవి న్యాయమైనవేనా అనేది ఆలోచించ

కుండాచెబితే లాభములేదు ఈవిధముగా ప్రతివ్యక్తికూడా చెప్పవచ్చు పత్రికలలో వ్రాయవచ్చుకూడా కాని వారు సూచించిన విషయాలు ఏవైనాఉంటే అవి సవరణచేయుటానికి ప్రయత్నము చేశాము సవరణలుకూడచేసి కొంతవరకు సరిదిద్దాము అవి సరిదిద్దినతరువాతగూడ యింకా fast చేయడముఅంటే యిక అంతకంటే ఏవిధముగా సరిదిద్దాలో తోచడములేదు వీలుఅయినంతవరకు సవరణలుచేసి లోపాలు సరిచేశాము సాధ్యముకానివి చేయలేదు అందువల్ల యీ విషయములో నేను మనవిచేసేది ఏమిటంటే యాక్టను సవరణచేయాలన్నా లేకపోతే దేవాలయముయొక్క పరిపాలన ఇంకా అభివృద్ధిచెందించాలన్నా సభ్యులు ఏవైనా సూచనలుచేస్తే అవి అమలుజరపటానికి అభ్యంతరము ఏమీలేదు అందువల్ల దయచేసి యీబిల్లును ప్యాసుచేయాలని కోరుతున్నాను

తరువాత హరిజనుల విషయములో హరిజనులు యింతవరకూ కమిటీలలో లేనేలేరు అన్ని Area Committees లోనూ ఉన్నారు హరిజనులు అనే distinction ఏమాత్రములేకుండనే పరిపాలనజరగాలి దేవాలయములో ప్రవేశించటానికి అన్నిహక్కులుకూడ ఉండాలి అనేదానికి వీలుగా పనిజరుగుతున్నదనినేను వారికి చెబుతున్నాను

SRI VAVILALA GOPALAKRISHNAYYA —మంత్రిగారు సమాధానము చెబుతూ వారు చెప్పిన అన్నివిషయాలతో నేను ఏకీభవిస్తున్నాను కాని ఒక్కవిషయముమాత్రము యిక్కడ అసెంబ్లీయొక్క సాంప్రదాయానికి భిన్నముగాఉన్నదని నేను వారిదృష్టికి తీసుకునివస్తున్నాను గతములో మనహౌసునుంచి Opposition Party వారిలోనుంచి కూడ కొంతమందినివేశారు దేవునిమీద నమ్మకము ఉన్నదా లేదా అని అంటే ఆవిషయము యాక్టులో ఎక్కడనూలేదు ఈవిషయము ప్రత్యేకంగా యిక్కడ తీసుకుని రావలసినపనిలేదు ఆనాడు బిల్లును ప్యాసుచేసేటప్పుడు ఆ understanding తోనే దాన్ని ప్యాసుచేశాము ఆనాడు conventions ను ఎట్లా గౌరవించాల్సిందికూడ చెప్పారు అవిఎట్లా గౌరవించాల్సిందిన్నీ మనముచూస్తూనేఉన్నాము కాని మనము ఆ angle నుంచి మాత్రము చూడవద్దని తెలియజేస్తున్నాను ఏరాజకీయ పార్టీకూడ మాకు దేవునిమీద నమ్మకముఉన్నదని వ్రాసియిచ్చింది ఎక్కడనూలేదు, (Interruption) ఎవరూలేరు ఏపార్టీ వారుకూడలేరు మాపార్టీలోకూడ లేరనిచెబుతున్నాను

Mr SPEAKER — The question is

That the Madras Hindu Religious and Charitable Endowment (Andhra Amendment) Bill, 1956 be taken into consideration at once

The motion is carried

Clause 2 was put and carried

Clause 1 and preamble were put and carried

THE HON SRI K CHANDRAMOULI — I move Sir, that the Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill 1956 be passed into law

Mr SPEAKER — The question is

'That the Madras Hindu Religious and Charitable Endowments (Andhra Amendment) Bill 1956, bepassed into law

The motion was carried and the Bill was passed into law

## (5) THE MADRAS ESTATES LAND (ANDHRA AMENDMENT) BILL, 1955 (L A BILL No 27 of 1955) AS REPORTED BY THE SELECT COMMITTEE

THE HON SRI K CHANDRAMOULI —Mr Speaker, Sir, I move that the Madras Estates Land (Andhra Amendment) Bill 1955, as reported by the Select Committee, be taken into consideration

Mr Speaker Sir I have the honour to state that the Hon Members of this House are quite aware that the Madras Estates Land (Andhra Amendment) Bill 1955 was introduced in the Assembly on the 5th December 1955 and was referred to a Select Committee of the House consisting of 15 members including myself, the Hon Minister for Planning and Development and the Hon Minister for Electricity and Social Welfare, for consideration The Committee held several sittings at various centres made elaborate enquiries, considered the provisions of the Bill in the light of the oral evidence and written representations received from the inam ryots and inamdars, and made certain important changes in the provisions of the Bill I take this opportunity to present to the House the report of the Select Committee and the Bill as amended with reference to the recommendations of that Committee which were published in the Andhra Gazette, dated the 15th March 1956

Let me recount to you the various stages through which the Bill had passed so far The Bill, as originally introduced in the Assembly on the 5th December 1955, sought to amend the definition of 'estate' in Section 3 (2) (d) of the Madras Estates Land Act, 1908, so as to

include within its scope any hamlet or khandrika, or any portion of a village which is not less than one half of the total extent of the village the grant of which as inam has been made confirmed or recognised by the Government The Bill also sought to give retrospective effect to the amendment aforesaid from the date on which the Rent Reduction Act 1947 (Madras Act XXX of 1947) came into force i e the 7th January 1948 only for the purpose of constituting the inam areas falling under the new definition as estates' so as to entitle the tenants in possession of lands in such inams on that date to permanant occupancy right therein and to be restored to possession thereof if they should have been evicted since It was also provided that the Rent Reduction Act should apply to the new estates only in regard to arrears of rents outstanding on the date of commencement of the Act and not to apply to arrears of rents already collected The Bill also provided for the amendment of the Estates Abolition Act 1948 (Madras Act XXVI of 1948) so as to bring within the purview of that Act the nam areas which would become estates under the proposed legislation, other than those in which both melvaram and kudivaram rights were granted in inam, or the melvaram was granted to a person already owing the kudivaram thereof

I will now recall to you briefly the more important alterations made in the several clauses of the Bill by the Select Committee —

Firstly, as already stated by me, clause 2 of the Bill, as originally introduced in the Assembly, sought to bring within the scope of the definition of 'estate any hamlet or kandrika or any substantial portion of a village which is not less than one half of the total extent of the village, which was granted in inam and which was recently held by the Civil Courts to be not an estate' under the Estates Land Act But the Select Committee proposed to bring within the new definition any porttion of an inam village (including a hamlet thereof which was granted in inam, irrespective of its extent, excluding, however, inams granted for artisan services of the following classes, viz, village carpenter village blacksmith village barber etc

Secondly, while clause 8 of the original Bill made provision for the institution of a suit in a Civil Court of competent jurisdiction by a tenant for restoration to possession, the Select Committee recommended that, instead of giving jurisdiction to a Civil Court in these matters, provision may be made for a tenant to file an application before a Revenue Court (the Court of a Revenue Divisional Officer) for the purpose Clause 8 of the Bill as revised by the Commitee gives effect to this recommendation

Thirdly, provision has also been made in clause 9 of that Bill as amended by the Select Committee for an appeal to an Estates Abolition Tribunal against the orders of the Revenue Court, while the corresponding clause of the original Bill provided for an appeal to a Civil Court having appellate jurisdiction

Fourthly, while clause 11 of the original Bill provided for the application of the provisions of the Rent Reduction Act to all the new estates, clause 11 of the Bill as revised by the Select Committee provides that until the rights of the landholders in these estates are by law extinguished (i e , until the new estates are abolished under Act XXVI of 1948), the Rent Reduction Act should not also be applied to them, and that instead, the ryots should in the meantime be liable to pay to the landholder the existing rent or one fifth of the gross produce in respect of every main crop other than catch crop, whichever is less, in the case of inams other than those held by religious, educational and charitable institutions and in the case of inams held by such institutions, the existing rent or one half of the gross produce as aforesaid, whichever is less

Fifthly, while clause 12 of the original Bill sought to apply the provisions of the Madras Estates Abolition Act, 1948 to all the new estates other than those in which both melvaram and kudivaram rights were granted in inam clause 12 of the revised Bill excludes all the new estates altogether from the purview of the Estates Abolition Act

The Select Committee however, retained the retrospective provision of the Bill as from the 7th Jauuary 1948

When the Bill as revised by the Select Committee on the above lines was published in the Andhra Gazette dated the 15th March 1956, there was much agitation from and on behalf of the inam tenants against some of the changes made by the Select Committee on grounds of discrimination It was also represented that the immediate abolition of the new estates would be more advantageous to both the inamdars and the inam tenants than the mere conversion of the inam areas converted into estates and applying the provisions of the Estates Land Act to them The report of the Select Committee was therefore examined by the Government in detail, and they have decided that the Bill as amended by the Select Committee should be revised with a view to—

(a) restricting the enlargement of the definition of estate' so as to include within its scope only hamlets and khandrikas of inam villages,

(b) applying the provisions of the Rent Reduction Act to all those new estates, and

(c) applying the provisions of the Estates Abolition Act also to all the new estates which are of the pre 1936 variety

As regards portions of inam villages other than well defined khandrikas and hamlets the Government have decided to bring in separate legislation for their conversion to ryotwari since the scope of the present Bill is restricted only for the purpose of bringing within the definition of estate in the Estates Land Act such of the inam areas which are almost akin to estates but which have been held by Civil Courts to be not estates on technical grounds A separate Bill will be introduced in the Assembly for the abolition of the inams which have been excluded from the present Bill and for their conversion into ryotwari tenure

These are briefly the important changes which the Government have decided to make in the provisions of the Bill as revised by the Select Committee In other respects, such as giving jurisdiction to a Revenue Court, etc the Government have decided that the changes made by the Select committee may be allowed to remain With reference to this decision, I gave a notice on the 27th Jnly 1956 that I intend to move certain amendments to the Madras Estates Land (Andhra Amendment) Bill, 1955 as amended by the Select Committee The amendments have been placed on the table of the House for consideration

I now move, Sir, that the Bill be taken into consideration and that the amendments proposed by the Government be carried out

Mr SPEAKER —Motion moved

That the Madras Estates Land (Andhra Amendment) Bill 1955 (L A Bill No 27 of 1955) as reported by the Select Committee be taken into consideration "

SRI VAVILALA GOPALAKRISHNYYA —Mr Speaker Sir, I beg to move the following amendment

" This Bill be recommitted to a Select committee "

The amendment was duly seconded

Mr SPEAKER — The main motion and the amendment are before the House for discussion

SRI B SANKARAIAH —అధ్యక్షా ఇదివరకు 1955 లో ఎసెంబ్లీలో ప్రవేశపెట్టిన బిల్లు సెలక్టుకమిటీ సవరించినది అమెండు చేసినది ఇప్పుడు ప్రభుత్వం తెచ్చిన సవరణలతో సభఎదుట ఉన్నది మొట్టమొదట ఏపరిస్థితులలో ఈ బిల్లు తీసుకుని వచ్చారు సెలక్టు కమిటీ ఏ ఏ మార్పులు చేసినది దానివల్ల కలుగబోయే మార్పులను మనము జాగ్రత్తగా ఆలోచించవలసి ఉంటుంది 1948 లోనే జమీందారీ రద్దు చట్టము ప్రవేశపెట్టినప్పుడు తక్షణమే ఈ ఇనాములకు రద్దుచేసే చట్టము తీసుకొని వస్తామని వాగ్దానము చేసినాగ ప్రభుత్వంవాగ్దానం చేయడమే కాక మనరాష్ట్రములో ఉన్న అన్ని రాజకీయ పార్టీలు ఈ ఇనాముల విధానము త్వరగా రద్దు కావలెనని కోరుతూ వచ్చినవి ఇపుడు ప్రభుత్వ పక్షం అంటే కాంగ్రెసు వీటివిషయమై ఖచ్చితమైనప్రకటనలు చేసినది వీటన్నింటి ఫలితముగానే ఈ బిల్లు వచ్చినది నేడు ఇనాంగ్రామాలలో పరిస్థితులు ఏవిధముగా ఉన్నవో సెలక్టుకమిటీ అన్నిజిల్లాలలో పర్యటనచేసి ఇనాంగ్రామాలలో సాక్ష్యం సేకరించింది మన ఆంధ్రదేశములో సరైన లెక్కలు లేకపోయినా ప్రభుత్వం ఈబిల్లు ఆరులక్షల రైతాంగానికి సంబంధించినదని అంటున్నారు 5 6 వేల గ్రామాలకు వర్తిస్తుందని చెబుతున్నారు ఇంతకు ముందు President s Act ఎ ఉద్దేశ్యముతో తేబడినదో ఆప్రకారము బిల్లు తయారుచెయ్యబడిందని 6 లక్షల రైతాంగమునకు 5 6 వేల గ్రామాలకు వర్తిస్తుందని ఈ బిల్లు objects లో చెప్పబడిందిగాని ఈనాడు ఈ amentment చూస్తే అట్టి 6 లక్షల రైతాంగమునకు వర్తించదు అని తెలుస్తున్నది ఈనాడు ఇనాం గ్రామాల పరిస్థితులు ఏవిధముగా ఉన్నవిన్నీ ఇనాందార్లే ప్రభుత్వం దగ్గరకువచ్చి వారి Association ద్వారా ఇనాముల రద్దుతీసుకుని రాకపోతే గ్రామాలలో సరిఅయిన పరిస్థితులు ఏర్పడి వ్యవసాయము సాగదని, తమ క్షేమముకోసమైన ఈ బిల్లుప్యాసు చెయ్యవలెనని వారు సెలక్టు కమిటీకి అర్జీలు ఇచ్చారు ప్రభుత్వం ఈ బిల్లు తీసుకువస్తారని 1948 నుంచికూడా చెరువుల మరమ్మతు మానివేసినారు ఆదాయము జమకట్టుకొనడంతప్ప మరిఏమీ చెయ్య లేదు మాజిల్లాలో 100 కి 95 చెరువులు అధ్వాన్నముగా ఉన్నవి నాలుగు సంవత్సరాల నుండి పంటలు లేవు ఈ విధముగా ఈ సమస్య పరిష్కారం అగుతుందని రైతాంగము ఆశించారు ఇనాందార్లు కూడా ఈ సమస్య పరిష్కారము అయితే తమకువచ్చే నష్టపరిహారము తేలుతుందని అనుకుంటున్నారు 1948 సంవత్సరంనుంచి శిస్తులు చెల్లించని గ్రామాలు ఉన్నాయి కొన్ని గ్రామాలకు సంబంధించిన కేసులు కోర్టులలో ఉన్నవి ఇంకా ఈ విధముగా వాయిదా వెయ్యడము న్యాయము కాదని రైతాంగము ఘోషపెట్టారు

ఒక్కొక్క గ్రామానికి పోయిచూస్తే ఎన్నో గ్రామాలలోని రైతాంగము అక్కడినుంచి దిక్కులేక వెళ్ళిపోవలసి వచ్చిందని యీ select committee ముందు అనేకమంది రైతులు యీ విషయమై తెలియజేశారు ఎన్నోగ్రామాలలో అక్కడ వున్న పొలాలను వదలిపెట్టుకొని ఇతరచోట్లకు వెళ్లిపోయిన ఘటనలు తెలియ జేశారు రైతాంగానికి అన్యాయము జరుగుతుందనిచెప్పి ప్రభుత్వము యీబిల్లు ప్రవేశపెట్టేదానికి ముందే 1951 డిసెంబరువరకు కూడా రైతుల రక్షణకు గాను అనిచెప్పి యిచ్చినటువంటి Act ఇపుడు మన అందరిముందువుంది ఇది కంద్రికలకు మజరాలకు సంబంధించినటువంటి విషయముకాదు వేలఎకరాలు వుండేటటువంటి పెద్దపెద్ద ఇనాములకు సంబంధించిన పెద్దపెద్ద గ్రామాలకు సంబం ధించినటువంటి whole ఇనాములు Technical కారణాలవల్ల కోర్టులలో కేసులు పడేస 1936లో వచ్చినటువంటి amendment వల్లకాని తర్వాత 1944 లో తెచ్చి నటువంటి amendment కూడా ఇనామ్‌దారులు తీసుకొచ్చిన వాదనవల్ల కోర్టులో యీ cases అన్నీ pending లో వుండడమువల్ల యీసమస్య పరిష్కారం చేయ డానికి వీలుకాలేదు కాబట్టి రైతులకు తాత్కాలికంగానైనా రక్షణ యివ్వాలని చెప్పి యీ Act pass చేశారు 1957 డిసెంబరువరకు ఒకపెద్ద ఇనాం గ్రామము వుందంటే దానిలో substantial portion అనేది ఆంధ్రప్రభుత్వము తీసుకొచ్చి నటువంటి విషయముకాదు ఈ Act రీత్యా స్పష్టంగా ఒక గ్రామములో అధిక భాగము యిచ్చినట్లయితే అటువంటిది ఇనామ్ grant గా పరిగణించాలి అటు వంటి గ్రామములో రైతులను ఒక్కరినికూడా తొలగించకూడదు అటువంటప్పుడు యీ ఇనామ్‌గ్రామాల విషయంలో ఇదివరకున్న రైతులను ఎవరినికూడా తొల గించవద్దనిచెప్పి 1957 వరకు కుడా రక్షణకల్పిస్తూ preventive Act చేసినారు తర్వాత ఈ ప్రభుత్వం 1955 లో Assembly లో ప్రవేశపెట్టి Select కమిటీ వేస నపుడు వాండ్లుకూడా అదే reasons యీ బిల్లులో ప్రకటిస్తున్నామని చెప్పారు

ప్రభుత్వం కూడా objects and reasons లో అదేకారణాలను యిచ్చింది కోర్టులో whole inam గ్రామాలను ఇనాములక్రింద treat చేయకుండా దానిలో కొంతభాగము ఎపుడో minor inams క్రింద యిచ్చామని చెప్పి ఇతర technical కారణాలవల్లనో కోర్టులో pending గా వున్నాయి అదంతా కూడా ఇనామ్ సమస్య రాష్ట్రమంతటాకూడా ఇనామ్ సమస్య పెద్ద సమస్య ఐపోయి దేశంలో అటు ఇనామ్‌దారులకు ఇటు రైతులకు ఎవరికి లాభములేని పరిస్థితులు ఏర్పడినాయి కాబట్టి courts యిచ్చిన తీర్పులను అన్నికూడా పవరించి 1936 లో, చట్టంలో ఏ ఉద్దేశంతోనైతే amendment వచ్చిందో ఆ ఉద్దేశాన్ని

Sri B Sankariah ] [ 14th August 1956

నెరవేర్చడానికిమాత్రమే యీ ప్రభుత్వంకూడా objects and reasons లో ప్రకటించారు కోర్టును దృష్టిలో పెట్టుకొని substantial అనేటటువంటి విషయము తీసుకొని వచ్చారు ఇపుడు ఉదాహరణకు చెప్పాలంటే చల్లాయపాళెమని చెప్ప మా జిల్లాలో ఒక శ్రోత్రియం గ్రామముంది శ్రోత్రియందారు రామారావు అనే ఆయన ఒక పెద్దభూస్వామి పెద్దలక్షాధికారి ఆ గ్రామంలో ఎకరానికి ప్రక్కన వుండేటటువంటి గవర్నమెంటు గ్రామములో ఏవిధంగా శిస్తు చెల్లిస్తూవుంటారో అదేవిధమైన కారణంతోనే శిస్తు చెల్లిస్తున్నారు అక్కడ వుండేటటువంటి రైతులు హరిజనులు కరణాలు వారికొక్కొక్కరికి ఎకరము 2 ఎకరాలు 4 ఎకరాలున్న రైతు చాల పెద్ద రైతన్నమాట హరిజనులకు ఎకరా అర్ధఎకరా మాత్రమే వుంది అక్కడవాండ్లు వాండ్ల తాతల తరాలనుంచికూడా యీ భూములను మార్చుకుంటూ వున్నారు శ్రోత్రియందారుకుమాత్రం యీ 10-11 రూపాయలు శిస్తు చెల్లిస్తున్నారు ఈ భూముల అన్నిటినుంచి వాండ్లను తొలగించివేయాలని చెప్ప కోర్టులో తేబడింది 1944 లో బ్రిటిష్ ప్రభుత్వము వున్నపుడు సవరణ తీసుకొచ్చింది 1936 లో వుండే సవరణకూడా minor inams service inams కు కాని communal purpose కు కాని కొంత భూమిని వగలినప్పటికీకూడా కొంత గ్రాంటు ఇదివరకే ఇచ్చినాకూడా వర్తించదని చెప్పినారు అది కోర్టులో వచ్చినపుడు ఇపుడు ఇచ్చారు ఎవరు ముందు యిచ్చివుంటేనే అని చెప్ప ఇక్కడవుంది కాబట్టి ముందు నన్నొడ్డి తర్వాత తన్నొడ్డిన అని అపుడు భారతములో ఎట్లయితే ధర్మసందేహం వచ్చిందోఅలా ఇపుడు చిన్న చిన్న minor inams చిన్న చిన్న service inams వున్నప్పటికికూడా అదేమో ఇనామ్ దారులకు పట్టాయిచ్చినప్పటికికూడా ఆ ఇనామ్ ఎవరికైతే యిచ్చారో service చేయడానికి మంగలి చాకలి ఇతర అనేక వృత్తులవాండ్లకు యిచ్చారు అట్టి వాండ్లకు పట్టాలు యిచ్చినపుడుకూడా వాండ్లు అమ్ముకుంటూవున్నారు అటువంటి వాండ్లకు ఇదివర్తించాలని 1944 లో సవరణ వచ్చింది కాని అది ముందు యిచ్చివుండాలనిచెప్ప దానిలోవచ్చిన పొరపాటువల్ల ఇదిముందుయిచ్చినట్లు రుజువు చేయాలని గ్రామ యినామ్‌గా యిచ్చిన తర్వాత ఇదియిచ్చారో ఏమోనని అందువల్ల ఇది చట్టముక్రింద రావడానికి వర్తించదని అన్నారు అందువల్ల యిపుడు చల్లాయిపాళెం విషయము ఏమౌతుంది ? తరతరాలనుంచి వాండ్లు అమ్ముకుంటున్నారు కొనుక్కొంటున్నారు 10 రూపాయలు శిస్తుకట్టుతూవుంటున్నారు ఎకరం 3 వేలు 4 వేలు చేసేటటువంటి భూమి ఎకరా ఎకరన్నర వుండేటటువంటివారు దానిమీదనే జీవనాధారము ఈయన ఏమో పెద్దభూస్వామి లక్షాధికారి ఇపుడు

యీ Technical కారణం అడ్డుపెట్టుకొని యీ విధంగా హైకోర్టుదాకా పోయివచ్చి మరల ఇపుడు civil court లో స్వాధీనానికి వేసినారు ఈ Technical కారణాలచేత భూములనుంచి వారిని తొలగించి భూములను అమ్ముకోవాలని చెప్పి భూస్వాములు కోర్టులకు పోవడంబట్టి అవన్నీ pending లోనికి తీసుకొచ్చారు ఈ కేసులన్నికూడా కోర్టులలో వున్నాయి ఇటువంటప్పుడు యీ ప్రభుత్వం 1954 లో ordinance తీసుకొచ్చినపుడు కాని Preventive Act వచ్చినపుడుగాని ప్రభుత్వం ప్రకటించిన objects and reasons లో కాని యీ substantial portion అనేటటువంటి విషయం అసలు ప్రధానమైనటువంటిది ఈ Act లో అంతాకూడా 10 వేల ఎకరాలువున్న గ్రామంలో major grants 5 ఎకరాలపైనకూడా వుండవు ఏ ఎకరమో ఏ నాయిగు ఎకరాలో యీ service ఇనాములకిచ్చి మిగిలినదంతాకూడా అక్కడవుండే ఇనాందారుకు శిస్తులు collect చేసుకునేదానికిఇచ్చిన సందర్భమిది రైతులంతా ముందేవుండినారు వాండ్లకిదివరకే ఆభూమిమీద హక్కువుంది అటువంటప్పుడు ఆహక్కుకాదనిచెప్పి యీవిధమైనటువంటి cases ను Court కు తీసుకెళ్ళుతారు కాబట్టి యీ substantial portion గనుక వదలిపెట్టి బిల్లుతీసుకొచ్చినట్లయితే చాల గ్రామాలకు ఉపయోగకరముగా వుంటుంది

సెలక్టు కమిటీ జిల్లాలో పర్యటన చేసినపుడు వారు చెప్పినటువంటి మాటలు వింటే కండ్లార నీళ్లు పడకుండ ఉండేటటువంటిది లేన్నమాట ఇన్ని సంవత్సరాల నుంచి వాండ్లు కరువుతో బాధపడుతూఉన్నారు పశువులు అమ్ముకొని చెంబు, తపేళాలు అమ్ముకొని కోర్టులకు తిరుగవలసి వస్తుంది ఈ సమస్య పరిష్కారం అవుతుందనే ఉద్దేశంతోనే select కమిటీ వేశారు అన్నిపార్టీలవారు select కమిటీలో ఉన్నారు Select కమిటీ రిపోర్టు వచ్చింది దానిప్రకారం బిల్లు amend చేసి మనముందు తీసుకొచ్చారు మొదటి బిల్లు 12 పేజీలు ఉన్నది Select కమిటీ రిపోర్టు 9 పేజీలు ఉన్నది ఇపుడు మనం రివిన్యూ మంత్రిగారు తెచ్చిన సవరణ గాని అంగీకరిస్తే 2 పేజీలలోనే బిల్లు అయిపోతుంది ఈ తగాదాలు ఉండిన గ్రామములలో అన్నీకూడ బీడుపడిపోయినా మనకేమి అవసరంలేదు ఇదివరకు 1948 నుంచి కాంగ్రెసు పార్టీతీర్మానం చేయనీ Assembly Legislature Congress Party తీర్మానం చేయనీ అన్ని రాజకీయ పార్టీలు చేయనీ శాసనసభ్యుల ముందు మేము ఒక బిల్లు ప్రవేశపెట్టనీ objects and reasons లో మేము వ్రాసిపెట్టనీ, select కమిటిలోకూడ ఆ విధంగా చేస్తామని వాగ్దానం చేయనీ మేము మాత్రం ఇపుడు ఒక చిన్న సవరణద్వారా ఏమికూడ ఛేయదలచుకోలేదు అని

చెప్పడం తప్పితే ఈ substantial portion తీసివేసిన తరువాత ఇంకా ఏ గ్రామాలకు వర్తింపచేయాలని ఈ బిల్లు తీసుకొని వచ్చారు ?

Mr DEPUTY SPEAKER — వేరే Act క్రింద ప్రత్యేకంగా తెస్తారు

SRI B SANKARIAH — ప్రత్యేకంగా తేవడం అంటే ఈ లోపల 1957 వరకు ప్రెసిడెంటు Act వల్ల రైతాంగానికి కాస్త రక్షణ కలుగుతుంది రైతాంగానికి ఈ Act వచ్చినపుడు ఈ 15 వ సెక్షనులో ఏమి చెప్తున్నారు ? ఈ Act pass అయితే ఆ Act repeal అయిపోతుంది అందువల్ల ఈ ప్రభుత్వం తీసుకొచ్చేలోపల (ప్రభుత్వంసంగతి మనకు తెలుసు చెప్పింది తీసుకురాలేదేమని అడిగితే మేము ఏమి సత్య హరిశ్చంద్రులమా అంటారు సత్యహరిశ్చంద్రుల విషయం కాదు మేము అడవులకు పొమ్మనడంలేదు Objects and reasons ఇంత చెప్పకూడా కనీసమైన బాధ్యత ప్రభుత్వానికి ఉండవలెనా లేదా ? చేస్తామన్న విషయం చేయాల్సిన అవసరం ఈ ప్రజాస్వామికం అని చెప్పే రోజులలో ఈ protection తీసివేస్తే మళ్లీ బిల్లు తీసుకొని వస్తారన్నదానికి

THE HON SRI K CHANDRAMOULI — అసలు అంతా confusion లో మాట్లాడుతూ ఉన్నారు ప్రభుత్వానికి కనీసమైన బాధ్యత అనేది ఏమి లేదన్నారు పరిపూర్ణమైన బాధ్యత ఉంది మీరు చెప్పినదానికన్నా ప్రభుత్వం ఎక్కువ ముందుకు వెళ్లి అన్ని ఇనాములు రద్దుచేయాలనే వ్యవహారం పెట్టారు కాబట్టి దానిని హర్షించటానికి బదులు బాధ్యత లేదంటే బాధ్యత లేకుండా మాట్లాడితే ఏమిటి ప్రయోజనం ?

SRI B SANKARIAH —అంటే అన్ని ఇనాములకు వర్తింపచేయుటకుగాను Revenue మంత్రిగారు ఏ సవరణలను తీసుకొని వచ్చారు ? అందువల్ల ఇపుడు మనముందు ఉండేది select కమిటీ amend చేసిన బిల్లు రెవిన్యూ మంత్రిగారు తీసుకొనివచ్చిన సవరణల మీద మాట్లాడగలమేగాని రెవిన్యూ మంత్రిగారి స్టేటుమెంటులో ఏమిచెప్పారో ఇకముందు ఏమి చెప్పబోతున్నారో ఏమి ప్రకటన చేయబోతున్నారో అన్ని విషయాలను గురించి మనం మాట్లాడుతామా ? లేకుంటే ఇక్కడఉండే సవరణలను గురించి మనం మాట్లాడుతామా ? సవరణలను గురించి మాట్లాడేటట్లయితే యీ substantial portion అనేది ఈ సవరణలలో తీసివేయాలనిచెప్పాం ఎక్కడెక్కడైతే 1948-54 దాకా దేశమంతా గోలచేసి అన్నిపార్టీలు అంగీకరించి ఈప్రభుత్వాన్ని కాంగ్రెసు కార్యవర్గం ప్రత్యేకంగా ఈబిల్లును ఫలానా అప్పుడుచేసి తీరాలి అని

ఒక Act చేసి 1955 లో అసెంబ్లీలో ప్రవేశపెట్టి substantial portion అనేది పెట్టితే ఈరోజులలోఉండే తగాదాలు పరిష్కారం అవుతాయి చాలా ఇనాం గ్రామాలలోఉండే ఇబ్బందులు కొంతవరకు తొలగడానికి అవకాశం ఉంటుంది అని పెట్టితే దానిని తీసివెయుమని Revenue మంత్రిగారు amendment పెట్టి నేను చాలా గ్రామాలకు దీనిని వర్తింపచేయబోతున్నాను ఈ ఇనాం రైతాంగానికి అంతకుకూడ నేను మేలుచేయబోతున్నాను అందుకోసం ఈ substantial portion తీసివేయమన్నాను అని చెప్పితే ఎవరు నమ్ముతారు? కాంగ్రెసుపార్టీతరఫుననే ఒక కమిటీ వేయమనండి ఈ substantial portion అనేది తీసివేసిన తర్వాత ఏగ్రామాలకు వర్తిస్తుంది ఏగ్రామాలు దీనివల్ల benefit పొందబోతాయి? అందువల్ల యీ బిల్లును నెలలు సంవత్సరాలు వాయిదా వేసిన తర్వాత ఇపుడేమి 15 రోజులలో ఏమి మునిగిపొయ్యేది లేదు ఈ 10 15 రోజులలోనే కాంగ్రెసుపార్టీతరుపుననే ఒక కమిటీవేసి విచారించమనండి ఈ ఆరువేల ఇనాం గ్రామాలకు పొమ్మనిచెప్పండి Substantial portion అనేది తీసివేసిన తర్వాత ఏఏగ్రామాలకు ఈబిల్లువర్తిస్తుందో ఈవేళ చెప్పమనండి నేను చెల్లాయిపాళెం చెప్పాను పోతిరెడ్డిపాళెంఉంది దానికి వర్తిస్తుందా? అక్కడకూడా minor అని వుంది కాబట్టిదానికి వర్తించదన్నారు పడుగుపాడుఉంది దానికి వర్తిస్తుందా? మాజిల్లాలో అన్ని రెండుమూడు వేల ఎకరాలుఉండే ఇనాంగ్రామాలు ఒక్కొక్క ఎకరా 2 3 వేలు చేస్తుంది ఇనాందార్లు అంతా లక్షాధికార్లు కొలంబొట్ల కండ్రిక అనంతంబొట్ల కండ్రిక ఇవి రెండు పెద్ద కండ్రికలు వాండ్లను తొలగించివేశారు భూములనుకూడా స్వాధీనం చేసుకొన్నారు ఇనాందార్లున్నారు హరిజనులు ఇతర రైతులు ఉన్నారు 2 3 ఎకరాలకంటే జాస్తి ఉన్నవారు లేరు ఈ technical కారణంవల్ల కోర్టులలో అవి అన్నీకూడ estate లు కాదని చెప్పారు కాంగ్రెసు తరఫున ఒక enquiry కమిటీ వేయమని చెప్పండి లేక దీనిని మళ్లీ select కమిటీ వేసి చెప్పమనండి Substantial portion అనేది తీసివేసిన తర్వాత ఏ గ్రామానికి వర్తిస్తుందో ఈ బిల్లు తెచ్చేటప్పుడు అన్ని పార్టీలు ఆశించినట్లు Substantial portion పెట్టితే ఇనాం గ్రామాలకు వర్తించినా ఇంకా కొన్ని గ్రామాలు నిలిచిపోతాయి కాబట్టి select కమిటీలో అన్ని పార్టీలు ప్యాసుచేసింది ఏమిటి? ఇనాం గ్రాంటులకు కూడ వర్తించవలెననే విధంగా select కమిటీలో pass చేస్తే ఇపుడు ప్రభుత్వం substantial portion అని చెప్పి రైతాంగానికి రక్షణ ఇచ్చి ఉంది ఆ రైతులు భూమినుండి తొలగకూడదని చెప్పి ప్రభుత్వం చట్టంద్వారా రక్షణకలిగిఉండే వాటికి substantial portion తీసివేసిన తర్వాత రక్షణ ఉంటుందా? 1957

December వరకు ఇచ్చిన రక్షణను ఈచట్టంద్వారా తొలగించడానికి చేస్తున్నారా? రైతాంగాన్ని భూములనుంచి తొలగించమని చట్టం తీసుకొని వచ్చారా ? లేక ఇదివరకు రానటువంటి రక్షణలో లనటువంటి రైతులను వెళ్లగొట్టుటకు అవకాశం ఉంటే ఇపుడు లేకుండాచేయడానికి ఈ బిల్లు తీసుకొనివస్తున్నారు రెండో ముఖ్యమైన విషయం (ఇంకొక అరగంట ఇవ్వండి దీనిమీద ఎన్నిరోజులైనా మాట్లాడవచ్చును Pass కాకపోతే మునిగిపొయ్యేది ఏమిలేదు) రైతులను వెళ్లగొట్టడానికి బిల్లు అవసరంలేదు Inam గ్రాంట్లుగా ఉండే కంద్రికలు మజరాలుకు ఇది వర్తించాలని అన్ని పార్టీలవారు కోరారు President Act లో ఇచ్చిన ఉద్దేశ్యంగాని తర్వాత ప్రభుత్వం తీసుకొని వచ్చినపుడుగాని ఈఇనాం గ్రాంటుల విషయమే అని అందరు అనుకొనేది ఇనాం గ్రాంట్లు అన్నప్పుడు ఇపుడు ఒక కొత్త అర్థం చంద్రమౌళిగారు ప్రవేశపెట్టిన దానిలో ఇనాం గ్రామంలో ఉండే ఇనాం కంద్రికలు మజరాలుఅంటూ గవర్నమెంటు గ్రామాలకు ఎవరైనా వర్తింపచేయమన్నారా? Estates Land Act వచ్చినప్పుడే 1908 లో గాని 1936 లో గాని ఏమి చెప్పారు ? ఒక ఇనాం ఇచ్చిన తర్వాత దాంట్లో కొంత మళ్లీ గవర్నమెంటు resume చేస్తే అదేమో ఇనాం కాకుండాపోతుంది మిగిలిందేమో ఇనాముగ ఉంటుంది అందువల్ల ఒక గ్రామంలోనే main గ్రామము గవర్నమెంటు తీసుకో వచ్చును మజరా ఏమంటే అది ఇనాం గ్రాంటు క్రిందనే ఉంది అందువల్ల ఈ గవర్నమెంటు గ్రామాన్ని ఎవరైనా రద్దుచేయమంటున్నారా ? అక్కడ ఉండే tenants విషయం ఎవరైనా మాట్లాడుతున్నారా ? దానికి వేరే బిల్లు ఉంది ఏదైతే ఇనాము గ్రాంటుగ ఉండి కంద్రికలు మజరాలు ఉన్నవో అటువంటి వాటికి వర్తింపచేస్తామని చెప్పారు Protection ఇచ్చారు ఈరోజు ఏమంటున్నారు ? అప్పిచ్చేగవర్నమెంటు గ్రామాల క్రిందఉండే ఇనాంకంద్రికలకు మజరాలకు అది మాఉద్దేశంలోనేలేదు, మేము ఎక్కడ చెప్పలేదన్నారు గవర్నమెంటు గ్రామాల క్రిందఉండే Estates Land Act చదివిన ఎవడికైనాసరే, గవర్నమెంటు గ్రామంలో ఉండే tenants కు గాథు గవర్నమెంటు గ్రామాలు ఒక ఇనాం ఇచ్చిన తర్వాత అందులో కొంతభాగం resume చేస్తే అది గవర్నమెంటు క్రింద అవుతుంది మిగిలింది ఇనాంక్రింద అవుతుంది ఎందువల్ల ? కంద్రిలకు మజరాలకు ఎందుకు వర్తింపచేయమంటున్నారు ? కంద్రికలుగాని మజరాలుగాని, ఇనాములుగాని, జాగీరుదారులుగాని ఇది అంతాకూడ అంతకుముందే ఉన్న రైతులు ఆ విధంగా సాగు చేస్తున్నారు రైతులు శిస్తులు చెల్లిస్తూ ఉండినారు English ప్రభుత్వంగాని మహమ్మదీయ ప్రభుత్వంగాని జమీందారులు,

రాజులు ఎవరు ఇచ్చినాగాని ఆశిస్తు వసూలు చేసుకొనే అధికారం ఇచ్చారేగాని భూములనుండి రైతులను వెళ్ళగొట్టమని అధికారం ఇచ్చారా? భూములనుంచి రైతులను వెళ్లగొట్టడానికి ఎక్కడైన న్యాయయంఉందా? మనదేశంలో ఎప్పుడైనా జరుగుతూ ఉండిందా? దాని విషయంలో మద్రాసు అసెంబ్లీలో చర్చకు వస్తే న రాజపాగోలచారి గారు ఈ విధంగా చెప్పారు భూములనుంచి వెళ్లగొట్టడానికి జమీందార్లకుగాని ఇనాందార్లకుగాని ఎవరికి కూడా ఆ హక్కు లేదు

అందువల్ల ఆయనే దీనికిముందు భాష్యంచెప్పాలి ఈవేళ ఎవరివల్ల నిజంగా ఈబిల్లు ఈవిధంగా వచ్చిందని చెప్పాల్సివస్తే ఆయనే ఈవిధంగా చేశారాఅని కనబడుతుందన్నమాట అదంతా వచ్చినప్పుడుకూడా అబ్బే Government గ్రామాదులు ఉండేవాంట్లో మేము అనుకోలేదు అని అంటున్నారు ఎవరు అనుకోమన్నారు? Government గ్రామాలకు ఎవరు పెట్టమన్నారు? ఒకఇనాం ఇచ్చిన తర్వాత రెస్యూంచేస్తే గవర్నమెంటుకు లాభంఉండే ఇనాం గ్రాంటులకు చేస్తున్నారు అంతకుముందు అక్కడ రైతులున్నారు మా జిల్లాలో ఇప్పుడు భోగోలు గ్రామ మున్నది భోగోలు గ్రామానికి అక్కరాజువారి కండ్రిగ ఇనాం ఉన్నది భోగోలు గ్రామానికి ఎప్పుడు గవర్నమెంటుఇచ్చి Resume చేశారో ఏమో ఇప్పుడు దానిప్రక్కన ఇనాం ఉన్నది ఆ ఇనాంలో రైతులను ఈవేళ కళా వెంకట్రావుగారు వాళ్లందరినీ వెళ్లగొట్టమని బిల్లు pass చేసినా అక్కడ ఇనాందారులు వెళ్లగొట్టడంలేదు రైతులు వెళ్లటములేదు ఈ వాళ మీరు గవర్నమెంటు గ్రామాలలోఉండే ఇనాంరైతులకు మేమేమీ రక్షణఇవ్వం వెళ్లగొట్టినా మేము ఏమీ చెయ్యం ఇంకా కావాలంటే ఇనాందారులకు సహాయం చేస్తామంటారు అనేకమంది ఇనాందారులు ఆవిధంగా అంతకుముందే ఉండిన రైతులకు పట్టాలిచ్చేశారు

THE HON SRI K VENKATA RAO — అధ్యక్షా ఇప్పుడు మనము బిల్లును ఒక stage లో introduce చేశాము 1949లో చేసిన amendment సరిపోదు hamlets cover కావడంలేదు, కండ్రిగలు cover కావడంలేదు అందువల్ల దీనిని set right చేద్దామని బిల్లును introduce చేశారు చేసినతర్వాత మనం Select Committee లోకి వెళ్లాం అప్పుడు వారూ మెంబరే వారికితెలుసు 'Any village, any hamlet or Kandriga, or if half the portion of the village was granted as inam that will also become an estate" అని మొట్టమొదట ఏర్పాటుచేశాము బిల్లులోని మొదటి రెండుక్లాజుల గురించి ఎవరికీ భేదాభిప్రాయంలేదు అయితే మూడవ క్లాజులోనే ఉన్నది చిక్కుఅంతా

Sri K Venkata Rao] [14th August 1956

ఆ గ్రామంలో ఉన్న మొత్తంభూమిలో ఈనాము ఇవ్వబడినభూమి సగం ఉండాల మూడవవంతు ఉండాలా అన్న విషయంమీదనే భేదాభిప్రాయం వచ్చింది దానిపై చర్చ జరిగింది చర్చయొక్క పర్యవసానంగా మూడవవంతు భూమి ఇనాంక్రింద గనక గ్రాంటుచేసఉంటే ఆ village ని కూడా estate క్రింద పరిగణింప వలసిందనే నిర్ణయాన్ని Select Committee వారు చేశారు తర్వాత ఇదిఅంతా ఎందుకు ? 100కి 20 వంతున గనుక శిస్తు ఇచ్చేసినట్లయితే వీళ్లకు occupancy right వస్తుంది దీనికి abolition అక్కరలేదుఅని దానిని amend చేశారు Situation ఇలా ఉండగా ఇప్పుడు మినిష్టరుగారు చెప్పినట్లు మళ్లీ position న్ను అంతా reconsider చేయవలసవచ్చింది మొత్తం Select Committee చేసిన సలహాలవల్ల కానీఇప్పుడేమో మనం పెట్టినటువంటి original Bill వల్లగానీ మొత్తంproblem ఇంకా pendingగా ఉంటుందాఅనేఅభిప్రాయంగవర్నమెంటుకుకలిగి మళ్లీ మొత్తంquestionన్నుఅంతా ఆలోచించవలసివచ్చింది ఇప్పుడు మొత్తంబిల్లును రెండుభాగాలు క్రిందచేశారు ఒక భాగం ఇప్పుడుపెట్టినబిల్లు రెండవభాగంబిలు రానున్నది దానివిఆయన ఇంగ్లీషులో చెప్పారు అది అందరికి తెలుస్తుందో లేదో Hamlets, Kandrigas కూడా ఇనాం villages అనే భావాన్ని ప్రకటించినటువంటి ఒకటి, రెండు క్లాజులమీద మనకు ఎప్పుడు భేదాభిప్రాయంలేదు ఆభాగమే ఇప్పుడు తమముందు ఉన్నటువంటి బిల్లు రెండవ భాగం 'Portions, All అనేవిషయాన్ని గురించి ఇప్పుడు క్రొత్తగా గవర్నమెంటువారి ఆలోచన అసలు అన్నిటినీకూడా abolish చేదామని మళ్లీ ఎన్నుక్రింద ఇంతభాగం ఇవ్వడం వాటికి occupancy rights రావటం, మళ్లీ అవి ఇనాం villages అవునా అని కోర్టులకువెళ్లడం ఈ గొడవ ఏమీలేకుండా all other remaining villages ⅛, ½ or less ఇనాం గ్రాంటుగా ఎప్పుడైనా ఇచ్చిఉంటే ఆ villages నన్నిటినీకూడా abolish చేదామని ప్రభుత్వం ఉద్దేశించారు అయితే వాటికి compensation ఇవ్వాలా లేదా ? అనే విషయంఉన్నది కాంపెన్సేషన్ ఇచ్చేబదులు అయిదోవంతు శిస్తుగనుక ఇరవై ఏండ్లు ఇచ్చిఉన్నట్లయితే అది compensation అవుతుందని లేదా భూమిలో మూడవవంతు భాగం ఇనాందారు నకు ఇచ్చేసినట్లయితే అది compensation అవుతుందనీ ఒక సూచనవచ్చింది మూటిలో రెండువంతులేమో రైతుపుచ్చుకొని ఇద్దరికీ రైతువారి పట్టాల నివ్వ వచ్చును ఈ option న్ను సెనెంటుమీద పెట్టారు మొట్టమొదట తర్వాత గవర్న మెంటువారు ఇంకొకనిర్ణయానికివచ్చారు రైతుశిస్తు 20 ఏండ్లలో ఇస్తానంటాడు ఈలోపల ఈనాందారు సంతతివారు ఆస్తిని నాలుగు భాగ లుచేసుకోవచ్చు లేదా ఆస్తి కొడుక్కు వెళ్లవచ్చు వారసులకు వెళ్లవచ్చు అందువల్ల మళ్లీ ఇదంతా

litigation కు దోవతీస్తుందనే ఉద్దేశ్యంతోటి ఆ first suggestion న్నుకూడా drop చేసేం All Inam Villages to be abolished compensation to be in the form of lands—$\frac{1}{3}$ of the land to be given as compensation to the Inamdar అనే నిర్ణయానికివచ్చారు 3 వ వంతు భూమి ఉన్న నష్టపరిహారంక్రింద పరిగణింపబడి ఇద్దరికీకూడా రైత్వారీ పట్టాలక్రింద ఇచ్చేయాలనే నిర్ణయం చేయబడింది బిల్లు తయారుఅయింది శాసనప్రకారందానికి President గారి prior consent ను పుచ్చుకొని introduce చేయాల్సిఉంది అదికూడా ఈ session లోనే introduce చేయడానికోసం గవర్నమెంటువారు ప్రయత్నంచేస్తున్నారు అందువలన ఇదిచాలా పరిమితమైనభావంతో పెట్టినబిల్లు ఇప్పుడు మీరు raise చేసే issues అన్నీకూడా రెండవదానికి సంబంధించినవి మొదటిదానికి సంబంధించినవికావు దానిలో ఉన్నటువంటి మూడవ క్లాజుకు సంబంధించినవి మూడవక్లాజును గురించి legislation ఈపైన రానున్నది అదొక్కటేనేను ప్రస్తుతం తనుకు మనవిచేయ దలచుకొన్న విషయం దానిని దృష్టిలో పెట్టుకొని దీనిలోఉన్న సాధకబాధకాలను చర్చిస్తే సరిపోతుంది నేను ప్రభుత్వంతరఫున చెబుతున్నాను రెవిన్యూ మినిస్టరుగారుచెప్పారు -రెండవబిల్లు ఈ session లోనో దైవకృపవల్లమనం హైదరాబాదు వెళ్లకుండానే దాన్ని లా చేసవెళ్లుతాం దాన్నివదలిపెట్టి వెళ్లేఉద్దేశ్యం ఎంతమాత్రములేదు ఏభావాలతోటి ఏపనీచేయలేదు ఇది దృష్టిలోపెట్టుకొని సభ్యులు ఈబిల్లును చర్చించాల్సిందని నాకోరిక

SRI PILLALAMARRI VENKTESWARLU — అధ్యక్షా వెంకట్రావుగారు చెప్పిన తర్వాత దాంట్లోనుంచి ఒకటి ఏర్పడుతుంది మిగిలిన ఒక్క బిల్లు నేను అతిత్వరలో ప్రవేశపెట్టబోతున్నప్పుడు ఈబిల్లును ముందు సగానికి సగం pass చేసేం తర్వాత మిగిలినదంతకూడా, ఇదివరకు వచ్చినటువంటి ordinance అంతాకూడా రద్దయిపోతుందని ప్రకటించాల్సిన అవసరం ఏమివచ్చింది? తరువాత అలా ప్రకటించడంవల్ల evictions మున్నుమునవి మరల మరల జరుగుతాయికాదా? ఆ సమస్యను మనం ఇప్పుడు ఆలోచించకుండా దీనితో గవర్నమెంటు జారీచేసిన ordinance రద్దయిపోతుంది దానివల్ల వచ్చేనష్టాన్ని మనం దృష్టిలో పెట్టుకోవాలి గదా ? అన్నటువంటిసమస్య ఒకటిఉంది తర్వాత అతిత్వరలో బిల్లుతీసుకు వస్తామని చెప్పుతున్నారు అది ఇప్పుడు ఈ sitting లోనే వచ్చేటట్లయితే బాగుండేది కనీసం మాకు దీంట్లో ఒక భాగంగా ప్రచురించి ఉంటే తర్వాత President గారి assent కు పంపచ్చును

Select Committee Report మనముందు ఉన్నది శ్రీశంకరయ్యగారు Select Committee రిపోర్టును ఆధారంగా తీసుకొని మాట్లాడుతున్నారు protion of a village అని తీసిపారవేయడంవల్ల చాలా ఇబ్బందులున్నాయి అని మాత్రం మీ దృష్టికి తీసుకుని వస్తున్నాం

THE HON SRI K CHANDRAMOULI — అధ్యక్షా ఇందాక వెంకట్రావుగారు explain చేసినదాంట్లో మొదటిభాగాన్ని ఇపుడు ఎందుకు ? పెట్టారు రెండవభాగాన్నికూడా కలిపిపెట్టితే బాగుండును అని ఎల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లుగారి contention Village అన్న definition లో village అంటే whole inam village అని కోర్టులు తీర్పుచెప్పడంవలన ఈతగాదాలు రావటంలో litigation ఎక్కువై గందరగోళంగాఉంటే దానిని నివారించడంకోసం clause 3 (2) (d) ని amend చేయదలచాము Kandriga అన్నా hamlet అన్నాఇదిఒక undisputed వ్యవహారం వాటికి Rent Reduction Act ను apply చేస్తే compensation న్ను గనుక ఇచ్చేస్తే అవి estates అయిపోతాయి మిగిలిన ఇనాంల విషయంలోకూడా President గారి assent కు పంపించాం Reminder ను కూడా ఇచ్చాం చాలా తొందరలోనే వస్తుంది వారు చెప్పినట్లుగానేవస్తే ఇప్పుడే ప్రవేశపెట్టడానికి అభ్యంతరంలేదు ఈ మధ్యకాలంలో రైతులను ఈనాందార్లు వెళ్లగొడుతారు అనేటటువంటి వ్యవహారాలు గందరగోళాలువస్తే వాటినిగురించి మనం ఆలోచించాల్సి వస్తుంది

SRI R B RAMAKRISHNA RAJU—ఇప్పుడు మంత్రిగారు తీసుకు వచ్చిన amendment లో khandrika or hamlet అనివుంది దీనిప్రకారం hamlets కండ్రికలుకూడా estates అవుతాయి అప్పుడు వాటికి Estates Abolition Act ప్రకారం compensation ఇవ్వవలసి వస్తుంది అట్లా ఇచ్చుటకు ప్రభుత్వంవారు సద్ధంగా ఉన్నారా ?

రాబోయే బిల్లులో మాదిరిగా డబ్బుcompensation గా యివ్వకుండా కొంత భూమి compensation గా ఇవ్వాలనే అభిప్రాయం ప్రభుత్వానికున్నప్పుడు దానిని కూడా ఆ ప్రకారం ఎందుకు చేయకూడదు ? డబ్బుగాఇస్తే చాలా తక్కువగా compensation అవుతుంది Zamin Estates కు వచ్చే compensation చాలా తక్కువ ఇదివరకు 1, 2 సంవత్సరాల ఆదాయం వస్తోంది ఇప్పుడు ఆవరుంబడి కూడారాదు అటువంటప్పుడు కండ్రిక hamlet తీసుకొని వాటికి 100,50 రూ॥లో వస్తే దానిని 4 వ వంతు చేసి compensation ఇస్తే చాలా తక్కువ వస్తుంది

ఇటువంటి పరిస్థితులలో భూమిని తీసుకోడానికి ఈనాందారులు సమ్మతించవచ్చు అందుచేత ఈనాం కంద్రిక అనేవి రెండు కలిపి ఒకేపద్దుక్రింద compensation ఇస్తే బాగుంటుంది Zamin estates కు మాత్రం compensation డబ్బురూపంలో యిస్తూ inam estates మాత్రం యితరవిధంగా ఎందుకు ఇవ్వవలసివచ్చింది ? అది కొంచెము explain చేయాలని కోరుతున్నాను

THE HON SRI K CHANDRAMOULI —Kandrika hamlet అనేది ఒక bigger unit Hamlet అన్నప్పటికిన్నీ కూడా అది ఒక గ్రామమే దాంట్లో అసలు చిక్కు ఉండటానికి వీలులేదు చాలా చిన్న గ్రామాలున్నాయి ఇప్పుడు మనం ఈబిల్లు pass చేసినట్లయితే ఈనాములకు యింతవరకు చెల్లిస్తున్న quitrent, జోడీ అనే nominal rent కూడా రైత్వారీ level కు తీసుకువచ్చి రైత్వారీశిస్తు కట్టవచ్చు చిన్నచిన్న ఈనాములకు compensation యివ్వడం అయితే శిస్తు కట్టడానికి సరిపోతుంది అంతకన్నా ఏమీవుండదు అందువల్ల చిన్న ఈనాములన్నింటినీ వేరుచేసి మొత్తం ఈనాములన్నింటినీ రద్దుచేయాలని ఉద్దేశ్యం ఇది యిదివరకు definition లో village గా వున్నప్పటికి దానికి hamlet అనేదికూడా చేరివున్నది వాటిని విడగొట్టి hamlets చేసిన గ్రామాలుకూడా వున్నాయి అందువల్ల ఆ distinction తీసుకురావలసి వచ్చినది ఈ కంద్రికలకు hamlets కు compensation యివ్వడానికి ప్రభుత్వంకూడా అంగీకరించింది

THE HON SRI K VENKATA RAO — Except in the above cases the grant of less than a village does not constitute an estate A village is defined in Section 3 (19) as any local area situated or constituting an estate which is designated as a village in revenue accounts and for which revenue accounts are separately maintained by one or more karnams or which is recognised by the Provincial Government or may hereafter be declared by the provincial Government for purposes of this Act to be a village and includes any hamlet or hamlets which may be attached thereto According to this definition a revenue unit has to be taken as a village while by a village, it is meant village with its hamlet Hamlet of a village by itself cannot be treated as a village and the grant of a hamlet or of a mazra or khandrika cannot be treated as the grant of a village A khandrika means a portion of a village granted free of rent or on a favourable lease Where the grant is of a khandrika carved out of the lands of another village, it is still grant of the portion of the village and is therefore not a whole inam village "

దీనిలోని defect ను rectify చేయడానికే ఈ బిల్లు తేబడింది

All through the Government's contention is that this khandrika granted as an inam is also a whole inam The Courts are coming in the way because whole is used in the Section They have prevented some of these reasonable 'estates' out of this picture To that extent we are rectifying here '

ఒక position ఇవ్వకపోయినా దానిలో service tenure వున్నా extent లో తేడా వున్నా distinguish చేసినారు

They have prevented some of these reasonable estates out of the picture To that extent we are rectifying here by this Act

SRI R B RAMAKRISHNA RAJU — కండ్రిక hamlets వేరుగా వుంటే village లో చేరదన్నారు అదే ప్రకారం portion ఇచ్చివుంటే కూడా చేరదన్నారు Whole village అంటే కండ్రికగాని hamlet గాని exclude అయి వుండవచ్చును Portion of lands కూడా exclude కావచ్చును కాబట్టి village అనే definition లో కండ్రిక exclude అయినా రాదు hamlet exclude అయినా రాదు

THE HON SRI K VENKATA RAO — అధ్యక్షా, ఇప్పుడు క్రొత్తగా abolish చేసే new estates ను కూడా ఆ portion తోటి సమానం చేయాలని రాజుగారి అభిప్రాయం వారు ఈ బిల్లు మీద ఒకటే point raise చేశారు కాబట్టి ఈ బిల్లును సభ్యులంతా ఏకగ్రీవంగా ఒప్పుకోవచ్చు దీనితో పాటు eviction ను గురించిన ordinance lapse అవుతోందికనుక మధ్యన tenant కు ప్రమాదం వస్తుందేమో దానిని prevent చేయడం ఎట్లాగ అనే point raise చేస్తున్నారు ఈ బిల్లును introduce చేయడంలో అంతాకూడా జాగ్రత్తగా ఆలోచించి తగిన చర్యలు తీసుకుంటామని చంద్రమౌళిగారు చెప్పారు

"It will come into effect on such and such a date from the time this Bill becomes an Act ' ఆ మధ్యన వున్న period కు restrospective effect వెనక్కు నెట్టవచ్చు

SRI PILLALAMARRI VENKATESWARLU — ఆ restrospective effect ముందుకు పోతుందికదా !

THE HON SRI K VENKATA RAO — అట్లా పోవడానికి అవకాశంలేదు

1936 సం॥ లో బొబ్బిలి రాజాగారు తలపెట్టినదానికి court వారి వ్యాఖ్యానంవల్ల అడ్డం వచ్చిన వ్యవహారాన్ని ఈ బిల్లుతో set right చేస్తున్నాము Whole ఈనాంలో portion అనేదికూడా abolish చేసాము.

SRI B SANKARAIAH — అన్ని ఈనాములలో కూడానా ?

THE HON SRI K VENKATA RAO — అన్ని Inam Villages లోనూ అన్ని ఈనాములలోనూ కాదు

ఈ news papers వారితో వచ్చిన తగులే యిది ఈనాముల రద్దు చట్టము అని వ్రాస్తారు

అది ఈనాముల రద్దుచట్టంకాదు ఈనాంగ్రామాల రద్దుచట్టం అని press వారికి ఎన్నిసార్లు చెప్పినా గ్రామం అనే పదం ఉపయోగించరు ఒకవేళ వీళ్ళు ఈనాముగ్రామాల రద్దుచట్టం అని యిచ్చినా అక్కడ వున్న Sub editor మాత్రం ఈనాముల రద్దుచట్టం అని వ్రాస్తాడు దానిని చదువుకొని మనం కంగారుపడ నక్కరలేరు మన legislation అంతా ఈనాం గ్రామాలకు సంబంధించినదే లేకపోతే estates అనివాడడం ఎందుకు ? ఈనాములనే అందుము

అందుచేత ఈ రెండింటి మధ్యన discripancy వచ్చినట్లయితే దానిని cover చేస్తామని చంద్రమౌళిగారు అన్నారుకనుక వారుకోరిన రెండవ బిల్లు కూడా ప్రభుత్వం తెచ్చుటకు సిద్ధంగా వుంది కనుక ఈ బిల్లును pass చేయవలసిందని శంకరయ్యగారికి మనవి చేసుకొంటున్నాను

SRI B SANKARIAH —అధ్యక్షా మేము ఏమిచెప్పామో పూర్తిగా వినకుండనే వెంకటరావుగారు సమాధానం చెప్పారు ఇప్పుడు అనేక విషయాలు ఉదాహరణగా తీసుకొని చెప్పాము అదివరకు దాకా protection ఇస్తే సరిపోతుందని చెప్పి ఇప్పుడు ఈ బిల్లులో ఇంకో సూచన చేస్తున్నారు 100 ఎకరాలు 200 ఎకరాలు ఉండేటటువంటి మజరా కంద్రికను estate క్రింద తెస్తామని అంటున్నారు 10 వేల ఎకరాలు, 30 వేల ఎకరాలు ఉండేటటువంటి పెద్ద ఈనాంగ్రామాలు ఒక ఎకరా minor ఉన్నదనే technical కారణంచేత కోర్టుల్లో నిలబడిపోయి estate లు గాకుండా చేస్తున్నారు రేపురాబోయేటటువంటి బిల్లులో చిన్న చిన్న కంద్రికలను అంతకన్నచిన్నవైన hamlets ను దీంట్లో చేరుస్తామని అంటున్నారు General గా 100 ఎకరాలు, 200 ఎకరాలు ఉండేటటువంటి వాటిని కంద్రికలు hamlets క్రింద చేరుస్తున్నారు 10 వేల ఎకరాలు ఉండేటటువంటి గ్రామాలలో

ఒక ఎకరము సర్వీసు క్రింద ఇచ్చారు కాబట్టి దానికి ఈ బిల్లు వర్తించదని కోర్టులో చెప్పారు కనుక ఇట్టి గ్రామాలను ఏ Act క్రింద వేస్తారు ?

THE HON SRI K VENKATA RAO —Service tenure inams ను abolish చేసి అసలు system లేకుండా చేస్తామని చెపుతూ ఉంటే మళ్ళీ ఆ గొడవ ఎందుకు ?

SRI B SANKARAIAH — రైతేనండి మీరు abolish చేస్తామనే చెపుతున్నారు రైతులకు ఈబిల్లులో వచ్చేటటువంటి benefit ఒకరకము, రేపు రాబోయే బిల్లులోవచ్చేటటువంటి benefit ఒకరకము ఈనాముదారులకు రైతులకు మధ్య భూమి పంచవలెననేటటువంటిది వచ్చేబిల్లులో వస్తుంది అదివరకు Government జమిందారులను abolish చేసినట్లు చేయాలనేది ఈబిల్లులో వస్తుంది కాబట్టి దీనికి దానికి భేదమున్నది చిన్న చిన్న ఈనాందార్ల విషయంలో ఏపార్టీ కూడా వాళ్లకు అన్యాయం చేయాలని కోరడంలేదు చిన్న ఈనాందార్లకు న్యాయంగా పరిహారం ఇవ్వాలి ఆవిషయంలో ఎవ్వరికి అభ్యంతరములేదు అయితే మీరు చిన్న ఈనాందార్లను define చేయటంలేదు పోయిన Select Committee లో కూడా ఇక్కడే భేదంవచ్చింది, ఈనాందార్లనందరిని ఒకే category క్రింద చేరుస్తున్నందు వల్ల మీకు మాకు భేదంవచ్చింది ఇంతభూమిఉండే చిన్న ఈనాందారుకు ఈరకంగా నష్టపరిహారం ఇవ్వాలి అని చెప్పినట్లయితే మేమందరము ఆలోచించేదానికి వీలుగా ఉంటుంది ఏమిచేస్తే బాగుంటుందో అన్నిపార్టీలు ఆలోచించి ఏకగ్రీవంగా చేయ వచ్చు అట్లాకాకుండా లక్షఎకరాలు ఉన్నవారికి చిన్నఈనాందారుకు ఒకేరకంగా ఇవ్వాలనటంవల్ల మేము దానిని వ్యతిరేకించాము అందువల్ల రైతులను చిన్న ఈనాందార్లను దృష్టిలోపెట్టుకొని మనం మాట్లాడాలి అయితే Substantial Portion అనేది చిన్న ఈనాందారులకు ఇచ్చినప్పటికి అవికూడా estates క్రిందికి రావాలనేటటువంటిది 1936 లోనే ఉన్నది 1944 లో ప్రత్యేకంగా సవరణ తెచ్చారు ఒకగ్రామంలో చిన్నఈనాములు కొన్ని ఉన్నందువల్ల ఆగ్రామంలో ఉన్నటువంటి రైతాంగానికి అన్యాయం జరుగుతోందని, అన్యాయం జరగకుండా ఉండేందుకు ఇప్పుడు కోర్టులలో ఉండే కేసులకు సంబంధించిన రైతాంగానికి న్యాయము కలుగజేయడానికి అసలీ బిల్లువచ్చింది అటువంటప్పుడు ఒకచిన్న clause ద్వారా ఆ portion అనేది తీసివేశామని చెపితే ఇంక ఆబిల్లులో మిగిలేదేమి ఉన్నది ? అసలు ఈ portion అనే దగ్గరనే తగాదావచ్చి అనేక కేసులు కోర్టులకు వచ్చాయి ఇప్పుడు వెంకటరావుగారు రక్షణ ఇస్తున్నారు పట్టాయిచ్చారు కంద్రికలలో ఉండేటటువంటి రైతులకు possession హక్కు లేకుండా lands

మీద పట్టా యిస్తున్నారు అసలు గ్రామంలో ఉండేటటువంటి రైతులకు possession హక్కు పెట్టబోతున్నారు అందులో చిన్న ఈనాందార్లని పెద్దఈనాందార్లని తీసుకురావడంలేదు అందువల్ల 6 లక్షల రైతాంగాన్ని వేలమంది ఈనాందార్లను దృష్టిలో పెట్టుకోండి చిన్న ఈనాందారంటే define చేయండి వాళ్లకు న్యాయంగా నష్టపరిహారం ఇవ్వాలి దానికి మేమంతరము ఒప్పుకుంటామని మేము మళ్లీ చెబుతున్నాము ఆవిధంగా గందరగోళంచేసి ఇంతమంది రైతులకు నష్టంకలిగి వ్యవసాయంఅంతా పాడైపోయి 6 లక్షలమంది రైతాంగం ఎదురుచూస్తు ఉండేటటువంటి సమయంలో వెంకట్రావుగారు పత్రికలో ప్రకటించిన విధంచూసి అందరు మాది కంద్రిక అయిపోతుంది మాది hamlet క్రిందకు వస్తుందని అనుకొన్నారు మొదటగా Legislation లో ఈనాంగ్రామాలనేవి ఉండవు ఇకనుండి అంతాకూడా Government గ్రామాలలోఉండే గ్రాంటులు అన్నట్లుగా ఆయనచెప్పారు ఇప్పుడు పత్రికతెచ్చి చదివితే ఎవరికైనకూడా అదే అర్థంఅవుతుంది అన్నిగ్రామాలకు అది వర్తిస్తుందని 6 లక్షలమంది రైతాంగం ఆశిస్తున్నది ఆవిధంగా పత్రికలలో ఇచ్చేటప్పుడు ఈ technical కారణాలవల్ల కోర్టుకుపోయినవారికి ఇదివర్తించదు ఆ ఈనాంగ్రామాలలో ఉండేదే కంద్రిక అని ఎవరికైనా చెప్పారా ?

THE HON SRI K VENKATA RAO — గతనెలలో ఇచ్చిన Statement చదువుకొంటే దానిలో ఒకఅక్షరం తప్పంటే నాదిపూచి నేను dictate చేశాను వాళ్లు వ్రాసుకున్నారు ఇప్పుడు రోడ్డుమీద వినిపించుకొని వాళ్లు వ్రాస్తున్నారు దీనికంతకు ప్రతిరోజు ఎక్కడ వ్యవహారం నడుస్తుంది Clear గా cabinet meeting అయి రెండుబిల్లులు పెట్టదలచుకొన్న తరువాత మా యింటి దగ్గర Press Conference పిలిచి ప్రతిమాట వాళ్లకు చెప్పాను ప్రతిమాట వాళ్లు publish చేశారు ఇప్పుడు వాళ్లంతటవాళ్లు బిల్లు Pass చేస్తున్నారు ఆయుర్వేద బిల్లును integrated medicine Bill క్రింద Pass చేశారని Hindu దగ్గరనుంచి అన్ని Paper లలో publish చేశారు Government College of Integrated Medicine అని క్రొత్తపేరు పెట్టారు కనుక వాళ్లు దానిని తప్పువ్రాశారు కొన్నిఅర్థమే కావు కొన్ని పత్రికలలో ఈనాముల రద్దుచట్టమని వేస్తాడు ఎన్నిమార్లు చెప్పినా Inam Villages అని వెయ్యడు దానికి నేనేమిచెయ్యను అవన్నీ పెట్టుకోకండి ఇప్పుడు మనం రాబోయే దానిని గురించి ఏమిచేయాలో ఆలోచించాలి బీదప్రజానీకం పేదప్రజానీకం 6 లక్షల రైతులకు నేను వాళ్లకు చేసినటువంటి సేవకు ఎంతవిమర్శన చేసినా ఇంకెవ్వరూ చెయ్యలేదు వాళ్లయొక్క రక్షణకోసమే నేను మొదటనుంచి fight చేస్తున్నాను దానినిగురించి విమర్శిస్తూ

పోకనేక ఉత్తరాలు వచ్చినాయి నేనవేమి అత్యం చేయడంలేదు నేను ఈనాం దారుల మనిషినికాను ఈనాం tenants మనిషిని వాళ్లయొక్క రక్షణకోసం ఏమి కోవాలన్నా నేను మీకంటె ఎక్కువచేయాలనే దృష్టిలో ఉన్నాను వ్యక్తిగతంగా కాకుండా ప్రభుత్వంకూడా అదేదృష్టిలో ఉన్నది కనుక దానికి తగిన చర్యలు తీసుకొంటామని ఆ line లోనే ఆలోచించాలని సభ్యులను కోరుతున్నాను

SRI A KALESWARA RAO —ఉపాధ్యక్ష మహాశయా ! చాలరోజుల నుంచి దేశం ఈనాములరద్దు విషయమై ఎదురుచూస్తున్నది 1908 వ సంవత్సర Estate Lands Act pass చేసినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వమువారు కేవలం మేలువరం హక్కు గలిగినటువంటి ఈనాందారుల గ్రామాలకే estate అనేపదాన్ని ఇచ్చారు తరువాత బొబ్బిలి రాజాగారు 1936 వ సంవత్సరంలో మేలువరం కుడివరం ఏహక్కు ఉన్నప్పటికి పెద్దరైతువలె తమక్రింది కౌలుదార్లమీద వ్యాజ్యాలువేసి decree లు పొందిన వాళ్ళందరిని estate లో చేర్చారు అనగా వాళ్ళకు కుడివరం హక్కుకూడా ఉన్నది పెద్దరైతులవంటివాళ్ళే వాళ్ళు శిస్తు తగ్గించారన్నమాట పెద్దరైతులదగ్గరనుంచి శిస్తుపుచ్చుకుంటూ వాళ్ళకు జోడిఅని ఇచ్చారు నిజంగా కుడివరం మేలువరం రెండూ ఒకళ్ళకే హక్కుఉన్నదంటే మామూలు assessment ఇవ్వకుండా జోడిమాత్రం ఇస్తున్నటువంటి వాళ్ళనుకూడా బొబ్బిలి రాజాగారు estate దార్లక్రింద తీసుకువచ్చారు అదివరకు decree లు పొందినవారు కౌలుపరతుల ప్రకారం రైతులను మారుస్తూ ఉండడం సంవత్సరం ఆఖరున విడుదలయిపోతామనడం ఇటువంటివన్ని వ్రాసినట్లయితే వాడికి జిరాయితీహక్కు కలుగవలెనని అదివరకు అనేక తీర్పులు ఉన్నాయి వాటన్నిటిని కొట్టిపారేశారని అన్నారు ఇది రైతులయొక్క హక్కులనన్నింటిని కాజేసినది ఈనాందార్లనేటటువంటి ఒక పాప్టు class ఉన్నది వాళ్ళహక్కులనన్నింటిని కాజేశారన్నమాట రావడంవల్ల technical గా అదికూడా estate అన్నారు వెంకటరావుగారు Estates Land Act పెట్టినపుడు భేదంచేశారు 1908 సంవత్సరం క్రిందకువచ్చిన వాటన్నింటిని abolish చేశారు ఏదో compensation ఇచ్చారు గ్రామాలన్నీ లాక్కొన్నారు రైతులకుఉండేటటువంటి హక్కులన్నీ మామూలుగానేఉన్నాయి 1936లో నివి అట్లాకాకుండా నిలిచిఉన్నాయి ఈ రైతులకు అదివరకే బొబ్బిలి రాజాగారివల్ల ఇవ్వబడినాయి ఇది భేదము బొబ్బిలి రాజాగారివల్ల ఈరైతులకు జిరాయితీ హక్కులు ఇవ్వబడినాయి కాని ex proprietors కు అన్యాయంజరిగింది అందువల్ల ఇట్లా సందేహంగా పడిపడివస్తున్నటువంటిదాంట్లో అది ఒకటి Village యావత్తు ఒక్కసారిగా ఇస్తేనే అది estate అని 1908 లో ఉన్నది దానినిబట్టి

రెండు చట్టాలు చేయవలసి ఉన్నది 1936 వ సంవత్సరం ఈనాములను రద్దు పరచడం అనేది ఒకటి భాగము ఇచ్చినా లేక అప్పుడప్పుడు ఇచ్చినా లేక కొంత మందికి ఇచ్చి మొత్తం అయినా అటువంటివాటిని estates గా తీసుకోవాలనేటటు వంటిది రెండోది

ఈ రెండింటిని కలపడానికే ఇప్పుడు గవర్నమెంటువారు ఈ బిల్లు తీసుకు వచ్చినట్లుగా నాకు కన్పిస్తున్నది అనగా whether the land holder was given only melvaram right or whether he was given both melvaram and kudivaram right అదివరకు కుడివరం ఉన్నవానికి మేల్‌వరం ఇచ్చినా అటువంటి వాటన్నింటిని వర్తించేటట్లుగా 'an inam village అని ఒకే మాట వేశారు దానికి మనము సంతోషించవలసిందే రైతుల పక్షంలో ఉండేటటువంటి వాళ్లకు తగువులేకుండా నిర్దుష్టంగా Estates లోకి అవన్నీ తీసుకువస్తున్నారు రెండవది, భాగాలుగా ఇచ్చినట్లయితే అది Estate కాదనేది దాన్నిగురించి కరివెన సత్యాగ్రహము పెద్ద అల్లరి అంతా జరిగింది దానికి 1948 సంవత్సరంనుంచి retrospective గా తీసుకొనివస్తామని అంటున్నారు దానికోసమే మంత్రి చంద్రమౌళిగారు hamlet or khandrika అన్నారు Select Committee లో 'any portion of an inam village అన్నారు అంటే 4 ఎకరాలుగాని మూడు ఎకరాలుగాని estate అనిపించుకొంటుంది కాబట్టి ఇప్పుడు గవర్నమెంటువారు చెప్పింది బాగాఉంది - 'Kandrika or hamlet అనేది All villages - 1908 సంవత్సరంలో estates కానివ్వండి బొబ్బిలిరాజాగారి 1936 సంవత్సరంలోని estates కానివ్వండి Full గ్రామ లేకాకుండా పంచుకొంటే అదంతాకూడ వస్తుంది ఇప్పుడు 'hamlet or kandrika అనేటటువంటిది కలుపుతున్నారు దానిలో ఒక సందేహం ఉన్నది 'Hamlet or kandrika in an inam village" అంటే నాకు అర్థంకావడంలేదు అసలు hamlet or kandrika అనేదే ఇనాము తక్కినది గవర్నమెంటు portion కావచ్చు ఒక inam village లో ఒక hamlet or kandrika అనేది ఏమిటో అర్థంకాకుండాఉన్నది దీనికి Select Committee లో ఇద్దరు లాయర్లు ఉన్నారు అయితే వాళ్లు ఈమాట అన్నట్లులేదు కాబట్టే ఇప్పుడు మీరు చూచుకొంటున్నారు నేను ఒక విషయం గవర్నమెంటువారికి మనవిచేస్తున్నాను 'Hamlet or kandrika' అంటేచాలును "In an inam village' అనే ప్రశ్నేలేదు Hamlet or Kandrika is recognised as inam, 'confirmed, recognised' అని ఇవతల వ్రాసుకొంటూ in an inam" అనేది నా lawyer sense కు నా legal sense కు ఏదో వ్యతిరేకంగా కనిపిస్తున్నది కనుక దాని విష

యము చూడవలసినదని కోరుతున్నాను అందులో ఇంతకంటె ఆక్షేపణకరమైన విషయంలేదు తరువాత గవర్నమెంటును congratulate చేయవలసిందేమిటంటే, ఇప్పుడే compensation అ నేది పెట్టుకోకుండా కొంత ఆలోచనతో పెట్టుకున్నారు దీంట్లో ఇప్పుడు rents అని పెట్టారు ఇదివరకు పాత arrears అంతాకూడా Rent Reduction Act క్రిందనే వసూలు చేయాలని చెప్పారు ఇప్పటినుంచి మాత్రం అయిదవ వంతు ఖార్యకోసం పెట్టారు అనగా till the rights of inamdars are extinguished అయితే ఈ inamdars యొక్క rights ను extinguish చేసేదాంట్లో 1936 inams అయినాసరే కంద్రికలైనాసరే hamlets అయినాసరే వాంళ్లక్రింద రైతులకు జిరాయితీహక్కులు వచ్చినాయి అని అనుకొనేటటువంటివాళ్ళందరికి కూడా మొదటనే చాలమంది మనవాళ్ళు అనుకొన్నట్లుగా 20 సంవత్సరాలు ఇదంతాలేకుండా 8వ వంతు ఇచ్చి ఆ పీడ వదిలేసుకొంటే వాళ్లకు వీళ్లకుకూడా బాగుంటుందని మనవిచేస్తూ ఈ బిల్లులో 'in an inam village', అనేది తీసివేస్తే బాగుంటుందేమోనని ఈ విషయం మరల Legal Department ను ఆలోచించవలసిందని కోరుతూ దీన్ని బలపరుస్తున్నాను

SRI GOTTUMUKKALA JAGANNATHA RAJU — Mr Deputy Speaker, Sir, I just want to place before the House a few facts in connection with this Bill In the first place there are vast changes in the Bill as emanated from the Select Committee To add to it there are amendments given notice by the Hon Revenue Minister So the changes are vast as compared with the provisions of the Bill as originally introduced in this House When such vast changes have been made and when there is a promise that with reference to the rest of the portions left out in the present Bill a legislation will be shortly introduced, is it not just and fair to the Assembly that all these put together is brought at one and the same time so that the whole thing may be discussed simultaneously So I support Sri Vavilala Gopalakrishnayya s amendment that the matter should be referred back to the Select Committee once again A distinction is now sought to be made as to why khandrigas and hamlets are now brought before this Assembly, namely, that such inams are meant to be abolished while for the rest another Bill is going to be introduced that portion of it is going to be given away as compensation and that they will not be abolished actually as such a step will not entail Government to shell out cash as compensation But I say this is not a genuine reason Because when they want to abolish hamlets and khandrigas immediately where is the necessity for providing that rent should be paid till they are actually abolished and when there

is a provision to the effect that rent shall be one fifth of the produce excluding cash crop? When there is that provision it is a clear indication that Government are not going to abolish minor inams for some time—not an insignificant time but a very long time So there is no possibility of these minor inams being abolished in the way that inamdar s rights will be abolished and compensation piad to them The third point which I wish to place before this House is this namely that rent is differentiated between the rent of inams held by charitable institutions and the rent of inams held by private individuals Charitable institutions can be helped in so many ways if the Government really want to do so, especially when our Revenue Minister is here with all his religious feelings I fail to understand why this distinction should be made that the tenant in one portion of land just abutting the other portion should pay one rent while the other man should pay a different rent A third point I wish to place before the House is that the appellate authority that is provided in the Bill is the Tribunal As our leader once said in the Select Committee stage it is better always that we have the highest court in the land to decide these things and so it is the High Court that must be made the final authority with reference to the appeals and not the Tribunals By this I should not be understood as throwing any aspersions on these tribunals I only say it is reason able always to have the highest authority as the final authority to decide these matters

THE HON SRI G LATCHANNA — అధ్యక్షా ఈ సమస్య చాలా ఏళ్లనుంచి చర్చలో ఉన్నటువంటిది కాబట్టి ఈ బిల్లుయొక్క ఉద్దేశాలు గౌరవ సభ్యులకు స్పష్టంగా తెలిసే ఉంటుంది ప్రస్తుతము ఈ సమస్యను రెండుభాగముల క్రింద రెండు వేరువేరు బిల్లులలో పరిష్కరించడానికి ప్రభుత్వము పూనుకొన్నది మొట్ట మొదట ఈ estates అన్నీ రద్దుకావాలనే సిద్ధాంతముమీద మొదట Estates Abolition Act రావడం జరిగింది అందులో estate అంటే ఏది అనేవిషయంలో కోర్టులలో వచ్చినటువంటి సందేహాలు తగాదాలు వీటిని పరిష్కరించడానికి గాను మనము మద్రాసు రాష్ట్రంనుంచీ కూడ ప్రయత్నిస్తున్నాము ప్రభుత్వము దీనిని పరిష్కరించ బోతున్నది దీనినిగురించి తీవ్రంగా ఆలోచిస్తున్నది అని పదే పదే అనేక సందర్భాలలో ఇచ్చినటువంటి హామీ పర్యవసానంగా ఈ నాడు ఈ బిల్లు రూపములోవచ్చి ఇది ప్రతిపాదింపబడినది ముఖ్యంగా ఈ Act లో ఉన్నటువంటి కొన్ని సందిగ్ధమైన పదముల నిర్వచనలో కోర్టులకు ఇబ్బంది కలగడము అందు

వల్ల estates ఏవి అని కోర్టులు నిర్వచన చేసేటప్పుడు ప్రభుత్వము వారియొక్క దృక్పథాన్ని Tribunal ఇచ్చినటువంటి నిర్వచనను వారు పరిశీలించి Section లో ఉన్నటువంటి పదాలకు ఇచ్చినటువంటి నిర్వచనలకు కాస్త పరస్పర విరుద్ధమైనటువంటి పరిస్థితి ఉన్నదనేది గమనించి పూర్తిగా ఇనాము (whole inam) అయినప్పుడే దానిని estate గా పరిగణించాలని whole inam అంటె ఏది అనే నిర్వచనలో ఏక పట్టాతో ఉండేటటువంటిదే whole inam గా గుర్తించవలసి యుంటుందని ఒకటే ఎక్కువ భాగాలుగా ఉన్న అది whole inam కాదని High Court వారు ఇచ్చిన ఒక Judgement పైన ఈ సమస్యను తీవ్రంగా పరిశీలించవలసినటువంటి పరిస్థితి ఏర్పడింది

అందువల్ల దీనిని పరిష్కరించవలసి వచ్చినప్పుడు దీనికి అనేక సమస్యలు ఉత్పన్నమైనవి ప్రభుత్వం ఒకపక్షముగా వ్యవహరించు చున్నదేమోనని ఈనాం దార్లకుగాని యితర మిత్రులకుగాని సభ్యులకుగాని సందేహాలు కలిగిఉన్నట్లయితే అవి అపోహాలు మాత్రమేనని నామనవి ఈ విషయములో ప్రభుత్వము పాక్షిక దృష్టితో వ్యవహరించాలని ఉద్దేశించినట్లయితే యీ సమస్యపై యిన్ని సంవత్సరాలుగా చర్చలకు అవకాశము యిచ్చిఉండేదేకాదు కాని అలాంటిది ఎప్పుడునూ జరగలేదు మనము ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో ఉండగానే యీ సమస్య పరిష్కరించబడి యుండేదే ప్రభుత్వము ఎవ్వరికినీ ఏవిధమైన అపకారము బాధ కలిగించకుండా ఉండవలెననే దృక్పథముతో ఉన్నందువల్లనే కోర్టులలో కేసుల వెంబడి కేసులు తగాదాలు కోర్టుడిక్రీలు, జప్తులు వేలములు ఉండేవేకాదు ఎన్నో కేసులు కోర్టులలో పెరిగియున్నప్పటికినీ ప్రభుత్వం యీనాందార్లకు యీనాంరైతులకు న్యాయము కలుగజేయాలనే దృక్పథముతో ఉన్నందువల్లనే యీసమస్య యింతకాలమువరకూ పరిష్కరించ బడకుండా వస్తున్నది ఈ విషయములో ప్రభుత్వము త్వరపడినట్లయితే లాభములేదు దీనిని ఏదోవిధముగా ఉభయ పార్టీలవారికి ఉపకారము చేయాలనే ఉద్దేశ్యము ప్రభుత్వానికి ఉన్నందువల్లనే యిన్ని సంవత్సరములు దీనిని తీసుకునివచ్చి చివరికి యీ బిల్లుద్వారా యీ సమస్యను సభవారిఎదుట ప్రవేశపెట్టడము తటస్థించింది అందువల్ల యీ సమస్యపట్ల ప్రభుత్వము తొందరపడిచేసింది యేమీలేదు ప్రభుత్వము పాక్షికముగా చేసిందని అనుకోటానికి మాత్రము ఆధారములులేవు ఆ విధముగా అనుకోవడము అన్యాయమని నేను మనవిచేస్తున్నాను ముఖ్యంగా యీనాడు యీ సభఎదుట ఉన్నబిల్లు 'Estate అనే నిర్వచనము ఖండ్రికలకు శివార్లకు వర్తించాలనేదే, ఇందులో యింతకంటె అదనం మరొకటి ఏమీలేదు ఈనాం

గ్రామాలుఅని మనము యింతవరకు వేనినిఅయితే ప్రకటించుకున్నామో ఆ యీనాం గ్రామాలకు సంబంధించిన ఖండ్రికలకు శివార్లకు యిది వర్తించాలనేది ప్రభుత్వము స్పష్టపరుస్తూ యీబిల్లును ప్రవేశపెట్టింది ఈనాము గ్రామాలు కానటువంటి శివార్లలోను కండ్రికలలోనూ ఏవైనా యీనాములు ఉంటే estate నిర్వచనము దానికి వర్తిస్తుందేమోననే సందేహము ఎవ్వరికైనా ఉన్నట్లయితే అది అపోహఅనే అనవలసి వస్తున్నది కాబట్టి అటువంటి అపకారము ఏమాత్రము యీబిల్లులో లేదు ఈనాముగ్రామము తాలూకు శివార్లకు ఈనాముగ్రామముతాలూకు ఖండ్రికలకు estate అనే నిర్వచనము వర్తించాలని యీబిల్లుయొక్క ఉద్దేశము అందువల్ల ఎక్కువగా దీనినిగురించి చర్చించుకునే అవకాశము లేనేలేదు ఒక estate లో ఉద్భవించినటువంటి ఈనాములు estates అని అంగీకరించాము కాబట్టి estate అనే సిద్ధాంతాన్ని ఎనాడో మనము అంగీకరించాము ప్రకటించాము అమలులో పెట్టుకుంటున్నాం దానిని అనుసరించాముకూడా ఆ estate లో ఉద్భవించిన ఈనాములలో కొన్ని అంగీకరించాము కొన్ని అంగీకరించలేదు ఆ estates లో ఉద్భవించిన కొన్ని యీనాములకు Rent Reduction Act ను వర్తింపజేసుకున్నాము Estates ను రద్దుచేయడములో కొన్ని వర్తింపజేసుకున్నాము కొన్ని కేటాయింపులుఅయినవి ఎందుకు అయినవి అంటే యీబిల్లులో ఉన్నపదముల అర్థాన్ని పరిశీలించవలసి వచ్చినప్పుడు పరస్పర విరుద్ధమైన అర్థము అందులో ఏర్పడినందువల్ల హైకోర్టువారు అలాంటివి estates కావు అని ప్రభుత్వముయొక్క దృష్టికి తీసుకునివచ్చారు Estates Abolition Act లో 3 (2) (d) section లో ఉన్న పదప్రయోగాలలో యిది స్పష్టపరచబడలేదు అందువల్ల ఆయాక్టు ఘరానావాటికి వర్తించటానికి వీలు లేదు అనేది కోర్టువారు ప్రభుత్వదృష్టికి తీసుకొనివచ్చారు హైకోర్టువారు యిచ్చిన తీర్పు మనకందరికీ శిరోధార్యమైనదిగా అయింది దానిని ఎవరూకూడ ప్రశ్నించటానికి అవకాశములేదు హైకోర్టువారు యిచ్చిన తీర్పుపైన యీచట్టాన్ని మనము సవరించుకోటానికి అగత్యము ఏర్పడ్డది దానిలోవున్న లోపాన్ని High Court ప్రతిఘటించినందువల్ల దానిని ప్రభుత్వదృష్టికి తీసుకునివచ్చినందువల్ల దానినే మనము యిప్పుడు సవరించదలచుకున్నాము కాని మొట్టమొదట Estates Abolistion Act ను మనము ప్యాసుచేసినప్పుడు శాసనసభఎదుట బిల్లును ప్రతిపాదించిన ప్రభుత్వానికి ప్రపంచానికంతటికీకూడ యీ యీనాము గ్రామాలకు వాటికి సంబంధించిన ఖండ్రికలకు అన్నింటికీకూడ ఈ రద్దుచట్టము వర్తిస్తున్నది, వర్తింపజేయాలి అనేది ప్రభుత్వముయొక్క దృక్పథము ఆ దృక్పథముతోనే ఆ బిల్లును

ప్రతిపాదించడము జరిగింది Estates అన్నిటికీకూడా వర్తిస్తున్నదనే విశ్వాసముతో దానిని ఆమోదించడము అది అమలు చేయడము జరిగింది కాని అందులో ఉన్న పదప్రయోగాలలో ఉన్న లోపాలవల్ల కొన్ని మినహాయింపు కాబడినవి ఆ విధంగా మినహాయింపు కాబడడమనేది యీనాడు అందులో పదప్రయోగాలను సరిజేయటానికి చేస్తున్నటువంటి బిల్లు యిది అంతేకాని కొత్తగా ఏదో ఒక సిద్ధాంతాన్ని యిమిడ్చి అమలు పరచవలెననే ఉద్దేశ్యముతో యీ బిల్లును తీసుకుని వచ్చారని అనుకోటానికి అవకాశము లేదు ఇటీవలనే సభ్యులు పత్రికలలో గమనించిఉంటారు ఈనాముగ్రామాలకు సంబంధించిన చిన్న చిన్న యీనాములుగా ఉన్నవాటి విషయము ఏమిటిఅనేది ప్రభుత్వం ఆలోచించడము ఆ ఆలోచన మన భారతదేశపు అధ్యక్షులవారి ఆమోదము వచ్చిన తరువాత ఆ సమస్యలన్నీ కూడ గజెటులో ప్రకటించి శాసనసభ ఎదుట ప్రవేశపెట్టి చర్చకు రాబోతున్నది అందువల్ల అది వేరే సమస్య ఈనాడు ఉన్న యీనాము గ్రామాలకు సంబంధించిన ఖండ్రికలు శివార్లు estate అనే నిర్వచనములోనికి రావాలి అనేది అందరము అంగీకరించిన యీ సమస్య యీనాడు సభ ఎదుట ప్రవేశపెట్టబడింది ఈ విషయములో మన రాజుగారు దీనిమీద అప్పీళ్లు మాత్రము కోర్టులకు విడిచిపెట్టడం మంచిదా లేకపోతే ప్రభుత్వమే పరిశీలించడము మంచిదా అనే దాన్నిగురించి చెప్పారు వారి అభిప్రాయములో కోర్టులు న్యాయస్థానములుగా ఉన్నందుకు అక్కడనే యీ విషయము న్యాయముగా పరిష్కరించబడుతుంది కాబట్టి యీ వ్యవహారము కోర్టులకు వదిలిపెట్టవచ్చునన్నారు కాని ఈ అభిప్రాయము న్యాయముకాదని చెప్పటానికి న్యాయసూత్రాలను అనుసరించి ప్రవర్తిస్తున్న ఏ వ్యక్తిఅయినా కాదు అని అనటానికి వీలులేదు ఈనాడు మనకు ఉన్న అనుభవములు ఆలోచనలు జరిగిన సంఘటనలు అటువైపున యీనాందార్లుగాని యిటువైపు ఈనాంరైతులుగాని ఈ కోర్టులబాధ మాకు అక్కరలేదు మాకు యిచ్చేది యేమిటో మాకు యివ్వండి మేము పుచ్చుకుంటాము మీరు పుచ్చుకునేది మీరు పుచ్చుకోండి ఆ విషయము వేగముగా తేల్చండి మేము యీ కోర్టులవెంట తిరగటానికి మాకు శక్తిలేదు మేము ఈ కోర్టుఖర్చులు భరించలేము అంటున్నారు అటుప్రక్కన ఈనాందార్లు, యిటుప్రక్కన ఈనాం రైతులు బాధ పడుతున్నారు ఈనాడు నేను ఊహించి చెప్పేది argument ఏమీకాదు మొన్న Select Committee ముందు ప్రతి stage లోకూడ ఉభయ పక్షములవారు వచ్చి చెప్పినదానిలో 'మమ్ము కోర్టులకు వెళ్లి దావాలు వేసుకునే పరిస్థితులలోనికి దింపకుండా యీసమస్య స్పష్టముగా తేల్చు మని కోరారు దీనిని వెంటనే పరిష్క

రించి అమలు జరిగేటట్లు చేయండి యిక మీదట ఏలాంటి తగాదాలు రాకుండా కోర్టులకు వెళ్లేటట్లు తగాదాలు పెంచకుండా చేయండి అని కోరారు ఉభయ పక్షములవారు యీ అభిప్రాయమునే వెల్లడించారు ఈ విషయము Select Committee సభ్యుల కందరికీ తెలిసినవిషయమే అందువల్ల యీ బిల్లు విషయములో ఎటువంటి భేదాభిప్రాయములకు తావుఉండదని యిదివరకు మనము అనుకున్నదానిని యిప్పుడు ఆచరణలో పెట్టటానికి యీచట్టములో పదప్రయోగ ములలోని లోపాలవల్ల వచ్చిన చిక్కులను పరిష్కరించటానికి యీబిల్లును తీసుకుని వచ్చాముగనుక సభ్యులందరు యీబిల్లును ఏకగ్రీవంగా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను

SRI P RAJAGOPAL NAIDU — అధ్యక్షా మొట్టమొదట ప్రభుత్వమువారు ఒకబిల్లును ప్రకటించారు ఈవిషయములో నాకుకన్పించేది యేమిటంటే ఈబిల్లుకంటే యిదివరకు ప్రకటించినబిల్లే ఎక్కువన్యాయముగా ఉన్నదని అనుకుంటున్నాను ఎందుకంటే యీ Estates Abolition Act లోని పదప్రయోగ ములమీద హైకోర్టువారు తెలియజేసిన అభిప్రాయాలనుబట్టి చాలాభాగము యీనాము గ్రామాలు estates క్రిందకురాకుండా పోయినవి ఎందుకంటే వాటిని అన్నింటినీ estates క్రిందకుతీసుకురావటానికి ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది అని యీ amendment ద్వారా ప్రభుత్వంచెబుతున్నది Select Committee యొక్క అభిప్రాయాలను అన్నీకూడ ప్రభుత్వం యీనాడు ప్రతిపాదించిన సవరణ తలక్రిందులు చేస్తున్నది ఎందుకంటే యిక్కడ యీనాము గ్రామము అని చెప్పారు ఈనాము గ్రామము అని నిర్వచనము మరికొంత విస్తృతంచేయాలని ప్రభుత్వం అనుకుంటున్నదని చెబుతున్నారు ఆ అభిప్రాయము నిజమే అయితే శివారుకు ఖండ్రికకు యీ రెండింటికి వర్తింపజేస్తున్నారు ఈసవరణవల్ల నాకు కలిగేభయము యేమిటంటే కోర్టువారు యిచ్చిన తీర్పునుబట్టి Inam Village అని అంటే మొత్తము గ్రామము (whole inam village) అని చెప్పారు ఏయీనాం గ్రామములోనైనా వెయ్యియకరములు కలిగిఉంటే అందులో ఒకఎకరము తక్కువయినా, అంటే 999 యకరములు కలిగిన యీనాముగ్రామము అయినప్పటికినీ అది యీనాము గ్రామము కాదని కోర్టువారు తీర్పుయిచ్చారు అలాంటిగ్రామాలు estates క్రిందకు రావు అన్నారు తరువాత శివార్లు ఖండ్రికలను గురించిచెప్పారు చట్టము ప్రకారము కొంత ఖండ్రికగాని కొంత శివారుకాని కోర్టుకువెళ్లినట్లైతే, అది whole khandriga గదా లేకపోతే whole hamlet ఆ అనే ప్రశ్నవస్తున్నది ఆవిధమైన ప్రశ్నవచ్చినప్పుడు ఇప్పుడు ఉన్న hamlet గాగాని whole khandriga

గాగాని నూటికి 90 అయినాలేవు అందువల్ల యీనాడు ప్రభుత్వం ప్రతిపాదించిన సవరణవల్ల అన్ని hamlets కాని khandrigas గాని యీ చట్టముక్రిందకురావు గనుక Select Committee వారు చేసిన తీర్మానమే తల్లక్రిందలు అయిపోతున్నది అందువల్ల మరల ఏదో యింకొకబిల్లును తీసుకుని రాబోతున్నాము యిదివరకు తప్పిపోయిన యీనాములను రద్దుచేయబోతున్నాము అని మన Revenue Minister గారు చెబుతున్నారు కాని యీబిల్లుయొక్క ఉద్దేశ్యమునకునూ యిది వరకు ప్రభుత్వం ప్రకటించిన బిల్లుయొక్క ఉద్దేశ్యమునకున్నూ చాలా భేదము ఉన్నది ఈబిల్లుద్వారా ఏవేవిఅయితే వస్తున్నవో వాటికి ప్రభుత్వము compensation చెల్లించబోతున్నదో అది ఊహాగానముగా ఉన్నది అందువల్ల మొన్నటి Select Committee వారు తీర్మానమునకు యీబిల్లులోని ఉద్దేశ్యమునకు చాలా తేడా కన్పిస్తున్నది కోర్టువారు తెలియచేసిన బిల్లులోని లోపాలను యీబిల్లుద్వారా ఏమాత్రముకూడ సవరించడములేదని నేను అభిప్రాయపడుతున్నాను

THE HON SRI G LATCHANNA — అధ్యక్షా రాజగోపాల నాయుడుగారు చెప్పిన సమస్యలు ఇంకా కొన్ని పరిష్కారము కాకుండా ఉన్నవి కాబట్టి వాటి రూపము తెలుపవలెనని అన్నారు ఇప్పుడు ఒక్క భాగము మాత్రము వస్తున్నది దానికి దానికి పరస్పర విరుద్ధభావము వస్తుందేమోనని వారు అభిప్రాయపడుతున్నారు ఇప్పుడు మన ఎదుట ఉన్నది ఇనాం గ్రామాల కంద్రిగలు శివార్లుకు సంబంధించినది వాటికి ఎస్టేటు అనే నిర్వచన వర్తింప చెయ్యాలనే ప్రతిపాదన ఇది ఈ విషయములో ఎందుకు అభిప్రాయభేదం వచ్చిందో తెలియదు ఈ బిల్లుతోనే ఇప్పుడే అదికూడ చర్చించకూడదా అనేవారి అభిప్రాయం కావచ్చును అదికూడా త్వరలో చర్చించవలెను అంటే దానిలో వేరొకవిధమైన చట్టబద్ధం అయిన సందేహాలు పరిశీలనలో ఉండబట్టి ఇప్పుడు చర్చకు తీసుకురాలేదు తిరిగి అధ్యక్షులవారి ఆమోదము పొందవలసి ఉన్నది ఈ రెండు సమస్యలు ఒకే బిల్లులో ప్రవేశపెట్టడానికి అవకాశం కన్పించలేదు సందేహానికి అధ్యక్షులవారి అనుమతికి అవకాశం లేనంతవరకు ఇప్పుడు చర్చ తీసుకుందామని ప్రభుత్వం ఇప్పుడు ఈ కంద్రికలకు శివార్లకు సంబంధించిన బిల్లు శాసన సభలో ప్రవేశపెట్టడము అయినది రెండవ సమస్య ప్రభుత్వం ఆలోచించి బిల్లు రూపములోపెట్టి అధ్యక్షులవారి ఆమోదమునకు పంపడమైనది ఆ బిల్లు వచ్చినప్పుడు సభ్యులు వారి అభిప్రాయము తెలిపి సవరణలు సూచించవచ్చును ఈ బిల్లుతోపాటు అదికూడా చర్చించి మొత్తం సమస్య పరిష్కారం చేసుకునే అవకాశం ఏమీలేదు ఈ కంద్రికలకు శివార్లకు ఎస్టేటు అనే నిర్వచనం చేయ

డంలో ఎవరికి సందేహంలేదు ఈ సమస్యను ఆలస్యం చేయ్యవలెను అనే ఉద్దేశము ప్రభుత్వానికి లేదు అని మనవిచేస్తున్నాను

SRI V VISWESWARA RAO — ప్రెసిడెంటు అర్డినెన్సు మళ్లా వెనుకకు పోవడంవల్ల ఇదివరకు రక్షణ ఉన్నవారికికూడా ఇపుడు లేకుండా పోతుందని నా భయము అది మంత్రిగారు అంగీకరిస్తారుకూడా

SRI B SANKARAIAH — కొన్ని లక్షల గ్రామాలకు నష్టం వస్తుంది

THE HON SRI G LATCHANNA — ఈ సెక్షను పోకుండా దానిఉద్దేశం అమలు పరచకుండా కోర్టులలో ఏమైనా నిర్వచనము జరుగుతుందనే సమస్య రాకుండా చూడవలెనని ప్రభుత్వము ఎక్కువ ఆతృతతో చూస్తున్నారని నేను మనవిచేస్తున్నాను

SRI P RAJAGOPALA NAIDU — కంద్రికలకు శివార్లకు వర్తింప చేస్తాము అన్నారు దానిలో భేదాభిప్రాయము లేదు గాని దానిలోనుంచి Substantial portions of inams తప్పిపోతున్నవి 100కి 99 పాళ్లు ఇనాంగా ఉన్న గ్రామాలుకూడా తప్పిపోతున్నవి కాబట్టి రైతులకు compensation ఇచ్చి తీసుకొనచూస్తారనే భయము ఉన్నది సభ్యులందరు చాలా జాగ్రత్తగా చూడవలెనని కోరుచున్నాను

SRI P NARASIMHAPPA RAO — అధ్యక్షా ఈ బిల్లునుగురించి ఇంతవరకు మంత్రిగారు సభ్యులుకూడా మాట్లాడారు గాని ఈబిల్లు ఎందుకోసము పెట్టబడింది అనిమాత్రము ఆలోచించవలసి ఉన్నది ఇదివరకే ఈబిల్లును కళా వెంకట్రావుగారు సెటలుచేసిఉంటే రాష్ట్రంలో ఇంతఅలజడి రైతులకు భుక్తలకు నష్టం ఉండేదికాదు అని మనవిచేస్తున్నాను తగవులతో రైతులు కష్టపడవలసిన అవసరం ఉండేదికాదు బొబ్బిలిరాజాగారుకూడా సగంవరకే తీసుకువచ్చారు కళా వెంకటరావుగారు రెండవసారి ఈబిల్లును తీసుకువచ్చారు రైతుకు భుక్తకు తగాదాలు లేకుండా settle చేస్తే బాగాఉండేది రైతులకు ఆశలేకుండేది భుక్తలకు compensation వస్తుందని సందేహం లేకుంటే కోర్టులకు వెళ్లేవారుకారు విశాఖపట్నం శ్రీకాకుళంజిల్లాలకు అగ్రహారాలలో తగాయిదాలు ఎక్కువగా ఉన్నవి 24 గంటలు యీ రైతులు కోర్టులకు తిరుగుతున్నారు Murder case లు జరిగిపోయినాయి జరుగుతూ ఉన్నాయి ఇది వదలించుదుమని మన చంద్రమౌళిగారు ఈ బిల్లు తయారుచేశారు రైతులకు భుక్తలకు నష్టము

లేకుండా చెయ్యడముకోసం రెండు సంవత్సరాలక్రితము బిల్లు తయారుచేసినారు జిల్లాలు అన్నీ తిరిగి విచారణచేసి బిల్లు తయారుచేసినారు దానిని సెలెక్టు కమిటీకి పంపించిన తరువాత దానికి ఏమి మర్యాద ఇచ్చారు మీయిష్టంవచ్చినట్లు నిరంకుశత్వంగా మీపార్టీ మీటింగులలోపెట్టి మీ ఇష్టానుసారంగా మార్పులు చేశారు ఏమి అవసరం వచ్చింది ? ఎందుకు సెలక్టు కమిటీకి పంపించారు ? దానికి ఇచ్చిన గౌరవము ఏమిటి ? సెలక్టు కమిటీ సిద్ధాంతం మీరు ఒప్పుకొనే పెట్టారు అయితే దానిగౌరవము ఏమిఉంచారు రేపుప్రొద్దున్న 2 వ బిల్లుతిసుకొనివస్తామంటున్నారు ఏ ఎకరాయో 80 సెంట్లో భూమివుంటే దానిలో మూడవవంతు ఎక్కడనుంచి తీసుకువచ్చి రైతుకు పట్టాఇచ్చి భుక్తకు పట్టాయిచ్చి జిరాయితీ మాదిరిగా శిస్తు వేసి 40 50 లక్షలు వారివల్ల తెచ్చుకుంటాము అనుకుంటున్నారు వారికోసం బ్యాంకులుపెట్టి డబ్బుయిచ్చి వారిని పొమ్మనండి ఎకరాఉందంటే మూడవవంతు రైతుకు యిచ్చి మళ్లీ తగవులు పెంచుతున్నారు అన్నమాట మీరు యిచ్చేది బాండ్లమూలముగా ఇవ్వండి రైతులను తొలగించేపద్ధతి చెయ్యవద్దు సెలక్టుకమిటీ తీసుకువచ్చిన ప్రకారం బిల్లు ప్యాసుచెయ్యండి అదే ఎక్కువ effect యిచ్చేది కంద్రికలుమాత్రము తక్కువగా ఉన్నాయి ఆబిల్లువచ్చేవరకు వేచివుండండి దానికి వచ్చిన తొందర ఏమిటి రైతులు భుక్తలను ఎలకబట్టి ఈడ్చేస్తుంటే మేము adjournment motions పెట్టినా మీరు జవాబు ఇవ్వకుండా ఉన్నారు

దీనిని గురించి నా మనవి ఏమిటంటే మీరుమొత్తము అంతా కలిపి తీసుకరాండి లచ్చన్నగారు రేపోనేడో వస్తుందని చెప్పారు వచ్చేదాకా ఇదికూడా ఉంచండి యీ రెండురోజులకు మీకేమి తొందర దీనిని ఎందుకు వేరుచేయాలి రెంటిని కలిపి ఏకముగా పెట్టమని నేను మనవిచేస్తున్నాను నేను ఇపుడు చెప్పేది ఏమిటంటే ఇపుడు తగవు settle కావాలి రైతులకు భుక్తకి తగవు పెరుగకూడదు దీనిని ఉద్దేశంలో పెట్టుకొని ఏవిధంగానైనా రైతును భూమినుంచి తప్పించే ఉద్దేశము లేకుండ చూడాలి 6 కోట్ల రూపాయలు అప్పుచేస్తున్నామని అంటారు మరొక 6 కోట్లు తీసుకురండి మీకు డబ్బు వస్తుందికదా ? మీ ఇంటిలో సొమ్ము యివ్వడము లేదు రైతును స్వాధీనమునుంచి తప్పించకుండా ఆ భూములను ఉంచండి అది నా కోర్కె అని మనవి చేస్తున్నాను చిరకాలమునుంచి మాగవర్న మెంటు వస్తుందని ఆశ పెట్టుకొన్న రైతు పొట్టకొట్టవద్దని నేను మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను

SRI A KALESWARA RAO —Select Committee Report కంటే ఇదే improvement ఎందువల్లనంటే portion of an inam village అన్నారు అనయు village కాని వారికి వర్తింపజేస్తున్నారు

SRI RAJA V V KRISHNAMARAJU BAHADUR —అధ్యక్షా ఇపుడు ఇంతవరకు మనముందు గౌరవనీయులైన రెవిన్యూ మంత్రిగారు ప్రతిపాదించినటువంటి యీ amendment Bill బాపతు ఇదివరకు 1936 సంవత్సరం లగాయతు అనేకరకాలుగా ఇటు భూకామందులకు అటు రైతులకు వుండేటటువంటి క్లిష్టసమస్యను పరిష్కరించి తత్‌రూపేణా యావత్‌జన ఆమోదంగా వుండేటట్లుగా సమస్యను పరిశీలించాలనే ఉద్దేశ్యముమీదనే మొట్టమొదట యీ బిల్లును యీ సభవారిముందు పెట్టడము జరిగింది ఇదివరకు Select Committee ఎన్నో స్థలాలువెళ్లి అటు భూకామందులు ఇటు రైతులు వ్రాతపూర్వకంగా చెప్పే విషయాలను సాంకల్యంగా చర్చించి తదుపరి 'దీనిని మనము ప్రజారంజకంగా చేయాలనే ఉద్దేశ్యముమీదనే యీ బిల్లు యీరూపంలో తీసుకొచ్చి యీరోజున సభావేదికపై ప్రతిపాదించారంటే కేవలము ఆధ్యాత్మిక చింతనారూపముతోటి అటు ఇనామ్‌దారు ఇటు రైతుయొక్క శ్రేయస్సు దృష్టిలో వుంచుకొని చేశారని మాత్రము నేను చెప్పుతున్నాను అంతేకాని బిల్లుయొక్క clause లలో మీరు ఆశయాలన్ని చెప్పలేదని వ్రాయలేదని నిర్ధీకరించలేదని ఉపన్యాసాలు మాత్రము అవి public లో కొంత సాయసంపదగా వుంటాయిఅనే తప్ప constitution of the Bill లో ఎంతమాత్రము లేదని చెప్పుతున్నాను ఈ ఇనాముల విషయాలు ఇదివరకే చెప్పివున్నారు ప్రప్రథమముగా బొబ్బిలి రాజాగారు తీసుకొచ్చారు - whole village inams అని చెప్పి దానితదుపరి మన Judicial Courts ఏమి చెప్పాయంటే whole village అంటే గ్రామమంతా ఐవుండాలన్నారు తదుపరి ఏమి జరిగిందంటే యీ కండ్రికలు hamlets portion of village ఏవికూడా Estates కావని నిర్వచన జరిగినపిమ్మట మొట్టమొదటి సూత్రం ప్రకారం grant యిచ్చినపుడు ఒక వ్యక్తికి పానగ్రామము లేక పానకండ్రిక అని యిచ్చిన గ్రామం కట్టబోయేసరికి ఆ గ్రామంలో రైతాంగము వున్నారు వారివల్ల సాగైన భూమికి grant పొందివున్నారు కాబట్టి 1908 Estates Land Act ప్రకారంగా కూడా యీ కండ్రికలలో hamlets లో వుండేవారికి కూడా యీ హక్కు సిద్ధించాలనే ఉద్దేశము మొట్టమొదటి సూత్రంగనే ఆ బిల్లు తీసుకరావడము జరిగింది దానికి విరుద్ధంగా ఇటీవల High Courts యిచ్చిన decision ప్రకారంగా ఎన్నోచోట్ల రైతులకు ఇక్కట్లువచ్చాయనే

ఉద్దేశముమీద అలాంటి లోపాలను సవరణ చేయడానికి ఈ బిల్లు వచ్చింది తప్ప మనఇష్టమువచ్చిన ఇనామ్‌ను ప్రతిదానిని తీసుకోవాలనికాదు ఈ బిల్లు యొక్క ముఖ్యసూత్రానికి విరుద్ధమనే ఉద్దేశంమీదనే యీరోజున కంద్రిక hamlet అని తీసుకొచ్చారు కాని మన members చెప్పినదానిలో substantial portion లేదని major portion లేదని ఆశలు మాకు తీరలేదని చెప్పుకున్నారు కాని యదార్థంగా చూస్తే ఆ substantial portion అని ఎప్పుడైతే యీ బిల్లులో పెట్టారో యీ బిల్లు Technical గా ultra vires కావుతుందేమో అప్పు ఎంతమాత్రము ఈ బిల్లు వర్తించదనే ఉద్దేశముమీదనే దానిని separate బిల్లుగా తీసుకొచ్చి ఆబిల్లును separate గా నిర్వచనచేసి తత్రూపేణా చేస్తామనే ఉద్దేశముతో ఈ substantial portion ను తీసివేశారు ఏదో రైతులకు బ్రహ్మాండమైనటువంటి కష్టనష్టము కల్గుతుంది వారికి చాల అన్యాయము చేశరని చెప్పడము మాత్రము 3 (2) (d) amendment యొక్క మూలసూత్రానికి విరుద్ధమనే విషయాన్ని తెలుసుకోకుండా మాట్లాడమనే విషయమును నేను హెచ్చరికచేస్తున్నాను ఈ బిల్లుకు amendment ఎందుకువచ్చిందో ఏసూత్రంప్రకారం వచ్చిందో అంతేచెప్పాలి Act XVII of 1955 ప్రకారంగా ఇదివరకు మనకుఉండే minor quit rent inams-కు మనము అసెస్సుమెంటు వేశాము తత్రూపేణా అవి రైతువారీగా convert అయిపోయినాయి అట్టిపరిస్థితులలో all inams అనడంవల్ల ప్రయోజనములేదు దానికి మరో contradiction వస్తుందనే ఉద్దేశము మిగనే substantial portion అంటే ఎక్కడ whole villageగా వుందో ఏదైతే wholeగా కంద్రికగావుందో ఏదైతే whole hamlet గా వుందో వాటివిషయంలో మనము కొంత ఇనామ్‌దారుకు సంకుచితపరుస్తూ కొంత రైతుకుయివ్వాలనే ఉద్దేశముతో తెచ్చినది మనప్రభుత్వముయొక్క వర్తమాన ఆర్థికస్థితిని చూచుకొని ఏరూపములోనైనా రైతుకు మనము అచిరకాలములోనే ఒకస్థాయిలో వాండ్లకు స్థిరత్వము కలుగజేయాలనే ఉద్దేశముమీదనే భూస్వామికి కీ రైతుకు కీ పెట్టాలని కొంతవరకు ఉద్దేశాలు వెల్లడిఅయినాయి అదిపెట్టాలంటే దూరదృష్టితో ఆలోచించుకొని అన్ని రకాల రైతులకు ఆర్థిక స్తోమతు చేకూరుస్తూ స్థిరత్వము కలుగజేయాలనే ఉద్దేశము మీదనే కాంగ్రెసు గవర్నమెంటు ఎన్నోవిధాల చర్చించి సాకల్యమైన కృషితో చేసింది తప్ప వేరే ఉద్దేశంలో చేసిందికాదు ఏరూపములో ఏస్థాయిలోచేస్తే ప్రజారంజకంగా వుంటుందనే ఉద్దేశముతప్ప వేరేమికాదు Social Justice అంటే మాత్రము ఒక వ్యక్తి యొక్క ఆ స్తిని కొన్ని వందలమందికి సరఫరాచేయడము That is social justice అంతేకాని 10 మంది ఆస్తిని 20 మందికి పంచిపెట్టడము social justice కాదు

ఆస్థాయిలో చూచుకోవాలి ఇనాందారులు ఎవరో ఒకరిద్దరుకాదు లక్షలాదికుటుం బాలతో వున్నారు కాగా 1862 సంవత్సరంలో Regulation 31 ప్రకారంగా ఇనాందారు అనుభవిస్తూవుండే యీ హక్కును యీరోజు యీ శాసనముద్వారా రైతుకుహక్కు యిస్తున్నామంటే అది ఎంత శోచనీయమైన విషయమో మీరు కూడా ఆలోచించుకోండి ఆలాంటి పరిస్థితులలో యీరోజున గవర్నమెంటు జాగ్రత్తగా రైతులయొక్క శ్రేయస్సు ప్రధానంగా పెట్టుకొని యీబిల్లు పెట్టా రంటే సంతోషించాలి Criticise చేయడము మాత్రం సులభమే ఇనాములు ఎన్నిరకాలుగా వున్నాయి ఏ పరిస్థితులలో పుట్టాయి అనేదానిని గురించి ఆలో చించాలి ఈ ఇనాములను యీబిల్లు ద్వారా మనము నిర్వచన చేయాలనే విషయము తెలుసుకుంటే మాత్రము యీ చర్చ ఇంతవరకు జరగదని నేను మనవి చేస్తున్నాను అట్టి పరిస్థితులలో యీబిల్లు విషయంలో అన్ని విధాల యోచించి బిల్లును గురించి మీరు ఎక్కువగా చర్చించకుండా ఏకగ్రీవంగా ఆమోదించాలని మాత్రము నేను కోరుతున్నాను రేపు రాబొయ్యే బిల్లు విషయంలో కూడా మీ ఉద్దేశాల ప్రకారంగా చేస్తున్నారు ఈ బిల్లును ఆ బిల్లును కలిపి ఎందుకు చేయి కూడదని అడుగుతున్నారు నేనొక్కటే చెప్పదలచుకున్నాను ఇప్పటికైనా తెలుసుకోవాలి ఈ బిల్లు కండ్రికలకు Hamlets కు సంబంధించినదితప్ప మీరు అనుకొన్న బిల్లుకు సంబంధము లేదు అలాకలిపితే యీబిల్లు కూడా పోతుందని మాత్రము నేను చెప్పుతున్నాను రెంటిని కలపడానికి ఏపరిస్థితులలోను వీలుకాదు ఆ బిల్లును వేరే రూపములో తీసుకొని రావాలి దాని స్వభావమేవేరు దీని స్వభావము వేరని చెప్పుతున్నాను 3 (2) (d) amendment లో కలిపారంటే యీ బిల్లే పోతుందని చెప్పుతున్నాను అసలు legal advice తీసుకొని అన్నివిధాల చూచుకొని యీ రూపములో చేయాలనే ఉద్దేశముతోనే చేసినది కాని ఇనాం దారులకు రక్షణ యివ్వాలనే ఉద్దేశంతోకాదు ఇప్పటికైనా తెలుసుకోవాలి కారణమేటంటే యీబిల్లు ముఖ్యసూత్రానికే విరుద్ధం 3 (2) (d) amendment కోసము బిల్లు పెట్టుతూ all inams కు పెట్టండి అంటే ఈ బిల్లుకూడా పోతుంది కనుక దానిని బాగా తెలుసుకొని చర్చించమని, యీ బిల్లును ఏకగ్రీవంగా ఆమో దించాలని సభ్యులను కోరుతూ విరమిస్తున్నాను

**SRI VAVILALA GOPALAKRISHNAYYA** —అధ్యక్షా మనం మొట్టమొదట 1908 Act లో ఇనాములు నిర్వచించినపుడు అది చాలలేదని అనుకోవడం జరిగింది నిజంగా కొంతవరకు అన్యాయం దానిలోనే ఉంది కాని రైతుకు పూర్తిగా ప్రయోజనం జరుగదనే కారణంతోటి 1936 సంవత్సరంలో

బొబ్బిలి రాజాగారు మంత్రివర్గంలోకి వచ్చినప్పుడు ఆయన కొన్ని కారణాలు పెట్టుకొని ఒక మంచిపనిమాత్రం చేశారు మొత్తంమీద ఆ శాసనం చేయడం అనేది మంచిది కాని తర్వాత శ్రీ కళా వెంకట్రావుగారి రివిన్యూ మంత్రిత్వంలో చాలా ఉత్సాహపూర్వకమైనటువంటి బిల్లు తీసుకొని వచ్చారు కాని ఆ బిల్లులో ఇది తప్పకుండా వస్తుంది అని అనుకొన్నారు కాని ఆ సందర్భంలో ఒకటి జరిగింది శ్రీ ప్రకాశం పంతులుగారు Estates Lands Act ను గురించిన సమన్వయ రిపోర్టులో అంతకుముందు ఉన్నటువంటి ఆక్టును 1936 Act ను మినహాయించవలసిందని కోరారు ఆ మినహాయింపే దీంట్లో కోరబడ్డది అయితే అప్పుడు మేము అనుకొన్నది వారికికూడ జ్ఞాపకం ఉండిఉంటుంది పెద్ద సమావేశం జరిగింది ఆ సమావేశానికి వచ్చినందుకు వెంకట్రావుగారిని తక్కినవాండ్లంతా కూడా విమర్శించారు ఇతరులతోటి కలసిపోతున్నారు చిన్న రైతాంగంతో కలుస్తున్నాడు వాండ్లందరికి అన్యాయం చేస్తున్నారు మేమంతా మాకు అండగా ఉంటాడు అనుకొన్నాము అన్నారు కాని తీరావచ్చేటప్పటికల్లా ఆ విషయంమాత్రం exclude చేశారు 9 వ సెక్షనులో ఏవి వస్తాయో వివరంగా చేర్చారు ఆ ఇనాములు ఏవేవి వస్తవి అని చెప్పినపుడు వాండ్లకై వాండ్లే settlement officer తానే తీసుకోవాలి తీసుకొని విచారణచేసి ఇది ఇనాము కాదు అని చెప్పాలి (ఇది estate అవునా కాదా అని) Inam అనేది వెంకట్రావుగారు చెప్పినట్లు చిక్కు వస్తున్నది గుంటూరు జిల్లాలో మినహాయిస్తే ఇంకా కొన్ని జిల్లాలలో తప్పితే సామాన్యంగా Inam అంటే గ్రామపు ఇనామున్ను ఇనాంగా ఇచ్చిన పొలాన్ని లెక్క కట్టుకొంటున్నారు గుంటూరు జిల్లాలోమాత్రం అగ్రహారం అంటే గ్రామానికి చెందినటువంటి ఇనాముకు అన్వయిస్తారు ఇనాం అంటే విడిగా ఇచ్చినటువంటి ఇనాం మాత్రమే అవుతుంది అందువల్ల మాకు అర్థంచేసుకోవడంలో అంత పేచీ లేకుండా పోయింది తక్కినవాండ్లకు అనుమానాలకు చోటు ఇస్తుంది ఇంతవరకు మనం చర్చ చేస్తున్నది ఇనాముల విషయం కాదు ఇనాం గ్రామాలవిషయం అనిమాత్రం ఖచ్చితంగా జ్ఞాపకం వుంచుకొంటాం అయితే ఎప్పుడైతే ఈ estate అన్వయం అవుతుందని చెప్పారో దానిమీద చాలాకోర్టులలో (దీనితోపాటు ఇంకొకటి చెప్పారు) ఏదైతే ఇనాములు అవుతాయని అనుకొంటారో అవిఅన్నీ rent reduction క్రింద declare చేసివేశారు ఇదిచాల సుముఖమైనటువంటి పరిస్థితి Rent reduction క్రింద ఎప్పుడైతే అన్వయించారో Rent reduction declaration ఇచ్చారు Rent reduction అమలుజరుపుతున్నారు అవునా కాదా తేల్చుకోవలసి ఉన్నది అగ్రహారందారున్ను రైతులున్ను

తేల్చుకోవలసి వచ్చింది కాని తీరా చూచేటప్పటికల్లా కోర్టుదగ్గరకు వెళ్లినపుడు కూడ కోర్టులతోటి ఏమిచెప్పినారంటే మీరు declaration ఇవ్వటానికి అవకాశం ఉంది కాని తీసుకొనడానికి ఇవ్వడానికి అవకాశంలేదు అయినప్పటికిన్ని ఆ గ్రామా లన్నీ కూడ Revenue గ్రామాలు అవుతాయి ఇనాంగ్రామాలు కావు అనిచెప్పారు ఈ Act అన్వయించడానికి మాత్రం ఇనాంగ్రామాలు కాకుండా పోతాయి అనే బాధవచ్చింది దాంట్లో ఒక ప్రధానమైనసమస్య వచ్చింది 3 (2) (d) అన్నపుడు ఇనాములకు whole ఇనామా small ఇనామా అనివచ్చింది తర్వాత Advisers time లో ఒకసమస్య వచ్చింది అపుడు Rutherford గ ఉన్నాడు పోయి చెప్ప నపుడు all tenures అని పెట్టమని అడిగారు ఇది కొంతవరకు సులువుగా ఉంటుందేమోఅని all tenures పెట్టండి అన్నారు కాని all tenures పెట్టితే చాలప్రమాదం వస్తుందనే భయంతోటి చివరకు పెట్టలేదు ఒకదాంట్లోమాత్రం పెట్టారు Grow more food campaign కోసం అని ఇతర ప్రాంతాలలో కూడ సాగుచేసేటట్లయితే ఆ సాగుచేసే పొలంకు డ మళ్ళీవాండ్లు ఎల్లకాలం హక్కు కోరేది కాకుండా తాత్కాలికపు పరిణామంకోసమే ఇస్తున్నామని చెప్పారు All tenures కు పెట్టడానికి ఒప్పుకొంటామేగాని దీనికిమాత్రం పెట్టడానికి మేము ఒప్పుకోమని చెప్పారు ఆరోజు ఉన్నటువంటి బలం అగ్రహారందార్లది పైగా కళా వెంకట్రావుగారికి కూడ జ్ఞాపకం ఉండిఉంటుంది అది first line of defence జమీందార్లుఅంతా కూడాను అగ్రహారందార్ల చేత నడపను మొదలు పెట్టారు జమీందారీ బిల్లును తూట్లు పొడవడం ఎట్లాగుఅంటే తాము దూరంగా కూర్చొని అగ్రహారందార్లను ముందుకు నెట్టినట్లయితే దీని మీద ప్రమాదం అవుతుంది గనుక అసలు మేమంతా వస్తే మొత్తంపోతుం దేమో అని శ్రీ కళావెంకట్రావుగారు ప్రయత్నించి ఆనాడు వెనుకకు తగ్గకుండా బిల్లును ముందుకు నడిపారు ఆనాడు వారిని అభినందించాను ఈనాడు అభినందిస్తు న్నాను కాని అన్వయంలో వచ్చినటువంటి చిక్కును తర్వాత అమలులోనికి రాక పోయ్యేటప్పటికి చాలా చిక్కువచ్చింది అందువల్ల బాధపడుతున్నామని తెలుసు దానికి ఈవేళ ఒక select committee వచ్చింది ఆ కమీటీ ఏమని నిర్ణయం ఇచ్చింది ఆ నిర్ణయం వేదవాక్యంగా తీసుకొనవలెనా అంటే సాధారణంగా తీసు కొనడం సాంప్రదాయం Act విధిగా తీసుకోవాలంటే మళ్లీ Act చేయనక్కరలేదు వాండ్లది Act అయ్యేది కానిదానికి ఎప్పుడైతే select కమిటీకి వేశారో అప్పుడు దానిని వ్యతిరేకించిన precedent లు కూడా ఉన్నాయి ఒక కమిటీ ప్రెసిడెంటు మెజారిటీ అభిప్రాయానికి ఒప్పుకోకుండాపోతే తాను dissent వ్రాసుకొని,

majority తనకు వ్యతిరేకంగా ఇచ్చినా ఒప్పుకొంటుందా ? దాని అభిప్రాయం ఏమిటి ? ఇది సామాన్యంగా మీరందరుకూడకలసి ఇంతచర్చచేసే బదులు ఒక select కమిటీ అన్నిభావాలకు సంబంధించింది ఇచ్చాము వాండ్లు అమలు జరుపండి అని చెప్పారు అందువల్ల అదే మేము అమలుజరుపాలని మా మిత్రులు శ్రీ క్రిష్ణంరాజ బహదూరుగారు Sri Raja Sagi Suryanarayana Raju గారు అన్నారు అదిమాత్రం సాంప్రదాయసిద్ధంగా మాట్లాడలేదని మనవిచేయాల్సిన అవసరంఉంటుంది సాంప్రదాయంగా కమిటీని వేసినపుడు ఆ కమిటీ నిర్ణయం అమలుజరపాలి తర్వాత 2 వ సమస్య వచ్చేటప్పటికల్లా select కమిటీ రిపోర్టు ఇచ్చారు ఆ కమిటీ రిపోర్టును మనము అన్వయముచేసుకొని ఏమిచేదాము అని

SRI RAJA SAGI SURYANARAYANA RAJU — తాము సాంప్రదాయమని సెలవిచ్చారు సాంప్రదాయం అన్నట్లయితే మరి ఇక పద్ధతి ఏమిలేదా ? సాంప్రదాయమే కావాలా తమకు ?

SRI VAVILALA GOPALAKRISHNAYYA — పద్ధతి సాంప్రదాయం రెండు ఒకటే మీరు నిలబడి మాట్లాడండి కాకపోతే మనమిద్దరం తర్వాత మాట్లాడకుండా చూచుకొందాం

ఆతర్వాత ఈ కమిటీ report వచ్చింది ఇప్పుడు రిపోర్టులో ఇచ్చినటువంటిది ప్రధానంగా రెండుభాగాలుగాఉన్నాయి ఒకభాగంవరకు మనంఇపుడు అన్వయం చేసుకొని మరొకభాగాన్ని వదలిపెట్టితే బాగాఉంటుందన్నారు ఆవిధంగా గవర్నమెంటు amendment తెచ్చింది ఇపుడు ఒకసమస్య గవర్నమెంటు amendment రూపంగా తెచ్చినదానికి తర్వాత amendment తేవడానికి వీలుఉందా ? Substantial రూపం అయినట్లయితే బాధలేకుండాపోయేది అంతకుముందు ఉన్నటువంటి proposition మీద మీరు amendment తీసుకొనివచ్చేటప్పటికి, ఇతరులకు మార్పుచేసేటటువంటిస్థితి ఒక anamolous position తయారుచేసి ఉంచారు అంటే శాసన సభ్యులకు ఒక శాసనంలో ఉండేటటువంటి మార్పును తీసుకొనిరావటానికి అవకాశంలేకుండాను అటు select కమిటీ చేసినదానిని తలక్రిందులుగా చేసినారు ఇది తలక్రిందా అంటే పూర్తిగాకాకపోవచ్చు శ్రీ వెంకట్రావుగారు చెప్పిన వివరంప్రకారంగా దీంట్లో రెండురకాలున్నాయి కంద్రికలుఅనిఉన్నాయి Whole Inams లేకపోతే కొన్నిఇనాంలు ఇవిఅన్నీ ఉన్నాయి వీటి definition లో చాల చిక్కులు వస్తున్నాయి. ఆచిక్కు వచ్చినపుడు ఈకంద్రికలకు వాటికి అన్వయం కాలేదనే అభిప్రాయంతోటే, 3(2)(d) మార్చాలి అని అనుకొన్నాం ఇదికాకుండా

కోర్టులలో పరిష్కరించిన సమస్యలు ఉన్నాయికదా ? వాటినిగురించి మనం ఏమీ చేయలేముగదా! వాటికిసంబంధించినటువంటి Act కు అన్వయం వేరేఉంది అందుకు మేము వేరేబిల్లు తెస్తామని చెప్పుతున్నారు మీరు వేరేబిల్లు తెచ్చేటట్లయితే ఈ వేళ select కమిటీకి పంపించండి ఈ రెండు subjects కూడ పంపించారు Select కమిటీ రెండు subject ల మీద అభిప్రాయంఇచ్చింది రెండు subject లు select కమిటీకి పంపించిన తర్వాత అది నిర్ణయం ఇచ్చినతర్వాత ఒక subject మాత్రమే ఈ select committee కి అనుకూలంగాఉంచివేసి రెండో దానికి మరొకనాడు అన్వయం చేయబోతున్నాం అని చెప్పగలిగినస్థితి వచ్చినపుడు నాఅభిప్రాయం ఏమంటే మళ్లీ ఇది select కమిటీకి recommit చేసేసి మళ్లీ devide దానికి సంబంధించినటువంటి బిల్లు ఈవిధంగా తీసుకొనివస్తున్నాము మరొకదానికి సంబంధించిన బిల్లు ఈ విధంగా తీసుకొనివస్తున్నాం గనుక ఈ మొత్తంకూడ సమన్వయం ఐపోవడానికి వీలుఉంది కనుక మేము ఒకటి execute చేయలేదు అనండి Select Committee మొదట ఏది reference ఇచ్చారో ఆ reference ప్రకారంగా నే నడిచింది మళ్లీ వచ్చిన మార్పులలో ఇది ఇంకా ఉపయోగపడటానికిగాని అనుపయోగపడటానికి కాదు కనుక దానియొక్క ప్రయోజనం ప్రజలకు వస్తుంది గనుక దానిని మేము ఉపయోగ పరచమని చెప్పేది correct గ ఉండేది అందుకోసమే నేను ఈనాడు మళ్లీ select కమిటీకి recommit చేయండి అని చెప్పడం జరుగుతున్నది కళా వెంకట్రావుగారు Revenue మంత్రి శ్రీ చంద్రమౌళిగారు ఒక విషయం చెప్పారు మేము Central Government కు వ్రాశాం రాష్ట్రపతి ఆర్డరులకు ఎదురు చూస్తున్నాం ఇన్నాళ్లనుంచి వచ్చిన చిక్కు ఇక్కడే వస్తున్నది ఒక Act చేసే ముందు అక్కడనుంచి ఆర్డరువచ్చేలోగా దాంట్లో హైకోర్టో మరో కోర్టో నిర్ణయం అయిపోతే దానిని మనం ముట్టుకోడానికి వీలులేదు Retrospective effect తీసుకొనివస్తే సరిపోతుంది కదా అని ఇందాక చెప్పారు నిజమే Retrospective effect ఎందుకు ఉపయోగపడుతుంది ? ఈ రోజువరకు కోర్టులలో తేలకుండా పేచీలు పడుతున్నాం కోర్టులకు వెళ్లినతర్వాత కోర్టులు ఒకసారి నిర్ణయం ఇచ్చినతర్వాత దానిని మార్చగలిగినస్థితిలో ఉన్నామా అని అడుగుతున్నాను మార్చగలిగిన స్థితిలో తయారు అవుతుంటే దీనినుండి తప్పించుకొనిపోయిన ఇతరులు ఉన్నారే వాండ్లకు రక్షణ ఇవ్వడం అవసరం అని select కమిటీ, ప్రభుత్వం అన్నీకూడ నిర్ణయించుకొని ఒక నిర్ణయానికి వచ్చిఉన్నవి దానిని జారగొట్టివేస్తే ఆ రైతాంగంయొక్క ప్రయోజనం ఏమి అవుతుందని మనవిచేస్తున్నాను ఇది ఆలస్యం అయిపోతే నష్టంకాదా వారికి మాకుకూడా ఆలస్యం కావాలని కోరిక

లేదు మంత్రిగారు చెప్పినట్లు ఆలస్యమైనందుకు వారికన్నా జనం ఎక్కువ బాధ పడుతున్నది వారు త్వరగా చేయడానికి ఎంత బాధపడుతున్నారో ఆలస్యం అయిపోయినందుకు జనం అంత అన్నీ అధికంగా బాధపడుతున్నారు అందువల్ల దానిని త్వరగా తీసుకొనివచ్చే ప్రాతిపదిక ఏమైనా ఉన్నట్లయితే చేయడానికి వీలుంటే వెంటనే చేయాలి లేదంటారా ఆ బిల్లు రూపం ఎట్లా ఉంటుందో చెప్పండి ఆ బిల్లు ఏరూపంలో వస్తుందో తెలియదు ఒక అగ్రహారం ఉంటే దానికి ఒక కండ్రిక ఉన్నది ఉన్నది అనే పేరుతోటి ఉన్నదానిని మీరు ఇపుడు సమన్వయం చేయగలుగుతున్నారు అగ్రహారం అనే వ్యవహారం ఇంకా పేచీలో ఉన్నది వాండ్లకు ఒక నిర్ణయం చేయబోతున్నారు ఇపుడు ఏదీకాకుండా కోర్టులో తేలవలసినవి చాలా ఉన్నాయి వాటిని నిర్ణయిస్తామా ? రేపు వచ్చే Act లో కోర్టు నిర్ణయించిన తర్వాత నే తీసుకొంటామా ? నేను ఉదాహరణంగా గరికపాడు చెప్పుతాను

నేనుఉదహారణకు చెపుతాను Concrete గా చెప్పితే త్వరగాతేలుతుందేమో గరికపాడుఅనే అగ్రహారంఉన్నది అగ్రహారంవాళ్లు ఏమని contest చేస్తున్నారంటే మాదిమొత్తంకూడా Whole Inam గనుక అది మాది అని చెప్పారు దానితోటి వాళ్లకు రెవిన్యూవాళ్లకు తగాదాలు ఏర్పడ్డాయి Revenue Department అక్కడ strong గా ఉంది దానికి నేను అభినందించాల్సిందేతప్ప మరేమీలేదు అయితే ఇప్పుడు వారు కోర్టుకు వెళ్లినప్పుడు Rent reduction ఉన్నదానినేమన్నా evict చెయ్యమని అగ్రహారంవారు వ్యాజ్యంతెచ్చారు కనుక దానికి Government contest చేస్తున్నది ఈ contest చేస్తున్న సమయంలో పిల్లచేతుల్లో పొలంఉన్నది ఎంతసేపటికీ contest చేస్తున్నది Rent reduction మీదనేగానీ వేరుకాదు Tribunal ఒక decision న్ను ఇచ్చివేశారు ఆ ట్రిబునల్ decision ను ఇచ్చిన తర్వాత రెంటుమీద Madras Government లో ఆ decision మీద ఇదేబిల్లు వచ్చింది అసలు ఏమిచెప్పారు అంటే Rent reduction ను మనము చేశాం దీనిని evict చేయడానికి మనకు అధికారం లేకుండా పోతున్నది High Court నోటీసు ఇస్తున్నది జిల్లా కోర్టు నోటీసు ఇస్తున్నది మీరు ఖాళీ చెయ్యమని చెప్పేసి మనంఖాళీ చేయకుండా డబ్బు వసూలు చేయడానికి అధికారం లేకుండాఉన్నది లేకపోతే దానిమీద పెట్టుకోవడానికి అవకాశంలేకుండా మనకు ఉన్నది బిల్లు evict చేయడానికి వీల్లేకుండాఉన్నది కనుక ఆరోజు లచ్చన్నగారు మేముఅంతానిలబడి ఆబిల్లునేమో పడగొట్టాం ఇదిమాత్రం అమలు జరుగకుండా పోయింది Voted down కావటంవల్ల withdraw చేశారు అందువల్ల Rent

reduction ఉన్నదేకాని దానిని మీరు contest చేసేదానికి వీలున్నదేగాని అను ట్రిబ్యునల్ ప్రకారంగా అమలు జరుగకపోయింది అందువల్ల నేను మనవిచేసేది నేను ఈవేళతోనే ఈజరిగే ప్రయత్నం పూర్తిగా ప్రయోజనకరంగా జరగాలిఅంటే మళ్లీ దీనిని select committee కి పంపించి అన్వయంగా తేడా ఏమివచ్చిందో దాన్నికూడా అన్వయంచేసుకొని రెండు Acts నీ వెంటనే తీసుకువచ్చి అమలుజర పాలి లేకపోతే ఇంకొకటి ఉంది క్రిందటి నెల 10 వ తారీఖునాడు గవర్నరు గారు ఒక ఆర్డినెన్సును జారీచేసినారు Tenants కు protection ఇస్తున్నామని చెప్పారు ఇప్పుడది ఈ Act క్రిందకు రాకపోయేటట్లయితే మనకు ఇంకొక Act ఏమిఉన్నది ఈ వేళమనకు ఉన్నదేమో మూడు Tenures ఒక టెన్యూరేమైనా జమీందారీ టెన్యూరు ఇది అయిపోయింది రెండవది ఎమిటంటే ఇనాంటెన్యూరు మూడవటెన్యూరు రైత్వారీది జమీందారి టెన్యూరు పూర్తిగానే పోయింది మిగిలిందేమైనా అగ్రహారంటెన్యూరు లేకపోయేటట్లయితే రైత్వారిటెన్యూరుంది మీరు వాటిని క్లియరుగా చెప్పటంలేదు అగ్రహారం టెన్యూరు కాకుండావచ్చినటు వంటిదేమన్నాఉంటే గవర్నరు ఆర్డినెన్సు క్రిందనే వస్తుందంటారా ? రాదు అని మీకు అనుమానంగానే ఉన్నది అదివస్తుందని మీకు నమ్మకంఉన్నట్లు అయితే దాని క్రిందేతీసుకొని వచ్చేవాళ్లు అయితే Disputed estate tenant అన్నాకావాలి లేక పోతే undisputed రైత్వారీ tenant అయినాకావాలి రెండు tenants కాక మూడవ tenant ఉన్నారనిమీరు ఒప్పుకొంటున్నారు మూడవటెనెంటు ఉన్నప్పుడు అతనికి రక్షణ ఎక్కడనుంచి వచ్చింది? అందువల్లదానికి సంబంధించిన Act ను తీసు కొనివచ్చినప్పుడే చేస్తే బాగుండును సమగ్రంగా మళ్లీ select committee కి విచా రణ చేయటానికి వేయమని నేను recommitment కు కోరడానికి కారణం అదే

SRI N P CHENGALRAYA NAIDU —అధ్యక్షా ! ఇప్పుడు ఇనాం గ్రామాల రద్దు చట్టానికి amendment ను మాత్రం తెచ్చినామని శ్రీ కళా వెంకట్రావుగారు సెలవిచ్చారు Select committee కి పోకముందు amend ment ఏ రూపకంలో ఉండిందో ఆ రూపంలోనే శాసనసభముందు ప్రవేశపెట్టి నారు మునుపు Select Committee చేసిన సిఫారస్సుల నన్నిటినీకూడా అమలు పరచకూడదు అని ప్రభుత్వానికి అభిప్రాయంలేదు అవి అన్నిటినీకూడా అమలు పరచాలనే ఉన్నాం అయితే అదివేరే బిల్లుగాతెస్తాం అని మన రివిన్యూమంత్రి గారు సెలవిచ్చినారు ప్రస్తుతం మన ఎదురు పార్టీవాళ్లు సందేహపడుతున్నారు ఎందుకంటే ప్రభుత్వం ఇప్పుడు ఈ amendment ను తెచ్చినారు మరల ఇంకొక అమెండుమెంటో మిగతా ఇనాములన్నీ రద్దయి పొయ్యేందుకు బిల్లో ఏమైనా తెస్తారో లేదో అనేసందేహం వారికిఉంది అలా సందేహించనవసరంలేదు ఇంకొక

Sri N P Chengalraya Naidu] [14th August 1956

బిల్లును తెస్తామని మన మంత్రిగారు సెలవిచ్చినారు ఇప్పుడు ఈ amendment ను ఈ సభవారు అంగీకరించినామంటే ఇదివరకు ఇనాం రైతులకున్న protection పోతుంది వారి నందరినీకూడా భూములనుండి వెడలగొట్టడానికి అవకాశం ఉందనే సందేహం అందరికీఉంది Tenancy Act pass అయ్యేందుకు కొద్ది కాలం పడుతుంది ఇంతలో ఈ Amendment pass అయితే మిగతా రైతులందరికీ కూడా కష్టం కల్గుతుంది అందువల్ల వారికి ఏదైనా సహాయం చేయవలసిఉంటే ఈ దినం మనం దీనిపైన చర్చను పూర్తిచేయకుండా కొద్ది రోజులు వాయిదా వేయాలనిమాత్రం నేను ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను

వాయిదా వేసనట్లయితే Tenancy Bill pass అయినప్పుడు ఇనాం రైతులందరికీకూడా protection వస్తుంది పోతే ఇక కొత్త బిల్లు ఏ యాపంలో ఉంటుందో అనే సందేహంకూడా కొందరికి వుంటుంది కొత్తబిల్లు కూడ ప్రభుత్వంవారికి అందరికి న్యాయం కలిగేటట్లు చెయ్యాలనే అభిప్రాయం ఉంది ఏదోఒక్క కొద్దిమందికిమాత్రం ఈ రైతుల నందరినీ ఉద్ధరించాలని ప్రభుత్వ పక్షంలో ఉండేవారిని ఉద్ధరించకూడదు అనే అభిప్రాయమేమీ లేదు సాధ్యమైనంతవరకుకూడా మరల కోర్టులలో ఏలాటి తగాదాలు లేకుండా రైతులకు సహాయం చెయ్యాలనే ప్రభుత్వంవారి ఉద్దేశం అందువల్లనే మరొక సక్రమమైన బిల్లును శీఘ్రంలోనే ప్రవేశపెట్టతామని ప్రభుత్వం వారు చెప్పినారు అయినా శీఘ్రంలో ప్రవేశ పెట్టుతామన్నారుగానీ ఎప్పుడు? ఈ Assembly sitting పూర్తి అయ్యే లోపలనా ? లేక ఈ session పూర్తి అయ్యేలోపలన ? లేక మనం హైదరాబాదుకు వెళ్లినతర్వాతనా అనే సందేహంమాత్రం ఉంది 'అంతకుముందే అని అన్నారు అంతకుముందే బిల్లును పెట్టబోతున్నారుకాబట్టి అటువంటి సందేహాలకు తావులేకుండా ఈ amendment ను మనస్ఫూర్తిగా అంగీకరించాలని కోరుకున్నాను ఈ amendment ను పూర్తిగా మనం అంగీకరించేముందు దీన్ని వాయిదా వేయాలని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను

SRI SHEIK MOULA SAHEB — అధ్యక్షా మంత్రిగారు తెచ్చిన ఈబిల్లును నేను హృదయపూర్వకంగా బలపరుస్తూ మొత్తంమీద ప్రతిపక్ష పార్టీలు ప్రతిదానికీ విమర్శించకుండా ఈబిల్లులో చేసినటువంటి ధర్మమూ న్యాయమూ అయిన దేశసాంప్రదాయాన్నీ దృష్టిలో పెట్టుకొని మొత్తంమీద దీనిని విమర్శించకుండా పూర్తిగా బలపరుస్తారని ప్రార్థిస్తూ నేనుకొన్ని సూచనలనుకూడా చేయదలచాను ఇనాంఅనగా దానంగా ఇవ్వబడినవి ఆ దానమే ధర్మం ఈనాడు శ్రమదానా లంటున్నారు కానీ వాళ్లు శిస్తువసూలు చేసుకొనేటటువంటి రుసుములు

హక్కులనుమాత్రం వారు ఆనాడు పొందలేదు అటువంటి ఇనాములను వారు చేయలేకనో లేక బలంలేకనో మనుష్యుల బలంలేకనో వ్యవసాయి పరికరాలు లేకనో ఇతరత్రా చేసుకొనేవాళ్లకు కోరుకు కవులుకూ ఇచ్చుకొన్నారు ఇచ్చుకొన్నంత మాత్రాన ఈనాడు మధ్యవచ్చిన వానికే భూమి సంక్రమించాలనేది నిజంగా అది ఎంతవరకు సమంజసమో అదికూడా ఒకరకంగా దృష్టిలో పెట్టుకొని ఇనాందారుడు కూడా ఇంతకాలాన్నుంచి అనుభవించనటువంటి భూమిని — ఈనాడు మన ప్రతిపక్షపార్టీలు ఒకదశన భూ సంస్కరణములను జరిప భూములు లేనివారికి భూములను ఇప్పించమని కోరుతున్నారు— ఉన్నవారికి భూమిలేకుండా వారిని landless poor చేయమని చెప్పేవిధానం ఏమాత్రం న్యాయమైనది కాదేమో Landless poor కాకుండా ఇనాందారులకు కూడా కొంతభూమి ఉండాలనేది దృష్టిలో పెట్టుకొని ఈ కమిటీ రిపోర్టునుబట్టి వారికి పరిహారమనేది ఇచ్చి లొత్తిగా ఈ landless poor గా చేసేదానికంటే వాళ్లభూముల మీద వాళ్లహక్కు ఎంతవరకు ఉండాలి? వాళ్లకుకూడా కుటుంబం ఉన్నది వాళ్లు కూడా జీవించాలి వాళ్లుకూడా భూములద్వారా బ్రతుకాలి అనే ఉద్దేశ్యం పెట్టుకొని ½ భూమిని ఇనాందారున కుంచారు ½ సాగుచేస్తున్న రైతాంగానికి ఇచ్చారు కాబట్టి ఇనాందారులకు పరిహారం లేకుండా ½ భాగం ఇవ్వడం న్యాయమని నేను బలపరుస్తున్నాను

SRI L LAKSHMANA DAS — అధ్యక్షా! ఈనాముల సమస్య 1936 సం నుంచి వుంటున్నది ఈ సమస్య ఎప్పుడు పరిష్కారమయ్యేది తెలియకుండా వుంది Select Committee లో ఈ బిల్లును ప్రవేశపెట్టినప్పటికీ ఏకారణంచేతనో గాని పరిష్కారం కావటం లేదు Section 3 (2) (d) లోవున్న defect వల్ల కోర్టులో కొన్నింటికి మార్పులువచ్చి estates అని declare అయినవి కూడా తిరిగి అవి estates కాదని High Court, Supreme Court లు యిచ్చిన తీర్పులను మనం మళ్లీమార్చాలి ప్రజాశ్రేయస్సుదృష్ట్యా మొదట ఈబిల్లును తీసుకు వచ్చాము కోర్టువారిచ్చిన తీర్పులు ఆ ఉద్దేశ్యానికి వ్యతిరేకంగావున్న కారణంచేత రైతులకు న్యాయం కలుగజేయాలనే ఉద్దేశ్యంతో మళ్లీ యీ బిల్లును తీసుకు వచ్చాము ఈ బిల్లును ఇప్పుడు 2 భాగాలుగా విభజించాము 2 బిల్లులు కూడా ఇప్పుడే వస్తాయని ఆశించాము కాని 2వ బిల్లు వచ్చుటకు కొంత ఆలస్యంఅవుతుంది అంటున్నారు ఈ బిల్లుకంటే రేపు తీసుకురాబోయే బిల్లు ప్రధానమైనదని ప్రభుత్వంవారు సభ్యులుకూడా గ్రహించాలి ఏవిధమైన అభిప్రాయభేధాలు వచ్చాయో దానికి ఏవిధమైన grant యివ్వలేదనే కారణంచేతనో ఈనాంగ్రామంకాదని తీర్పులు వచ్చాయి 1936 అంతకు ముందునుంచీ రైతాంగం అనుభవిస్తున్న

Sri L Lakshmana Das ] [ 14th August 1956

హక్కులను కాపాడదామనే ఉద్దేశ్యంతోనే ఈ బిల్లును తీసుకు వచ్చామనే విషయం మనం మరచిపోకూడదు

రేపు తీసుకురాబోయే బిల్లు చాలా ప్రధానమైనది ఈ కండ్రికలు hamlet విషయాలు అంత ప్రధానమైనవి కావు

ఈనాడు బిల్లును తీసుకు వచ్చాము దీనిని ఎందుకు విడిచిపెట్టాలి ? 2వ బిల్లు కూడా వస్తుందని ఆశించాము ఈ బిల్లును తప్పకుండా pass చేస్తాము వీలైనంతవరకు ఈ sitting లోనే 2వ బిల్లును తీసుకురావాలని కోరుతున్నాను ఈ బిల్లును తీసుకురాకపోయినట్లయితే రైతాంగానికి మనం చాలా అన్యాయం చేసినవాళ్ళము అవుతామని ప్రభుత్వానికి హెచ్చరిక చేయక తప్పదు ఈనాడు కోర్టులలో వేసిన వ్యాజ్యములు పరిష్కారంకాక చాలామంది రైతులు బాధ పడుతున్నారు ఈబిల్లు త్వరలోవస్తుందని court వారు stay orders ఇస్తున్నారు కాబట్టి ఈ Sessions ముగిసేలోగా time చాలకపోతే ఇంకో 4 రోజులు ఉండైనాసరే ఈబిల్లును తీసుకురావాలని కోరుతున్నాను రేపురాబోయే బిల్లులో మనం చర్చించుకోవలసిన విషయాలు చాలా వున్నాయి 1947 లో శ్రీ వెంకట్రావుగారు ఈబిల్లును తీసుకువచ్చారు తరువాత దేశంలో అనేక మార్పులు జరిగాయి Court వ్యవహారాలలోపడి రైతులు అష్టకష్టాలకు గురియగుతున్నారు

ఈనాడు ఈభూములు వీరివా ? వారివా ? అని అయోమయస్థితిలోపడ్డం తప్ప ఫలానావారివి అని నిర్ధారణగా ఎవరూ చెప్పలేకుండావున్నారు రైతు బలంగావుంటే ఈనాందారును వెళ్లగొట్టడం ఈనాందారు బలంగావుంటే రైతును వెళ్లగొట్టడం మొదలైనవి జరిగే పరిస్థితులున్నాయి మనం సమగ్రంగా పరిస్థితులను పరిశీలించి తగునిర్ణయాలు చేసుకొనుటకుగాను Select Committee ఆంధ్రదేశం అంతా పర్యటించి పరిశీలించి వచ్చింది ఈనిర్ణయాలను రెండవబిల్లులో తప్పకుండా తీసుకురావాలి అప్పుడు మనమంతా దీనినిగురించి మాట్లాడవచ్చు ఈసమావేశం లోనే ఆబిల్లునుకూడా తీసుకువస్తామని ప్రభుత్వంవారు హామీయివ్వాలి అసెంబ్లీకి ఖర్చు అవుతుందని ఆలోచించకుండా ఇంకా 10 రోజులు సమావేశములను పొడిగించిఅయినాసరే ఈబిల్లును pass చేయడం చాలా అవసరం, ఉత్తమము లేనిచో రైతులు నిరాశచెందుతారు దీనినిగురించి బిల్లు pass అవుతోంది కొంతకాలం వాయిదా ఇవ్వండని Court ల లోని Pleaders కు చెప్పుకుంటున్నారు శ్రీకాకుళం జిల్లాలో 2 నెలలుకూడా వాయిదా ఇచ్చారు

ఈ సమావేశంలో బిల్లు pass అయివస్తుందని ప్రజలంతా అనుకుంటున్నారు ఇప్పుడు తీసుకువచ్చిన బిల్లు చాలా చిన్నది దీనివిషయమై ఎవరికీ

ఎట్లాంటి అభ్యంతరమూ ఉండదు తప్పకుండా pass చేస్తాము రెండవ బిల్లును మాత్రం వెంటనే తీసుకురావ లని కోరుతూ విరమిస్తున్నాను

SRI V VISWESWARA RAO — అధ్యక్షా ఈబిల్లు చాలా చిన్న బిల్లు దీనిమీద పెద్ద amendments లేవు అంతా అంగీకరించండి అని కొంత మంది మిత్రులు మాట్లాడుతూ చెప్పారు

పైగా రేపు తీసుకురాబోయేబిల్లు చాలా ప్రధానమైనది 10 15రోజులు time తీసుకున్నప్పటికీ ఎంతఖర్చు అయినప్పటికీ కూడా ఆ రెండవబిల్లును తీసుకు రావాలి అన్నారు

ఈ బిల్లుమీద ముగ్గురు మంత్రులు తమ అభిప్రాయాలను వెల్లడించడం అపూర్వమైన సంఘటన ఆ మంత్రులు కొంతమంది సభ్యులుకూడా ఈబిల్లు చాలా స్వల్పమైనబిల్లు కాబట్టి అంతా అంగీకరించండి అని నొక్కినొక్కి చెప్పుటకు ప్రయత్నించారు

THE HON SRI K VENKATA RAO — ఇదంతా ప్రయత్నమేకాని వారు నొక్కబడలేదుకదా!

SRI V VISWESWARA RAO — ఈబిల్లు pass అయి అమలులోనికి వస్తుందని రైతాంగం ఎదురుచూశారు ఈనాం విధానం వెంటనే రద్దుకావాలని కోరారు ఎప్పుడో జమీందారీ విధానంతోపాటే యిదికూడా రద్దవుతుందని ప్రజలు ఆశించారు ఇంతవరకు వారిఆశలు ఫలించలేదు అప్పటినుంచి రోజురోజుకీ వాయి దాలుపడుతూ ఈనాటికి రూపంలోకి వచ్చింది ఈ ప్రభుత్వం యేర్పడిన తరువాత ఈనాం విధానం రద్దవుతుందని రైతులు ఆశించారు ఇందుకు ఒక Select Committee ని నియమించారు ఈ కమిటీ ఏర్పడి చాలాకాలం అయింది Select Committee విచారణ జరగడం ఆబిల్లు శాసనసభలోకి రెండుసార్లువచ్చి తిరిగి వెనక్కుపోవడం జరిగిన తరువాతకూడా ఆబిల్లు చాలా చిన్నది ' అని మంత్రులు సోదరసభ్యులూ ఎందుకు అంటున్నారో అర్థంకాకుండా వుంది ' కొండనుత్రవ్వి ఎలుకను పట్టారు అన్న సామెతగా ఇంతకాలంనుంచీ ఈనాములమీద చర్చలు సాగించారు చివరకు Estates Land Act లో 3 (2) (d) ని సవరించాలని చిన్న సవరణను తీసుకువచ్చారు

ఈనాములో వున్నటువంటి కంద్రికలు, శివారులు అనేవి రాలేదుకాబట్టి అంతవరకే ఈ బిల్లును తీసుకువచ్చాం అంటున్నారు అయితే ఈనాటి పరిస్థితి ఏమిటి? అంతవరకే ఈబిలును తీసుకువ సే సరిపోతుందా ? అసెంబ్లీలో మొదటి

Sri V Visweswara Rao] 14th August 1956

సారి ఈబిల్లును ప్రవేశపెట్టినప్పుడు లేదా President's ordinance లో కంద్రికలు శివార్లుఅని కాకుండా 'Any Portion of the Inam' అని చెప్పారు

శాసనసభలో ఈ బిల్లును తీసుకువచ్చినప్పుడు ⅓ అన్నారు తరువాత దానినే ½ అన్నారు తరువాత రైతులకు సహాయం చేయాలనే దృష్టితో '⅓ of the inam villages' అని మార్చుటకు ప్రయత్నం చేశారు సాధ్యమైనంత త్వరలో సాధ్యమైనంత శక్తివంతగా రైతులకు సహాయం చేయాలనే ఉద్దేశంతోనే ½, ⅓ అనేవి any portion అనేది తీసేసి కంద్రికలు శివార్లు మాత్రమే అని పెట్టారు మళ్లీ అవి ఈనాం గ్రామాలుగా వుంచేసే కంద్రికలు శివార్లు అని పెట్టడం జరుగుతోంది కాని 3 (2) (d) ని సరైన రూపంలో సవరించటంలేదని చెప్పవలసి వుంటుంది ఈనాడు కోర్టులలో అనేక కేసులున్నాయి ఆకేసులున్న రైతులందరినీ రక్షించడానికిగాను ఈ బిల్లును సవరిస్తున్నామని చెబుతున్నారు అది బాగానే వుంది కాని మిగిలిన ఈనాముల విషయం ఏమిటి ?

మన దేశంలో సుమారు 3 వేల ఈనాము గ్రామాలున్నాయి అన్నీకూడా శివార్లు కంద్రికలూకాదు కొన్నింటిలో ఈనాంలో portion అని వున్నాయి ఒక ఈనాంలో వెయ్యి (1 000) ఎకరాలు ఉండవచ్చు దానిలో మిగిలిన 6 7 9 వందల ఎకరాలకు వేరే grants వుండవచ్చును అందువల్ల ఆ గ్రామాల నన్నింటినీ estates గా పరిగణించుటకు వీలులేదని హైకోర్టువారు తీర్పు ఇచ్చారు కోర్టులలో తగాదాలు పరిష్కారం గాని గ్రామాలు అనేకం ఉన్నాయి రేపు మళ్లీ ఏదో చట్టం రాబోతోంది అంటున్నారు ఈ మధ్యకాలంలో ఆ గ్రామాలన్నీ ఏమి కావాలి ? ఆ గ్రామాలలోని రైతులకు రక్షణ ఏమిటి ? ఈనాడు President's ordinance అనే రూపంలో వున్న Act ద్వారా రైతులకు కొంత రక్షణవుంది ఈ చట్టం pass అయితే రైతులకు యిప్పుడున్న రక్షణకూడా పోతుంది వారిని ఈనాందారులకు వశపర్చి భూములనుంచి వారిని తొలగించుటకు అవకాశం యేర్పడుతుంది

ఈ సందర్భములో ఒక ప్రక్కన కౌలుదార్ల ordinence అనేది ఉంది దానివల్ల వారు కౌలుదార్లుగా పరిగణించబడతారు కాబట్టి దానికి అవకాశం లేదని మన మిత్రులు అనవచ్చు దానికి యిప్పుడే నేను సమాధానం చెప్పవలసిన అవసరం ఉన్నది

కౌలుదార్లు ordinance ఉన్నప్పటికీకూడా అది రేపో, ఎల్లుండో లేక 23 వ తేదీనో చట్టం అవుతుంది అనాడు మేము దాంట్లో clause పెట్టుటకుగాని రైతులకు రక్షణ కల్గించుటకుగాని అవకాశంలేకుండా పోతుంది 'రేపో ఎల్లుండో

చట్టం తెస్తారుకదా అనే అభిప్రాయంతో ఈ బిల్లును ఆమోదించడమనేది 3 వేల గ్రామాలలో ఉన్నటువంటి రైతాంగానికి ద్రోహంచేయడమే' నని స్పష్టంగా తెలుస్తోంది రైతులను ఆ భూములనుండి తొలగించుటకు ఈనాందారులకు స్వేచ్ఛాస్వాతంత్రాలను కల్గించడంతప్ప వేరేమీకాదు

ఏదో రెండోచట్టము తెస్తాము దానిలో మంచిమంచి clause లు ఉన్నాయి ఈనాం విధానాన్ని పూర్తిగా రద్దుచేస్తామని మంత్రిగారు సెలవిచ్చారు ఈనామ్ విధానాన్నంతాకూడా రద్దుచేస్తామని ఈనాటికైనా దీనిని ఈరూపంలో ఆలోచిస్తామనడం సంతోషించాల్సినటువంటి విషయమే కాని ఈనాంలను రద్దుచేసేంత వరకైనా ఈబిల్లును ఆపడంలో వచ్చే ప్రమాదం ఏమీలేదనిమాత్రము నేనుస్పష్టంగా అభిప్రాయపడుతున్నాను ఆ రెండో బిల్లును దీనిని రెంటిని కలిపి పెడితే వీలుగా ఉంటుంది కంద్రికలు శివార్లుకాకుండా ఈనామ్ village లో ఉన్నటువంటి సగం గాని మూడవవంతుగాని లేకపోతె కొంతభూమిగాని ఉన్నటువంటి రైతాంగానికి కూడా కొంత రక్షణ ఉంటుంది వాళ్ళందరిని వెళ్ళగొట్టేందుకు ఈనాందారుకు హక్కులేకుండా ఉన్నది అందువల్ల ఆబిల్లును ఈబిల్లును కలిపి తీసుకురావడంవల్ల మనబిల్లు ఏరూపంలో ఉంటుందో రైతులకు ఏవిధంగా సహాయం చేయగలుగుతున్నామో ఏవిధంగా మనచట్టం రైతాంగానికి ఉపయోగపడుతుందో ఆలోచించడానికి అవకాశంవుంటుంది అందువల్ల ఎప్పుడో ఆచట్టం చేస్తామనే హామీతో ఈనాడు ఈచట్టం చేయడంవల్ల ఆంధ్రదేశంలో ఉండే 3000 గ్రామాలలో ఉన్నటువంటి రైతాంగానికి తీరనటువంటిహాని కలుగజేసిన వాళ్ళం అవుతాము హైదరాబాద్ కు వెళ్లేలోపలే ఆబిల్లునుకూడా తెస్తామని చెపుతున్నారు బిల్లులో clause లు ఏమైనప్పటికి President గారి అంగీకారంతో తెస్తామని చెపుకున్నారు 23 వ తేదీతో శాసనసభ అయిపోకుందని చెపుతున్నారు ఏమిజరిగినప్పటికి మనం యింత వరకు కాలయాపనచేస్తూ వచ్చాము ఈ ఈనామ్‌బిల్లును ఇప్పటికి 4 5 సార్లు వాయిదా వేశారు ఇదిగో తెస్తాముని అదిగో తెస్తాముని అనేక సందర్భాలలో వాగ్దానాలు చెయ్యడం జరిగింది కాని Constitution లో ఉన్నటువంటి ఇబ్బందుల వల్ల లేకపోతే కేంద్రప్రభుత్వముయొక్క అంగీకారం పొందడం దీనికి retrospective effect ఉండాలా ? లేదా ? అనేటటువంటి వాటివల్ల చట్టంలో ఉన్నటువంటి కొన్ని ఇబ్బందులవల్ల అనేకసంవత్సరాలుగా వాయిదాపడుతూ వచ్చింది ఇప్పటికి 3, 4 సంవత్సరాలుగా ఈనాంబిల్లుతెస్తామని వాగ్దానాలుచేస్తూ వస్తున్నారే గాని చట్టం రూపొందించడానికి అవకాశంచిక్కలేదు దీనిని త్వరగా తీసుకురావాలనేటటువంటి పవిత్రఆశయం ఉన్నప్పటికీ ఆ ఆశయం నెరవేరాలంటే చాల time తీసుకోవచ్చు అన్నివిషయాలను సమగ్రంగా ఆలోచించి సమగ్రస్వరూపంతో

ఈనాముల రద్దుబిల్లును త్వరలో తీసుకొని రావలయునని కోరుతున్నాను ఈబిల్లు శాసనసభలో ప్రవేశపెట్టిన నాటికి సెలక్టుకమిటీలో చర్చించేనాటికి ఈ బిల్లుయొక్క-స్వరూపం మంత్రిగారు ఇచ్చినటువంటి amendment చూస్తే చాలా simple amendment అని బోధపడుతుంది ఈ simple amendment కొరకు ఇంతకర్మకాండ ఎందుకు జరిగాల్సివచ్చిందో నాకుమాత్రం అర్థంకావడంలేదు ఆ రెండోబిల్లు వచ్చినప్పుడు దానిని గురించి ఆలోచించడం తేలిక అవుతుంది కాబట్టి ప్రస్తుతానికి ఈబిల్లు పూర్తిగా వాయిదా వేయాలని మరొకసారి కోరుతున్నాను దానిలో ఉన్నటువంటి ambition చాల స్పష్టంగా ఉన్నది మీరు కంద్రికలను శివార్లను కలుపుతున్నారు మా జిల్లాలో 300 ఎకరాలు కలిగిన గ్రామం ఒకటి ఉన్నది Inam Committee బెజవాడ వచ్చినప్పుడు వారికి నేను చూపించాను ఒక గ్రామంలో రెండు గ్రాంటులున్నాయి ఆ గ్రామములో ఉన్నటువంటి 600 ఎకరాలలో ఒక గ్రాంటు 301 ఎకరాలకు రెండో గ్రాంటు 299 ఎకరాలకు ఉన్నది దానివల్ల మీరు సగం అని పెట్టినప్పటికీ కూడా 200 ఎకరాల గ్రాంటుగల రైతులు ఈనాంక్రిందికిరారు ఇవి రెండు రెండుసార్లు ఇవ్వబడినటువంటి ఈనాం గ్రాంట్లు మొత్తం ఈనాందార్లందరు రద్దుచేయాలని నేను ఇదివరకే సూచించాను ఇటువంటి పరిస్థితులలో ఆ గ్రామం దీని క్రిందకు రాకుండాపోయే ప్రమాదం ఉన్నది రైతులందరు ఇప్పటికే కోర్టులో ఉన్నారు వాళ్ళకు కోర్టుల్లో ఉండే రక్షణకూడా మన చట్టంద్వారా పోతుంది కనుక ఈ మధ్యకాలంలో రైతులు ఇబ్బందులు పడనీయకుండా దీంట్లో సవరణ అయినా చేర్చాలి ఆ సవరణను ప్రభుత్వం అంగీకరించకపోతే మొత్తం బిల్లునే వాయిదా వేస్తే తరువాత రెంటిని కలిపి ఒకేసారి ఆలోచించడానికి అవకాశం ఏర్పడుతుందని తెలియజేస్తూ ఇంతటితో నేను సెలవు తీసుకొంటున్నాను

SRI S K V KRISHNAVATHARAM —అధ్యక్షా ఇప్పుడు ప్రవేశపెట్టినబిల్లు సెలక్టు కమిటీ సూచించిన సమగ్రమైన బిల్లుగా లేదని అందువల్ల కొన్ని ఇబ్బందులు వస్తాయని చాలమంది ఇరువక్షాల తరపున సూచించారు కాని అలాంటి ఇబ్బందులు రావడానికి ఎంతమాత్రం సావకాశంలేదు అందులో ప్రత్యేకంగా రెండోబిల్లునుకూడా త్వరితగతిలోనే వారు Assembly ముందుకు తీసుకు వస్తారని ఆ రెండో బిల్లును తీసుకురావడానికి President యొక్క అంగీకారం కావాలని Constitutional గా కొన్ని ప్రతిబంధకాలు ఉన్నాయని ప్రభుత్వ పక్షం నుంచి చెప్పబడింది అయితే దానిని గురించి అట్టే భయపడవలసిన అవసరంలేదని చెపుతున్నాను అయినప్పటికి ఈ బిల్లు ప్రవేశపెట్టిన విధానం చూచినట్లయితే, బిల్లు యొక్క దృక్పథంలోనే కొంత పొరపాటు ఉన్నదని నేను మనవిచేస్తున్నాను

[14th August 1956 [Sri S K V Krishnavatharam

ఈ బిల్లు ప్రకారం కంఁడిక hamlet అనేవి compact block కు చెందినవని పెద్ద block కు చెందిన కారణంచేత దీనివల్ల పెద్ద ఈనాందార్లందరు నష్టపడతారని రెవెన్యూ మంత్రిగారు చెప్పినదానినిబట్టి చూస్తే అలా సూచనగా ఉంటుంది వారు చెప్పినప్రకారము అది కేవలం పెద్ద ఈనాందార్లను నష్టపరచేది కాదని hamlets గాని కంఁడికగాని ఈన ము గాని మొట్టమొదట ఇచ్చిన రూపంలోనే ఇప్పుడు లేవని చాలకాలం క్రిందటనే ఆ ఈనాములు ఇవ్వడంవల్ల అవి వంశపారం పర్యంగా వస్తున్నందువల్ల అవి పంపకంవల్లగాని ఇతరత్రా కొన్ని alienations జరిగడంవల్ల నేమి అవన్నీకూడా చాల చిన్నచిన్నవిగా భాగింపబడినవని తెలియ జేస్తున్నాను ప్రస్తుతంలో అలాంటి గ్రామాలలో ఈ బిల్లుక్రిందవచ్చే ఈనాందార్లు 5 ఎకరాలు 10 ఎకరాలకంటె ఎక్కువ వచ్చే వాళ్లు చాల కొద్దిమంది మాత్రమే ఉంటారని నేను మనవిచేస్తున్నాను ఈనాందార్లుకూడా జమిందార్లవంటి వారే ననేటటువంటి దృక్పథంలో మనం బైలుదేరడంవల్ల ఈ పొరపాటు రావడం జరిగింది దీనివల్ల చాల అక్రమంగాకూడా జరుగుతుంది ఇలాంటి కంఁడికలలోను hamlets లోనుకూడా 2 ఎకరాలు 3 ఎకరాలు 5 6 ఎకరాలవరకు ఉన్న ఈనాందార్లు చాలమంది ఉన్నారు ఈనాందార్లలో చాలమంది మనోవర్తి దారులు మైనర్లు తమంతటతామే హక్కులను కాపాడుకోలేని రక్షణలేని అనాథలు ఉన్నారు వారందరికీకూడా ఈ బిల్లువల్ల చాల నష్టంవస్తుందని మనవి చేస్తున్నాను

ఈలాంటి పరిస్థితుల్లో ఇప్పుడు ఈబిల్లునుయథాతథంగా ఆమోదించినట్లైతే (hamlets, కంఁడికలు ఇవన్నీ estates అని) దానివలన Rent Reduction Act క్రింద rent reduction జరుగుతుంది ఆ జరిగే rent reduction మొత్తంమీద వాళ్లకు ఇచ్చేటటువంటి compensation చాలాతక్కువగాఉంటుంది అది నామ మాత్రంగా ఉండడమనేది జరుగుతుంది ఇప్పుడు 'estate అనేదానికి ఈ నిర్వచనం తీసుకువచ్చి దానికి rent reduction apply చేసి ఆవిధంగా compensation ఇవ్వాలనే ఉద్దేశంతో తక్కువ compensation ఇచ్చేనిమిత్తం ఇదిచేయడంవలన చాలామట్టుకు చిన్న ఈనాందారులకు హానికలుగుతుందని నేనుమనవి చేస్తున్నాను మిగత చిన్న ఇనాందార్ల విషయములో వేరేబిల్లు తీసుకువస్తున్నామని, ఆబిల్లులో ఇనాముదార్లు రైతులయొక్క సంబంధాన్నిగురించి ఏవిధంగా ఉద్దేశించారో శ్రీ కళావెంకట్రావుగారు చెప్పుతూ portions of the Inams కు సంబంధించినంత వరకు ఒకవంతు ఇనాందారుకు, రెండువంతులు రైతుకు ఇచ్చేటట్లు ఆవిధంగా ప్రభుత్వము ఒక మార్పును ఈ అసెంబ్లీముందర తీసుకొని వస్తుందని ఇందాకా వారు చెప్పారు ఈసందర్భంలో ఇప్పుడు ఈబిల్లుప్రకారం affect అయ్యేటటువంటి

ఇనాందార్లందరికికూడా మామూలుగా Estates Abolition Act క్రింద ఇచ్చేటటువంటి compensation కంటె కూడా భూమి రూపేణా ఒక proportion ఏర్పాటు చేసి అందులో వకవంతు ఇనాందారున్నూ రెండువంతులు రైతున్నూ తీసుకొనే పద్ధతిలో చేస్తే చాలాబాగుంటుందని నేను సూచిస్తున్నాను ఈ abolition వల్ల చాలా చిక్కులు ఏర్పడుతాయి మన రాష్ట్రము చాలా లోటు బడ్జెటులో ఉన్నది Estate Abolition Act క్రింద ఇచ్చేటటువంటి compensation ను మన State లో ప్రభుత్వమే పూర్తిగాభరిస్తున్నది కాని U P లోను ఇంకాకొన్ని ఇతర States లోను కొంత రైతాంగము మీద వేసి వారు దానిని ఒకేసారిగాగాని కొన్ని వాయిదాలమీదగాని తీర్చుకొనేపద్ధతి ఉన్నది కాని ఆపద్ధతి మనరాష్ట్రములో లేదు లోటుబడ్జెటులో ఉన్నమనము ఈ ఇనాం దార్లకు compensation ఇచ్చుకొనేబాధ్యత తీసుకోకుండా State కు దీనివల్ల ఆర్థికనష్టము రాకుండా ఈ సమస్యను పరిష్కరించవలసి యున్నది అందులో ప్రస్తుతము మనము planning లో ఉన్నాము దానికి డబ్బుచాలా అవసరముగా ఉన్నది అటువంటప్పుడు ఈ సమస్యను పరిష్కరించడానికి further commitments చేయకుండా ఈ బిల్లువల్ల affect అయ్యే రైతులకు ఇనాం దార్లకు ఆభూమిని ఒక Proportion లో ఇచ్చేవిధంగా చేయవలసిందని కోరుతున్నాను తరువాత Inam Tenants Protection Act ను రద్దుపరచేటట్లు ఈ Act లోనే ఒక clause లో ఉన్నది దానిని ఇప్పుడప్పుడే repeal చేయకూడదని ఈ సమస్య పరిష్కారమైనప్పుడు దానంతటది repeal అవుతుందని కనుక ఆవిధంగా మార్పు చేసుకొన్నట్లయితే బాగుంటుందని చెప్పుతూ మరొకతూరి సంఘంలో అన్నివర్గాలను సంతృప్తిపరచే నిమిత్తం మనము చిన్న ఇనాందార్లయొక్క కష్టాలనుకూడా దృష్టిలోఉంచుకొని రైతుకు ఇప్పుడు దీనినిబట్టి ఇచ్చేభూమిలో రైతుఆధీనంలో ఉండే భూమిలోనుంచి ⅓ భాగం ఇనాందారుకు ఇచ్చేటట్లు చేసినట్లయితే బాగుంటుందని సూచిస్తున్నాను

SRI B APPA RAO —అధ్యక్షా ఈ ఇనాముసమస్యలు రావణాసురుని కాష్టంవలె కాలుతూనే ఉన్నాయి మనరాష్ట్రములో ముఖ్యంగా రైతాంగములో విప్లవ రాజకీయాలకు ఈ సమస్య ఒక ఆలవాలమైపోయినది ఈ విషయాన్ని ఎప్పుడో మన కాంగ్రెసు గుర్తించింది ఒక నిర్ణయానికి వచ్చింది దీన్ని పరిష్కరిద్దామని కాంగ్రెసు సంస్థ నిర్ణయంచేసింది గాని కాంగ్రెస్ ప్రభుత్వమునకు తగినంత ధైర్యము చాలకుండా ఉన్నది ఖచ్చితముగా పరిష్కారంచేయలేకుండా ఉన్నది ఒక్క విషయం నేను మనవిచేయ దలచుకొన్నాను ఇప్పుడేదో కొండంత ఆశపెట్టుకొన్నాము దీనికి Select Committee వేశారు అందులో తగినంత అనుభవము గలిగినటువంటి వ్యక్తులు ఉన్నారు ముఖ్యంగా దీనికి సూత్రధారు

దైనటువంటి కళా వెంకటరావుగారు ఈ కమిటీలో ఉన్నారు అందుచేత తప్పని సరిగా ఇప్పుడైనా పరిష్కారమైపోతుందేమోనని అనుకొన్నాము కాని ఈ బిల్లు స్వరూపమే చూస్తాయుంటె కొండను త్రవ్వి ఎలుకను పట్టడమే అయింది బంగారును సాధిస్తామని కొండను త్రవ్వారు కాని ఇది చూస్తే ఎలుకను పట్టడమే అయింది సమస్యలేమో ఆవిధంగానే ఉండిపోయినవి కొంతమంది ఇనాం ప్రాంతంనుండి రానటువంటి సభ్యులు దీనియొక్క seriousness అంతగా గమనించకపోవచ్చును కాని మాకు తెలుసును వెంకటరావు పంతులుగారికి కూడా తెలుసును ఎక్కడైతే సరస్వతి కలిగినటువంటి ఇనాందార్లు ఉన్నారో అక్కడ సమస్యలు సత్వరంగా పరిష్కారం కావడానికిని ఎలిచి మాట్లాడుకోడానికిని కొంత ఆస్కారము ఉంటున్నది లేకపోతే కోర్టులు లేకపోతే బాయోనెట్స్ బుల్లెట్స్ లాటీల వ్యవహారాలు అక్కడ విచ్చలవిడిగా వస్తున్నాయి ఇట్టిపరిస్థితులలో ఈబిల్లును తీసుకువచ్చి ఈ సమస్యను ఇక్కడ ఆవిధంగానే వదలిపెట్టడం అనేది ధర్మంకాదు ఇంకొక బిల్లు త్వరలో తీసుకువస్తామని అంటున్నారు ఎటూ ఇంత జాప్యం జరిగింది ఇంతలోనే ఈబిల్లును ఎందుకు తీసుకురావాలి ? ఒక Select Committee పరిశీలనచేసి సమగ్రమైన నివేదికను ప్రభుత్వము ముందు ఉంచినపుడు ప్రభుత్వము రాబోయే బిల్లులోని సారాంశాన్ని కూడా దీనితో కలిపి పొడించి ఒకేబిల్లు రూపములో వచ్చే నెలలో ఎందుకు ప్రవేశ పెట్టరాదు ? ఈ విషయంలో opposition వాళ్లు ఏదో అంటున్నారని కాదు మనముచేసినటువంటి వాగ్దానాలను కాంగ్రెసుచేసినటువంటి తీర్మానాలను మంత్రి కళా వెంకటరావుగారు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ ఉపాధ్యక్షులుగా ఉండినప్పుడు తమచేతులతో ప్రవేశపెట్టిన తీర్మానాన్ని కాంగ్రెసుకు తగినంత majority ఉన్నప్పుడే ఎంత వేగముగా ఈ ఈసమస్యను పరిష్కారంచేసుకొంటె అంతమంచిది అవునా కాదా అనే విషయము ఆలోచించుకోవాలి ఇప్పుడేదో మనము ఈవిధంగా వెళ్లుతాము వచ్చే నెలలోనే ఇంకేమైన urgent సమస్యలు రావచ్చు తరువాత హైదరాబాదు వెళ్లుతాము అక్కడ పరిస్థితులు ఇంకోవిధంగా ఉంటాయి ఇప్పుడు ఒకకొత్తవాదన వచ్చింది అసలు సిద్ధాంతాన్ని వెనుకపెట్టేటటువంటి వాదన రాష్ట్రప్రభుత్వానికి తగినంత ఆర్థికస్థితిలేదు కాబట్టి compensation విషయము ఇప్పుడు ఎత్తుకోలేము కనుక ఇనాందారుకు కొంతభూమిని, కొంతభూమినేమో రైతుకు ఇద్దాము అనేవాదన ఇటీవల లేవదీశారు సిద్ధాంతంమీద మనము ఇనాములను రద్దుచేయాలని అనుకొంటున్నామో దానికే ఇది విరుద్ధంగా ఉన్నది ఇన్ని వాదోపవాదాలు ఎందుకు జరిగాయి ? ఇంత ఆందోళన దేశములో ఎందుకు జరిగింది ? ఈమానవ నాగరకతకు విరుద్ధంగా ముందెప్పుడో జమిందార్లచేత ఇవ్వబడినటువంటి ఈదానపత్రాలలో

Sri B Appa Rao] [14th August 1956

సంక్రమించినటువంటి ఇనాందారుడి హక్కు తీసి ఆనాటినుంచి ఉంటున్న రైతుకే ఇచ్చి ఇనాందారులు దానిని నమ్ముకొని ఉన్నారు గనుక ఆ ఆస్తిమీద ఆధారపడి ఉన్నవారికి ఏదో కొంత compensation ఇస్తామని అనుకొన్నాము ఆవిధంగా అనుకొన్నప్పుడు ఇప్పుడు ఇనాందారుకు భూమిఇస్తే దాని possession ఉండేటటువంటి రైతు ప్రాణాలకైనాసరే లేక బందూక్ బయెనెట్ కైనాసరే జైలుకైనాసరే సిద్ధపడుతాడుగాని భూమి ఇవ్వడానికి ఆనాడే ఒప్పుకోనటువంటి రైతు ఈనాడు ఒప్పుకొంటాడు అనేది ఎవరూ ఊహించలేనటువంటిది ఏ పరిస్థితుల లోను ఒప్పుకోడు నాగరిక ప్రభుత్వములో జరిగేటటువంటి ఈనిర్ణయాలవల్ల రైతాంగానికి తగాదాలు పెంచడమేకాకుండా వాటిమీద Tribunals మాత్రమేకాకుండా వాళ్ళపరిస్థితులు criminal గా కూడా తీసుకువచ్చిన వాళ్లమౌతాము కనుక దీనిని గురించి మనము తుణ్ణంగా ఆలోచించుకోవలసియున్నది మంత్రివర్గము ఈవిషయం గురించి కూర్చొని Select Committee వారు ఇచ్చినటువంటి నివేదికను తుణ్ణంగా పరిశీలించి ప్రభుత్వానికి ఆర్థికస్థితిలేనప్పుడు ఆర్థికస్థితిప్రజలమీద ఆధారపడిఉంటుంది కాబట్టి రైతుకు ఇచ్చేటటువంటి భూమికి market value నో మరొకపద్ధతిన విలువకట్టి ఏరైతే ఆ భూమిమీద హక్కు పొందుతున్నాడో ఆరైతే ఆవిలువను 20 వాయిదాలలో తీర్చుకొనే పద్ధతిలో పరిష్కారము చేసినట్లయితే మన ఆర్థిక స్థితికి కూడా లోటు ఉండదు సమస్యనుకూడ పరిష్కరించినట్లవుతుందని మనవి చేస్తున్నాను

కాని అవతల సిద్ధాంతాన్ని పెడమార్గము పట్టించవలెననే ఉద్దేశ్యముతో యింకొక బిల్లును తీసుకుని వస్తున్నామని ప్రభుత్వం చెబుతున్నది ఈ విషయాలన్నీ శ్రీ కళా వెంకట్రావు పంతులుగారికి తెలియనివికావు ఏదో Estates Abolition Act లో Section 3 (2) (d) ను సవరణచేస్తున్నామని చెబుతున్నారు ఈ విషయములన్నీ దేశములో ఉన్న ఈనాందార్లకు యీనాము రైతులకు ఉన్నటువంటి హక్కులు బేహక్కులు ఎన్నిరకములుగా ఉన్నవో అందులో ముఖ్యంగా మా విశాఖపట్టణము జిల్లాలో గ్రామములన్నీ లెక్కచూస్తే 72 73 74 78 గ్రామాలు యింకా పైగానే ఒక్కొక్క తాలూకాలోనే ఉంటున్న పరిస్థితులలో కాంగ్రెసుపేరట మేము వాలంటీర్లుగా ప్రచారముచేసిన దినములలో A P C C మెంబర్లుగాను D C C మెంబర్లుగాను ఉన్నదినములలో యీ విషయాలన్నీ ప్రజలకు బోధించి చెప్పినమాటలు రైతులకు ఉన్న హక్కులనుగురించి చెప్పినమాటలు తెలియనివికావు ఇక ఈ విషయమునుగురించి వేరే నేను యిక్కడ సభఎదుట చెప్పవసరము లేదు వారు యీనాడు ప్రభుత్వ సారథ్యములో వున్నారు ప్రభుత్వ సారథ్యము వహించియున్నారు కాబట్టి యీ విషయమును

మరొకసారి ఆలోచించమని అంటున్నాను వేరేబిల్లు తీసుకునివస్తామని అంటున్నారు గనుక యింతలోగా మించిపోయినది యేమీలేదుగనుక ఈనాం రైతులు కౌలుదార్లనుగురించి ప్రభుత్వం ప్రకటించిన ordinance ద్వారా వాళ్లకు సంక్రమించిన హక్కులకు భంగమురాకుండా protection ఏర్పడింది కాబట్టి యీనాడు మంత్రి వర్గానికి చేసే విజ్ఞప్తిని అనుసరించి దీనికి discipline indiscipline అనేవిధముగా మన పెద్దలు భావించకుండా ప్రభుత్వంవారు తీసుకునిరాదలచిన సమగ్రమైన బిల్లును ఒకే పర్యాయము తీసుకునిరావలెనందిగా కోరుతూ యీనాడు ప్రతిపాదించిన సవరణ అనవసరమని చెబుతున్నాను ఈసవరణ ప్రజలలో ఆందోళనకు అరాచకచర్యలకు అల్లకల్లోలాలకు దారితీస్తుందని ప్రభుత్వానికి హెచ్చరిక చేస్తున్నాను కాబట్టి యీ సవరణ ప్రస్తుతము ఆపవలెనందిగా విజ్ఞప్తిచేస్తూ విరమిస్తున్నాను

Mr DEPUTY SPEAKER — సభ రేపు ఉదయం 8—30 గంటలకు వాయిదా వేయడమైనది

(The House then adjourned )